అదేమీ
ఇంద్ర
జాలం
కాదు..



## సబ్బు మాత్రమే

మేము దానిని గురించి ఉన్నదున్నట్లుగానే చెబుతాము. ఈ ప్రకటనద్వారా మేము అమ్మ వలసిన దల్లా భాగ్యవంతులకూ బీదవారికీ ఒకే మాదిరి అందుబాటులో ఉండే ఒక మంచి రకపు సబ్బు మాత్రమే. కాంతి సబ్బు మీకు సౌందర్యం, ప్రణయం, ఇంకా అనేక ఇతర విషయాలూ ఇస్తుందని మేము వాగ్దానం చెయ్యబోవటం లేదు.

కాని "కాంతి సబ్బు మనోహరమైన పరిమళంగలది. ఎంత సున్నితమైన చర్మాన్నయినా చెరుపుచెయ్యదు." అని మాత్రం మేము యదార్థంగా చెప్పగలం.

స్వస్తిక్ వారి శ్రేష్ఠమైన ఇతర వస్తువులలో కొన్ని : శీకాయ సబ్బు, పరిమళ ఆముదం, స్వస్తిక్ షేవింగ్ స్టిక్, బట్టల సబ్బులు, గోవాలిస్ బ్రాండు వనస్పతి మొదలయినవి.




# కాంతి సబ్బు

నాణ్యతకు సాటిలేనిది.

SHILPI

Som. 10—Telugu

## స్వస్తిక్ ఆయిల్ మిల్సు లిమిటెడ్, బొంబాయి.

| సేల్సు డిపో, మద్రాసు. | సేల్సు డిపో, బెంగుళూరు. | సేల్సు డిపో, కొచ్చిన్. |
|---|---|---|
| 14 సి. స్ప్రింగ్ స్ట్రీట్. | ఆర్కాట్ శ్రీనివాసాచారి వీధి, | బజారు గోడౌన్, |



# విషయానుక్రమణిక

## ఆగస్టు,



త్రివర్ణ చిత్రము : భగ్నవీణ.



కీ. శే. శ్రీ కోటంరాజు పున్నయ్యగారు




సంపుటము **25** | ఆగస్టు, **1948** | సంచిక **8**
సర్వధారి ఆషాఢము

# భారతస్వాతంత్ర్య పర్వదినము

●

**శ్రీ బులుసు వేంకటేశ్వర్లు**

౧

పరదేశనరపాలపరిపాలనావధి భారతస్వాతంత్ర్యపర్వదినము
బహుభారతీయతపస్సిద్ధిశుభతిథి భారతస్వాతంత్ర్యపర్వదినము
సకలప్రపంచవిజ్ఞప్రమోదకరంబు భారతస్వాతంత్ర్యపర్వదినము
ప్రాగ్దేశదైన్యజీవనజనాశాజ్యోతి భారతస్వాతంత్ర్యపర్వదినము
భారతీయుల నోముల ఫలము పరమ-భవ్యదివస మాబాలగోపాలమునకు
నవ్యజవజీవసంపదున్నతికరంబుఁ-బరమభారతస్వాతంత్ర్యపర్వదినము.

౨

తమ సమస్తము భారతస్వతంత్రతకునై ధారపోసిన మహాధార్మికులును
భారతస్వాతంత్ర్యఫలసిద్ధికై పోరి జీవముల్ విడిచిన పావనులును
తమ యమోఘపు జీవితములు కారాగృహంబులకె యర్పించిన పూతతనులు
ఆశయసిద్ధి కత్యాచారము లోనర్చి ధీరులై మడిసిన వీరవరులు

పరమసంభావనీయు లెప్పటికి మనకుఁ - బ్రథమపరిగణనీయు లెప్పటికి మనకుఁ
బ్రబలగౌరవనీయు లెప్పటికి మనకు - భవ్యభారతస్వాతంత్ర్యపర్వములను.

3

సత్యం బహింసయు శస్త్రాస్త్రసమితి, సత్యాగ్రహంబె ప్రబలాయుధంబు
కదురుగవ్వంబులే ఖడ్గముద్గరములు, కద్దరుబట్టలే కవచములును
నూలుతీయులె శత్రుజాలంబునసువులు తీయుటల్ త్రెంచుటె త్రెంచుటలును
అమలమానవుల నిరాహారదీక్షలే శత్రుమారణయంత్రసముదయములు
విమలభారతస్వాతంత్ర్యసమరమందు - భారతీయుల యాయుధపరికరములు
మఱవరానివి ముల్లోకమానవులకు - భవ్యభారతస్వాతంత్ర్యపర్వములను.

౪

ఉపనిషన్మతము గీతోపదిష్టమతంబుఁ దనరఁగా భారతాదర్శములుగ
అమృతభాష యనంగ నలరు సంస్కృతభాష భారతజాతీయభాష గాఁగ
దుస్సహదుర్ధర్షదుర్మార్గ మగు శత్రుసమితి తనంతఁ దా సమసిపోవ
శ్రీమంత మగు పూర్వరామరాజ్యంబుగా మనవారు మనలఁ బాలనముసేయ
అఖిలదుఃఖాదికంబులు నంతరింప - భరతలక్ష్మియు నూతనప్రభ గడించి
పఱలుఁగావుత విఖ్యాతవైభవమున - సర్వతంత్రస్వతంత్రమై యుర్వియందు.

౫

మంచికో చెడ్డకో మన రాజ్యమును మన కిచ్చి పోయిన యాంగ్లనృపులఁ దలఁచి
కష్టమో సుఖమొ విఖండితదేశపాలన కొప్పుకొన్న వారిని గణించి
మతమౌఢ్యమో లేక మతరక్షణభ్రమమో వెఱ్ఱులైన ద్రోహుల నడంచి
కయ్యమో నెయ్యమో గమనింపఁజాలని మూర్ఖులకును దగు బుద్ధి చెప్పి
మరల స్వాతంత్ర్యదివసంబు మగిడి వచ్చు - లోపలనె రామరాజ్యసంస్థాపనమ్ము
నాయకాగ్రణు లొనరింప, నడచుఁగాక - ధర్మదేవత నలుగాల ధరణియందు.

---

# కృత్యాది: కుకవినింద

●

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

తెనుఁగులోని కృత్యాది విడ్డూరమైనది. కృతి శ్రీకారముతో నుపక్రమించుట, ఇష్టదేవతా పరంపరాస్తుతి, సుకవికుకవుల పురస్కారతిరస్కారములు, గ్రంథకరణములోని యుద్దేశము, కర్తృభర్తల యుభయవంశాభివర్ణనము, అభ్యుదయపరంపరాభివృద్ధిగ షష్ఠ్యంతములతో మెలికలు తిరిగి నరపాలుని చేతిలోఁ గృతి నుంచుట—ఈ సంప్రదాయములు సమస్తము తప్పనివి. వీనిలో నేయొకటియు కొఱవడుటకు వల్లఁగాదు. తక్కువ చేసినవాఁడు ప్రబంధ కవి కాఁడు. ఈ కృత్యాదిలోఁ గొండఱకుఁ గలలు వచ్చును. కలలో దయ్యము కనఁబడి యిది వ్రాయు మని శాసించును. మఱునాఁడా కవి గంటము తీసి యారంభించును. కృతిరచన కడముట్టినపదపడి కల వచ్చి నా కంకితముగాఁ గృతి రచింపు మని యడుగును, లేదా, ఫలానా రాజునకు సమర్పింపు మని నియమించును. అపుడు సిద్ధాన్నమును గ్రంథకర్త ఆసామికి వడ్డించును. స్వేష్టకృత్తుగా నతఁడు తిని త్రేన్చి, కవికి అగ్రహారములో, మడులో, మాన్యములో పసదన మొసఁగును. అంతతో మనసు దీఱక, ఆ కవికి బ్రహ్మరథము పట్టును. అగ్రాసనముపై నధిష్ఠింపఁజేసికొనును.

సవ్యముగా ముందే స్వప్నమునం దొక కవికి అద్వయబ్రహ్మ యగపడి కృతి సంతరింపు మనును. తోడుతోడ నతఁడు మేలుకని శ్రీకారము చుట్టును. గ్రంథాంతగద్య మయినతరువాతఁ గృత్యాదిలో పుట్టుపూర్వోత్తరములు ఏకరవుపెట్టును. ఇది యొక రకము. ఈ వచ్చిన కల యతనికి కర్మము చాలక వచ్చినది. ఇఁక పిల్లవారికిఁ దెల్లవాఱులు కలలే. ఏ కాళిదాసుని చూచియో, షష్ఠ్యంతములతో నొకఁడు కృతిసమర్పణము చేయును. అది దంపుళ్ళపాట కావలయును. షష్ఠ్యంతములు కందదుంపలతోనే కలిపి వండవలయును. మఱొక వృత్తము దాని కర్తదు.

ఒక యేలిక జాంబూనదాంబరాభరణాదులతోఁ గవిని గౌరవించి నాపేరఁ గృతి రచింపు మని నోయిలించును. అది చూచి పెండవ భూపాలుఁడు ఒడ్డోలగంబై కూరుచుండి మఱియొక కవిచే మహాకృతి వ్రాయించుకొని వినును. రాజాంకితముగాని కృతులు, కృతిపతికులాభివర్ణనపు బరువు మోయని బండ్లు మన వాఙ్మయములో నెన్ని యుండును? ఆయనకృతిపతి ఆయన నడిగినటులే ఈయనకృతిపతి యీయన నడుగును. నాఁటి కృతిభర్త యొక యద్భుతచరిత్రుఁడు. శ్రీనాథుని వీరభద్రారెడ్డి వేఁడినటులే, రాయలు పెద్దనగారిని కోరును. సరిగా వీరభద్రారెడ్డి యే తూకములో నడిగెనో, రాయలుకూడ ఆ తూకములో నడుగును. అటు లడిగితీరవలయును. కానిచో, కవికిఁ దలవంపులు; రాజునకు మోజు తక్కువ.

అందఱును గృతిప్రశస్తి గుర్తించి భర్తలగుట సర్వత్ర పట్టని గుణము. గద్దియమీఁదఁ గూరుచుండిన ఱేనికిఁ గొన్ని పను లుద్దిష్టములయియుండును. ఛత్రచామరాదులతోడివి సప్తసంతానములు. తత్సంతాన ప్రతిష్ఠ భూపాలునకు విధివిహితకర్మ. వానిలోఁ గృతి యొకటి. అగ్రహారము నిర్మింపవలయు నని పురోహితుఁడు నరపతితోఁ జెప్పును. రాజు 'కానిండు' అని యొప్పుకొనును. తటాకము త్రవ్వింపవలయు నని యెవరో చెప్పుదురు. సరే యని యేలిక యంగీకరించును. అల్లే సంస్థానకవి సందు చూచుకొని, ప్రభువు వారి పేరఁ గృతి వ్రాయింపఁజేయుఁడని పలుకును. అభ్యుపగమసూచకముగా రాజు తల యూఁపును. అని, స్థూలముగా మన మనుకొనుట. సాధారణమైన సత్త

సంతాననిర్మాణమునకంటెఁ గృతివిషయములోఁ గొంత విశేష ముండియుండవలయు నని నేను చెప్పవచ్చిన మాట.

కృతిపతి కాఁదగిన వానికి హృదయకోశములో సాహిత్యస్పందన ముండవలయును. అటు లుండనిచో నగ్రహారప్రతిష్ఠకువలె, కృతినిర్మితికి వాఁడు అంగీకృతి తెలుపఁడు. తెలుపలేఁడు. అతని యొప్పుదల లేక సంస్థానకవి మేలుమఱనివాఁడై కృతి చెప్పి, అప్పనముగా నిచ్చినచో, ఆ కృత్యాది యంతయుఁ జొప్పసారువారు. సార మెఱిఁగి యడిగి తమపేరఁ గృతి వెలయింపఁజేసికొన్న వాండ్లు అమృతమూర్తులు. రాజరాజనరేంద్రుఁడు, మనుమసిద్ధి, రాయలు ఈ శ్రేణిలోనివారు కారా?

ప్రస్తావము కొంచెము మాఱినది.

సాహిత్యతత్త్వవేదులగు రాజులకుగు ధోరణి యంతయు నితరుల కొరవడి యగును. తనకు ముంగలి కృతిలోని యారంభావస్థ యంతయుఁ దన సొంతకృతిలోఁగూడ నెక్కించుకొన్నపుడుగాని కృతిపతికి సంతుష్టి లేదు. ఈ రహస్యము ప్రాచీనాంధ్రకవికిఁ దెలియును. అందులకే, వెనుకటిసంప్రదాయముల నతఁడు సక్రమముగాఁ బాటించినాఁడు. సంస్కృతభాషాకవులకు లేని యెన్నో నియమముల నతఁడు పెట్టుకొనినాఁడు.

శ్రీకారముతోఁ గృత్యారంభము చేయని తెనుఁగుకవి యొకఁ డున్నచో నొట్టు. 'శ్రియఃపతి' అని ప్రారంభించిన యెవ్వఁడో యొక కవి తప్ప సంస్కృతకావ్యకారు లేరును శ్రీకారముతో నుపక్రమించినటులు లేరు. తెలుఁగుకృతిపతులకు 'శ్రీ' తొట్టతొలుత కావలయును. ఇది యిటులు రానురాను కవిసమయ మైపోయినది. మాయికుఁడు, అమాయికుఁడు నయిన ప్రతితెనుఁగుకవియుఁ గొన్ని సమయములను మడుఁగుదోవతులవలె ధరించుచువచ్చినాఁడు. కృత్యాదిగ్రంథము దొరకని కొన్ని ప్రబంధములు తెలుఁగులో నున్నవి. "అభ్యుదయపరంపరాభివృద్ధిగా......"అను వచనముతోఁ గథ యుపక్రాంతమగును. అట్టి కృతులు పరిశోధించిన పండితులు పీఠికలలో, దీని కృత్యాది క్రిమిదష్టమై నష్టమైన దనియో, మఱియొక ప్రతి దొరికినచో దాన నది యుండవచ్చునేమో యనియు వ్రాయుట అలవాటు. వాస్తవముగా, కవి అక్కడనుండియే గ్రంథోపక్రమణము చేసియుండు ననుట అపరిశోధకుని లక్షణము కావచ్చును. సంస్కారవాంఛ కల ప్రాచీనకవి యొకఁడు 'వృద్ధిరాదైచ్'తో శాస్త్రారంభము చేసినటులు 'అభ్యుదయ' శబ్దముతోఁ గావ్యప్రారంభము చేయుట ప్రత్యవాయము కాదు కదా? కాని, తెలుఁగువారిలో సమయోల్లంఘనజాంఘికు లుండ రని మనకు పండిన నమ్మిక. మన విశ్వాసమునకుఁ దగినటులు ఏరును లేరుకూడను.

అవిఘ్నపరిసమాప్తికి దైవనుతి కృతిమొదలఁ జేయుట శిష్టాచారము. అది మానసికముగాఁ గాక, కృత్యాదిలోఁ బ్రవేశపెట్టుట యెందులకన 'శిష్యశిక్షార్థయై' అని బదులు చెప్పిరి. భట్టబాణుఁడు కావ్యాదిని దిట్టముగా దైవప్రార్థనము చేసికొన్నాఁడు. పాపము! అటులయినను, సగములో కావ్యము నందుకొట్టినది. 'కిరణావళీ' కర్త హఠాత్తుగఁ గృతి నుపక్రమించినాఁడు. అందు ప్రార్థనము ప్రారబ్ధము కాలేదు. అది యనంతరాయముగ సొంతమైనది. దీనికి జన్మాంతరీయ సుకృతసంబంధము చెప్పి సమర్థింపవలయును. "నమస్క్రియావస్తునిర్దేశము" లేవో మొదల నుంచుట గీర్వాణకవులు సంప్రదాయముగాఁ బెట్టుకొనిరి. అవి వీరి కక్కఱలేదు. వీరికి వలయునది యొక మహారాజశ్రీ. క్షమింపుఁడు! పరిహాసమున కటు లంటిని. 'కశ్చిత్కాంతా' అని కాళిదాసుఁడు, 'నిపీయ యస్య' అని శ్రీహర్షుఁడు గ్రంథారంభము చేసినారు. తెనుఁగునాటనే ఆస్తికత వేలునాటినదా? అది స్వోత్కర్షపుమాట యగును. ఒక వాఙ్మయములో నొక్కొక్క సమయము. అది చాదస్త మనుకొన్నను, మడిమనుకొన్నను దాఁటమి ధర్మము.

ఈ కృత్యాదివిహితధర్మములలో కుకవినింద యొకటి. సుకవిస్తుతి గావించినచోఁ బరిశిష్టన్యాయమున కుకవినిందయుఁ గావించినటు లగును. కాని, రెండును కావ్యములలో నుండితీరవలయు నని తెలుఁగు

కవుల నియమము. ఆదికవి నన్నయ సరసకవిసభలను గొండాడి యూరకుండినాఁడు. అతని తరువాత రెండు శతాబ్దులకాలము గడచిన దనఁగా, ఎంత మార్పు వచ్చి యుండును! తిక్కనశర్మ నిర్వచనోత్తరరామాయణములో—

"పలుకుల పొందు లేక రస
భంగము సేయుచుఁ బ్రాఁతవడ్డ మా
టలఁ దమ పేర్పుఁ జూపి యొక
టన్ హృదయం బలరింపలేక యే
పొలమునుగాని యట్టి క్రమ
మున్ దమ మెచ్చుగ లోకమెల్ల న
వ్వుల బొరయం జరంచు కుక
వుల్ ధర దుర్విటులట్లు చూడఁగన్."

తిక్కన స్వచ్ఛమైన అద్వైతవాది. కుకవులను దుర్విటులతోఁ బోలిచి, ఉచ్చరింపరాని వారి ప్రసక్తి పరిశుభ్రమైన కావ్యాదిలో నెత్తుకొనుటయే మనసునకు బాధ కలిగించినది. దవ్వునకుఁ బోయి యోచించినచోఁ గుకవినిందయు నా కాలమునకు వలసినదే యేమో! దేశీయకవిత క్రొత్తగా మొలకెత్తి పెరుగుచున్న తరుణమది. అపుడెందఱో ఆ మొక్కను ద్రుంపఁజూచువా రుండియుందురు. సభలలోను, చాటుగాను మహాకవులను వెక్కిరించు స్వభావము కలవారు నేఁడున్నారు. నాఁడు మఱియు హెచ్చు. అందులోఁ దిక్కనవంటి కవిబ్రహ్మపై అసూయువులై వెక్కిరించువారు పెక్కు రుందురు. అట్టివారిని నిందసేయుట ఆనాఁ డావశ్యకము. ఆ నింద గ్రంథారంభమున నెక్కించుట 'శిష్యశిక్షారై' యనునటులు కవిలోక సంగ్రహణార్థము.

ఈ సంప్రదాయము రానురాను ప్రబంధములలోఁ బాయని నియమమైపోయినది. ప్రబంధకారులందఱును గుకవితిరస్కారము తప్పక చేసిరి. ఆ చేఁతలో ననేకజాతులు. కుకవుల మాట స్మరించుటయే తప్పని వారి నిందార్థము పెద్ద వృత్తము నొకదానిని వ్రాయుట! పింగళిసూరనార్యుఁడు—

"మెచ్చి యొకింత గౌరవము
మెచ్చకయుండి లఘుత్వలేశమున్
దెచ్చుటకున్ సమర్థులె కృ
తిక్రియకుం గుకవిత్వగర్వితుల్
తచ్చరితం బుపేక్ష కుచి
తం బగుఁగాక నగంగనైన వా
క్రుచ్చి యజాగళస్తనస
గోత్రుల వారల నెన్ననేటికిన్?"

అని చెప్పి, నిందుగా నెనుబది గురులఘువులతోఁ గుకవినింద చేసినాఁడు. కుకవు లుపేక్షామాత్ర దండ్యు లన్నాఁడు. ఉపేక్ష యనఁగా వారి పేరులు చెప్పక విడుచుట కాఁబోలు! సుకవులతోపాటు కుకవులకుఁగూడ కావ్యాదులలో నొక స్మరణస్థాన మిచ్చుట ఆనాఁడు విధి. నన్నిచోడుఁడు వ్రాసినాఁడు గదా!

"మార్గకు మార్గము దేశియ
మార్గము వగవంగఁ దమకు మఱి వదలక దు
ర్మార్గపదవర్తు లనఁదగు
మార్గవులం దలఁచ నలఁతి మహి సుకవులకున్.

"చెనసి గుణమైన దోషంబు సేయనేర్చు
కుకవి కృతులందు దోషంబు గుణముసేయ
నేరఁ డది యట్లు తొంటులు సేరి నాయి
దోర్ప నేర్చుఁగా కది యేమి సేర్పనేర్చు.

నెఱయ రసవంతమగు కృతి కెఱఁగనేర
రల్పరసకృతి కెఱఁగుదు రలుల కెల్లఁ
జెఱకు విడిచిన రసమున కెఱఁగిరాక
పిప్పి కరిగెడు నీఁగల పెల్లువోలె."

ఒకటికాదు, రెండుకాదు, మూఁడుపద్యములతో కుకవులను బేరుకొనుట వారి కెట్టి గర్వకారణము! పెద్దన్నగారు చక్కనిధోరణిలో నిందచేసినారు కుకవులను. 'భరమై తోఁచు కుటుంబరక్షణకునై ప్రాల్మాలి......' ఇత్యాదిపద్యము ప్రసిద్ధమైనది.

నేఁటివలె నాఁడు కాకితములు, అచ్చులు లేవు. తాటియాకుఁ బొత్తములపై గంటములతో వ్రాఁతలు.

ఆ హేతువున గ్రంథపుఁ బ్రతులు ఇప్పటివలె కుప్పనఁ గూరఁగా దేశమున వెదజల్లుటకు వీల్లు లేకపోయెను. ఎవరికి వలసినపుడు వారు ఆగ్రంథమున కొక ప్రతి వ్రాసికొనుచుండువారు. గ్రంథము బహుళవ్యాప్తికి వచ్చుట కది యొక ప్రతిబంధకము. కొందఱు కుకవులు ఘనలోభులై తాళపత్రకాంతారములో నర్థపుఁ దెరువాటులు కొట్టి సభలలోఁ బరిహసితు లగుచుండువారు. ఆ చౌర్యగుణము దేశములో నశించుటకు పెద్దనగారు ఈ పద్యము వ్రాసిరి. ఇంచుమించుగా, పెద్దన చెప్పిన యీ కుకవులు క్షేమేంద్రుఁడు పేర్కొన్న సకలోపజీవుల జాతిలోనివారు. తాటాకుఁబ్రతి యొక్కటే యున్న దనుకొని, రాజులను వంచించి, ఆ కృతి తన రచనగానే ప్రచారముచేసికొనువా రొకఁడు ఉండి యుందురు. అట్టివారిని పెద్దన్న యీ పద్యములో నుట్టంకించినాఁడు. మారన కథావిధానములు చూఱలాడి, శ్రీనాథుని తీరులు ఆకళించి కవిత్వము వ్రాసిన పితామహుఁడు స్వల్పముగాఁ దెరువాటులు కొట్టినవారిని ఏమియు ననియుండఁడు. ఇతఁడు పేర్కొన్న కుకవులు తప్పక సకలోపజీవులే కావలయును.

తెనుఁగుకావ్యములలో నీ కుకవినిందయు, కృత్యాద్యవస్థయు సంస్కృతకావ్యములకంటె ఒక విలక్షణపుఁదీరులో నడచినవి. ఆధునికులు కుకవినిందలు కావ్యములలో విరమించినారు. కుకవులు నేఁడు నిజముగా లేరేమో!



వరంగల్లుకోటలో శిథిలమై ఒకమూల పడియున్న నటరాజవిగ్రహము

# జీవితము - వాఙ్మయము*

శ్రీ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి

జీవితమునకును, వాఙ్మయమునకును విడిపోని, విడరాని సంబంధము కల దను సూత్రము సర్వ సర్వత్ర అంగీకరింపబడినదే. విషయసమాలోచనము చేయుటలో నెట్టిది జీవిత మనిపించుకొనును, వాఙ్మయస్వరూప మెద్ది? అనువానిని స్థూలముగానైనను నిర్వచించుట అవసరము. ఏ దేశమందైనను, ఏ కాలమందైనను జాత్యున్నతికిని, దేశాభ్యుదయమునకును ఉదాత్తలక్ష్యము ననుసరించు ఆదర్శజీవితము, మానవులయందలి పశుత్వము నపాకరించి వారికి దైవీసంపత్తును చేకూర్చగలుగు కావ్యము నను నీ రెండే ముఖ్యములు. దేశముకొఱకు, జాతికొఱకు జీవించుటయే ఈశ్వరసేవ, ఆత్మోద్ధరణము ననియే ఉత్తముల నిశ్చితాభిప్రాయము. మహాత్ములు తమ ఆదర్శజీవితమూలముననను, మహాకవులు తమ ఉదాత్తకావ్యకుసుమమాలల మూలముననను సంఘమును, దేశమును పూజింతురు. పై ఆశయములనే అనుసరింతురు; అనువదింతురు. అన్ని దేశములయందును మహాపురుషు లనిపించుకొన్నవారి జీవితములను, మహాకవుల కావ్యములను బరిశీలించినచో ఈ అంశము తేటతెల్ల మగును. దీని సారాంశ మేమనగా, జీవితమునకును, వాఙ్మయమునకును అవినాభావసంబంధము కల దనుటయే. "పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనం" అన్న ఆర్ష ఆశయమునే జాతికొఱకు, దేశముకొఱకు తమ్ము బలియిచ్చిన మహాత్ములు తమ జీవితములోను, మానావమానములకు గురియగుచు ధనమున కాశించక కాలమంతయు ఉత్తమకావ్యరచనకు ధారవోసిన మహాకవులు తమ రచనలమూలముననను ఉద్ఘాటించినారు.

ఉత్తమజీవితములే ఉత్తమకావ్యము లయిన వనుట నిశితమైన సత్యస్వరూపము. ఆదర్శజీవితమే, అనుకరించదగిన యంశములే, ఆచరణయోగ్యము లయిన కృత్యములే ఉత్తమకావ్యము లయినవి. వాల్మీకి వ్యాసులు, కాళిదాస భవభూతులు, నన్నయతిక్కనలు, ఇటీవలి ఉత్తమకావ్యరచయితలును దేశమునకు, జాతికి చేసిన సేవ అమూల్యము. ఆ తీరుననే ఆచార్యత్రయము, విద్యారణ్యులు, శ్రీకృష్ణదేవరాయలు, శ్రీ రామకృష్ణ పరమహంస, తీర్థులవారు, త్యాగబ్రహ్మ, ఈ కోటికి చెందిన సత్పురుషులు తమ ఆదర్శజీవితము లను మహాకావ్యములు ప్రజానీకమున కొసగి, అమృతజీవు లయినారు. నాడు, నేడు ప్రజ పూర్వవాఙ్మయమున చిత్రింపబడిన ఉత్కృష్టజీవితములను పఠించియే తమ జీవితమును దిద్దుకొనినారు; దిద్దుకొనుచున్నారు. ముమ్ముందును రాబోవుతరమువారికి కావ్యములే అమూల్యరత్నపేటికలు; అమృతము పేరిన జీవగుటికలు. మహాకావ్యము లనే భండారములు సేకరించుకొనని జాతి దారిద్ర్య మింతయని నుడువజాలము. గతము మఱచిన జాతి మృతతుల్యమే. కావ్యములు జాతీయచైతన్యము నిర్మలముగ ప్రవహించు జీవనాడికలు. గంగాజలము వలె పవిత్రములు. దేశమునకును, జాతికిని స్వయము నిర్మించుకొన్నట్టి ఏదేనొక ఆదర్శప్రణాళిక ననుసరించి సేవచేయలేనివానికి దేశమున, సంఘమున తావు లేదు. "దేశమంటే వట్టి మట్టి కాదోయ్, దేశమంటే ప్రజలేనోయ్" అన్న గురజాడమహాకవివాక్యములోని అంతరార్థ మిది కాదా? ప్రజాజీవనమును కావ్యపేటికలలో భద్రపఱచి మహాకవులు మన కందించినారు. మన పూర్వపు ఔన్నత్యము చిత్రించు వాఙ్మయప్రవాహికలద్వారా మన మనోమాలిన్యము కడిగివైచి, ఉత్తమజీవనముమూలమున ప్రజాసేవ, దేశసేవ చేయ

* హైదరాబాదు రేడియోలో ఒకనా డిచ్చిన భాషణసారము.

గల్గు మార్గములు మహాకవులు మన కుపదేశించినారు. నాటకములు, నవలలు, వ్యాసములు, కథలు, చరిత్రలు, శాస్త్రములు—ఇవి అన్నియు వాఙ్మయ మగుచున్నవి. పూర్వుల పరిశ్రమ, పరిశోధన వాఙ్మయస్వరూపమున మన కందుబాటులో లేకున్న, అగ్ని ముట్టిన చేయి కాలు నన్న సంగతి చేయి కాలినతర్వాతనే ప్రతి జీవియు తెలిసికొనవలయునంతటి దుస్థితి సంభవించును. దేశచరిత్ర, పూర్వుల విజ్ఞానవిశేషములు, స్వీయసంప్రదాయములను కావ్యములే మనకు తెల్పుచున్నవి. నేటి మన కావ్యకలాపముద్వారా స్వాతంత్ర్యమునకైన పోరాటము, మన కష్టనష్టముల వార్తావాహిని రాబోవు మనవారలకు అందజేయకున్నచో వారు గ్రుడ్డివారే యగుదురు. దేశ మన్న, జాతి యన్న, వాఙ్మయమే మనకు చిత్రపటమువలె కనులకు కట్టినట్లు చిత్రించి చూప సామర్థ్యము గలయది. వాఙ్మయము లేకున్న లోక మొక ఎడారియే. మహామహులు, దివ్యప్రభావులు నగు మహమ్మద్ ప్రవక్త, జీసస్ క్రీస్తు, బుద్ధదేవుడు—వీరి యునికియు, జీవనవిధానమును మన సొత్తు కాగల్గి మన జాతీయ జీవనమును, దేశసౌభాగ్యమును నిలబెట్టుకొనుట కాధారభూతము వాఙ్మయమే.

ఆత్మీయమగు సుఖదుఃఖమయమగు సంసారమున ప్రజల సుఖదుఃఖములు ప్రతిఫలించుచునేయుండును. అరసికుల మధ్య రసికుని వాక్యము లెట్లు నిష్ఫలములో, అట్లే నిరర్థకజీవనులమధ్య సార్థకజీవి వారినుపేక్షించి మనజాలడు. వారలతో తానును మరణించుటయో, లేక వారలకు చేయూత నొసగి, తన ఉన్నతపదమునకు వారిని లేవనెత్తుటయో యాతని విధి. ఈ హేతువుచేతనే, పరార్థము కష్టించు వ్యక్తి అందే ఆత్మోద్ధరణమును గాంచును. ఆకలిగొన్నవారి మధ్య ఒక్కడు మృష్టాన్నమును ఎట్లు భుజింపగలడు ! అది జీర్ణించు టెట్లు? నేడిది యొక శోచనీయాంశము గదా! ప్రభుపరంపరావిలసితమగున, రమ్యహర్మ్యవిలసితమయిన భాగ్యనగరముల వీధులలోనే చూడజాలని అసహ్యదృశ్యములు కన్పట్టుచున్నవి. కుష్ఠరోగపరిపీడితుల యాకృతులు విచ్చలవిడి తిరుగుచుండుట సేవాశ్రమముల ఛాయలలోనే. ఆకలిమంటల కటమట లాడుచు రాచబాటల ప్రక్కల దుఃఖపూరిత దృశ్యములు నిలచినవి.

శుష్కవాక్యములు, శూన్యహృదయములు' అనుట కింతకన్న బలవత్తరమగు నిదర్శన మేమి కావలయును ! 'ఒరుల కిచ్చుట నీకొఱకే' అన్న సూత్రము అర్థవంతము. "సర్వే జనా స్సుఖినో భవన్తు" అన్నది భరతఖండవాసుల శ్రుతిపుటములు నిత్యము నింపుకొనుచునే యున్నవి.

రాజ్యతంత్రములు నడపు మహానాయకులు సర్వసర్వత్ర నేడు ప్రజల సుఖజీవనముకొఱకే పాటుపడుచున్నారు. ప్రజాతంత్రరాజ్యములు స్థాపించుట కొఱకే అన్ని దేశముల నేడు అంతఃకలహములు, అంతర్జాతీయకలహములు చెలరేగుచున్నవి. నేటి ప్రజాప్రభుత్వప్రణాళికలన్నియు సామాన్యప్రజలలో ప్రతియొక్కనికి కూడుగుడ్డలకు లోటు రాకూడదు, దైన్య మనునది అడుగంటవలయును అన్న లక్ష్యముకొఱకే వినియోగింపబడుచున్నవి.- ఇదియే ముఖ్యమగు పునాది. దీనిపైననే సర్వతోముఖశుభసామ్రాజ్యము నిర్మింప జూచుచున్నారు. ఇది నిక్కమగు శుభలక్ష్యము. ఇంకను ఆహారము ఎక్కువ పండించవలయును, ఉత్పత్తి వృద్ధిచేయవలయును అనుచు ప్రబోధించు ఆర్థికప్రణాళిక లన్నియు కష్టజీవుల జీవయాత్ర సుఖస్వరూపము దాల్చవలె నన్న ఆశయముకొఱకే ప్రవర్తించుచున్నవి.

ఇది ముఖ్యముగా ప్రచారయుగము. ప్రచారము వాఙ్మయముపై ఆధారపడియున్నది. ఇతరదేశముల ప్రజాతంత్రప్రభుత్వస్థాపనల కగు పోరాటములు వాఙ్మయముద్వారా — వార్తాపత్రికలు, ఉపన్యాసము, రేడియోవార్తలద్వారా—మన కేక్షణమున క్షణమే అందుబాటులోనికి వచ్చుచున్నవి. ఇది పునాదిగా మన దేశమున సంచలనము చెలరేగినది. చూడుడు! నిత్యజీవితమునకును, వాఙ్మయమునకును నేడెంత సన్నిహితసంబంధ మున్నదో. మహామంత్రుల కార్యక్రమముమాట య ట్లుంచుడు. వారి దర్శనమే అపూర్వ మన్నది పూర్వశతాబ్దముల మాట. వారి

ఆలోచన కార్యరూపము నందినపుడే ప్రజలు సంతసించుటయో, నిరసించుటయో జరుగుచుండెడిది. నేడో? ఉపన్యాసవేదికపై ప్రత్యక్షముగ వారిని గాంచుట సర్వసామాన్యము. నేడు లక్షలకొలది ప్రజాసామాన్యము వార్తాపత్రికలలో, రేడియోవార్తాప్రచారమున అప్పటికప్పుడే వారి అభిభాషణములు వినుచు, ఉత్తరక్షణముననే గుణదోషవిమర్శనము చేయుచు, కార్యనిర్వహణమున ప్రధానస్థానము నాక్రమించుచున్నారు. కావున నాయకులు నేడు చాల శ్రమించవలసియున్నది. వారి జీవితములే అడుగడుగు గండములకు లోనగుచున్న రోజు లివి. నేడన్నిరాష్ట్రముల ప్రధానుల ఉదారాశయము "food and clothing for the man in the street'' (ప్రతిజీవియు తిన తిండి, కట్ట గుడ్డకు బాధపడరాదు) అన్న ఆర్థికప్రణాళికను అమలులో పెట్టుచు ప్రజాసేవ, దేశసేవ, ప్రభుభక్తి పరాయణత్వము ప్రజల మూలసూత్రములు కావలయు నని ఉద్ఘాటించుచున్నారు. నిన్నగాక మొన్న దేశమునకై తన తను, మాన, ధనములు వెచ్చించి, ప్రాణము లర్పించిన మహాత్ముని జీవితలక్ష్య మిదియే గదా? దానినే ప్రముఖులంతటను ఆచరణలో పెట్ట యత్నములు సల్పుచున్నారు. ఈ వార్తాప్రణాళిక, విజ్ఞానతంత్ర మంతయు మనకే కాదు, ప్రపంచజాతులకందఱికి అందుబాటులో నుంచ సమర్థము వాఙ్మయమే గదా? ఇట్టి మహోదారాశయములు నిర్విఘ్నముగ కొనసాగుటకై అంతటా ఉద్యోగివర్గము, సహాయమంత్రులు ప్రధానులకు, ప్రభువులకు చేయూత నొసగినచో దివ్యరాజ్యము, దివ్యక్షేత్రము అయి దేశము, ప్రజ సుఖపడునుగదా! ఈశ్వరుడట్లగుట కనుగ్రహించుగాక.

నేడక్షరాస్యులగు ప్రజాబాహుళ్యము అన్నము కన్న మిన్నగా వార్తాశ్రవణమును కోరుచున్నది. వాఙ్మయమునకు, జీవితమునకు ఎంత గాఢమగు సంబంధము కలదో ఇదియే తెల్పుచున్నది. మహాకవి ఎట్లు కావ్యదోషములు వర్జించి గుణసముల్లసితమగు సముజ్జ్వలకావ్యము నందింప యత్నించునో, అట్లే మహానాయకులు గతచరిత్రను అవగత మొనర్చుకొని, లోపములు దూరీకరించి, సక్రమమగు, న్యాయబద్ధమగు తంత్రము నమలుపఱచి ప్రజల హృదయములను కావ్యము పాఠకహృదయమునువలె, చూఱగొందురుగాక. కావ్యము లేకున్న కన్నులేదనుట మఱువకుందురుగాక.





మిత్రద్రోహి
(మూడంకములు)

—చిత్రకారుడు: కీ. శే. శ్రీ తలిశెట్టి రామారావు.

# నన్నయ తెనుగు*

వ్రా

శ్రీ కోరాడ రామకృష్ణయ్య

నన్నపార్యుని శిష్టవైదికభాషాప్రయోగప్రవణత్వము వెనుక జూపిన తత్సమశబ్దప్రయోగవైఖరిని బట్టియేగాక, తెనుగులోనికి దేబడిన సంస్కృతభాషా వ్యవహారసంప్రదాయసిద్ధములగు పదబంధములు, అన్వయరీతులు, వ్యాకరణసంప్రదాయములు మొదలగు వానినిబట్టికూడ మనము గ్రహింపవచ్చును. సులభముగ తెనుగుమాటలలో జెప్పదగిన భావమును సంస్కృతసమాసఘటితము చేసి క్త్వాంతరూపములతో త్రిప్పి చెప్పుట యాతని రచనావిశేషములలో నొకటి—

"మనీషివిద్యాశ్రమతత్త్వవిత్త్వమున - మహి నొప్పినవాడు రాజనరేంద్రుడు.

ధాత్రీసురప్రార్థ్యశీలమై-మహాభారతపారిజాత మమరును.

మాయింట కృతభోజనుండవై పొమ్మని తుణి యించిన.

మయువలన సభాప్రాప్తుండై.
ధనప్రాప్తుడ నగుదు.
సంతతార్థదాని శంతనుండు.
వీతకార్యావసరుండై.
అసుర భస్మసాత్కృతు డయ్యె నట.
తద్వచనారంభుల రగుడు మీర లని.
సర్వవిఘ్నదూరీకృతమై సమాప్తి నొనరినది.
కృతప్రస్థానులు.
మానవులకు నెఱుగ నఘటమానము.
అలబ్ధసన్నిధానుండ నైతి.
పరలోకకృతావాస నగుదు.

నాకు నిక్కన్య పుట్టె; దీనిం బుత్త్రీకరణంబున వర్ధించితి.

కృతవీర్యు ధనమెల్ల క్షప్తిచేసికొని డాచి.
ద్విషద్భయావహు లగుచుండ నొప్పునె.
అంతకతుల్యగతులైన.

అధ్వరారంభసుస్థిరనిశ్చితబుద్ధులై యున్న యుధిష్ఠిరు.

రాజసూయాధ్వరంబు సమాప్తప్రయోగంబైన.

ఉదరభిదాముఖమున నభ్యుదితుండై నిర్గమించిన వాడు కచుడు.

వారల మతుల తృణస్త్రైణములు సమంబుల కావే.

విహితాహితు లగుచుండిరి జితకాశులు ధరణీపతులు శిశుపాలాదుల్.

అతని చరితంబు చెప్పగ నతిమానుష మపగతప్రయాస మదృష్టశ్రుతపూర్వము.

ఆత్మవ్యవసాయార్థంబు జనకగీతంబులైన శ్లోకంబులు.

సమీరసుతుచేత ప్రాప్తమృతుడై పడినన్.

నరుం డర్థార్జనదుఃఖంబున నపార్థీకృతజన్ముం డగుట."

నన్నయ తెనుగురచనయందు జొనిపిన సంస్కృతభాషాసంప్రదాయములు ప్రధానముగా నాతని కారకప్రయోగరీతియందు, వాక్యనిర్మాణపద్ధతియందుగూడ మనకు విశేషముగా గోచరించును. సంస్కృతరచనలో సంపూర్ణక్రియారూపము వాడుకలోనుండి తగ్గినవెనుక

---

* మొదటి వ్యాసము కడచిన ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడినది.

నా భాషలో విశేషప్రచారము కలిగి తద్భవనారీతి లౌకవిధమగు సౌలభ్యము నాపాదించిన క్తాంతరూప ప్రయోగపద్ధతిని తెనుగురచనలోనికిగూడ దీసికొనివచ్చు టకుగా నన్నయ అన్నంతక్రియలపై పడుధాతురూప ములను జేర్చి ప్రయోగించు పద్ధతిని విశేషముగా వాడుకలోనికి దెచ్చినాడు. ఇది కర్మణిప్రయోగముగా తెనుగున వాడుకలోనికి వచ్చినది.

"లావుసెడగ నిట్లు పీవంగబడి గతచేష్టు డయిన యసుర.

అగ్నిహోత్రములు పోడిగ వేల్వగాబడియె.
ఎప్పుడు వినబడు నానాపురాణవివిధశ్రుతులట్.
ఎట్టితీఅములను ముట్టబడిన వంతలెల్ల బాయు.
భామ భరియింపబడు గాన భార్య యయ్యె.
ధర్మస్థితి బరిగ్రహింపంబడిన భార్యలకు."

ఈ 'పడు'ధాతుసహాయముతో గూడిన కర్మణ్యర్థక ప్రయోగము నన్నయకు బూర్వమున గల శాసన భాషలో క్వాచిత్కముగనే కనబడుటచే దీనినిగూడ విశేషప్రచారములోనికి దెచ్చినది నన్నయయే యన వలసియున్నది. ఈ ప్రయోగపద్ధతి తెనుగునవలెనే తక్కిన దక్షిణదేశభాషలయందును సంస్కృతభాషా సంప్రదాయప్రాబల్యమునుబట్టి యేర్పడినదేగాని యది యీ దేశభాషాసంప్రదాయమునకు సహజమైనదిగా దోపదు. కావుననే నన్నయభాగములో నీ ప్రయోగ మతిబహుళముగా గనబడినను తరువాతి తిక్కనాదుల రచనలలో నతిక్వాచిత్కముగనే కనబడుచున్నది. కర్తృవాచిక్రియావిశేషణరూపముచేతనే యీ భావ మీ భాషలలో సులభముగా సూచింపదగినదై యున్నది. సంస్కృతభాషావ్యవహార సంప్రదాయ ప్రాబల్యమునుబట్టియే కాబోలు తమిళమునగూడ 'తొల్కాప్పియ' మను లక్షణగ్రంథముననే కొద్దిరూపము లిట్టివి కనబడినను, తద్వ్యాకరణకర్త వీనినిగూర్చిన లక్షణ మేమియు చేసియుండలేదు. తెలుగుభాషలక్షణస్వరూ పములను దెలుప దొరకొనిన తొలుతటి లాక్షణికులు గూడ దీనిని స్మరింపలేదు. పడుధాతుసహాయముతో వ్యక్తమగు కర్మణ్యర్థమును గూర్చి కేతన తన లక్షణ గ్రంథమున నేమియు జెప్పియుండలేదు. అతని దశ కుమారచరితమునను 'పడు'తోగూడిన కర్మణ్యర్థక రూపములు విశేషము గానరావు. విన్నకోట పెద్దన 'కావ్యాలంకారచూడామణి'లో క్రియాప్రకరణమున విధ్యర్థము, ణిజర్థము మొదలగువానిని జెప్పెనను కర్మ ణ్యర్థమును స్మరింపనైన లేదు. తృతీయాదులకు 'చేత, తోడ' మొదలగు పదంబు లగునని చెప్పి, వాని కుదా హరణము లిచ్చు సందర్భమున "విశ్వవిభుచేత విలసిల్లు సిరి", "విశ్వేశ్వరుచేతం బ్రభవిల్లు నెల్లసిద్ధులు" అని కర్త్రర్థకక్రియారూపమునే ప్రయోగించెనుగాని 'విశ్వే శ్వరుచేత నెల్లసిద్ధులు ప్రభవింపగాబడు'నని యనలేదు. విశ్వేశ్వర మూలముగా (నేమైనను) సిరులు విలసిల్లు, సిద్ధులు ప్రభవిల్లు అనుటయే దేశీయసంప్రదాయము నకు ఆనుగుణమైన ట్లగపడుచున్నది. ప్రభవింపగాబడు ననుచో సంస్కృతక్తాంతరూపమునకు తెనుగుసేత గానే కనబడకపోదు. "He has a rupee in his hand" అనుదానికి 'వాడు చేతిలో నొక రూపాయి కలిగియున్నాడు'అన్నట్లే యుండును. ఎట్లయినను నన్నయకు దరువాతికవులు కొందరీ రూపము భాషా సంప్రదాయములకు భిన్నమని కాబోలు నన్నయవలె విశేషముగా వాడుకలోనికి దేకుండుటచేతను, కేతన పెద్దనలు క్రియాప్రకరణమున ఈ కర్మణ్యర్థమును ప్రత్యేకముగా జెప్పకపోవుటచేతను ఇది సంస్కృత పాండిత్యాభిమానము కలవారి వ్యవహారముననే కాని, తక్కిన సామాన్యజనవ్యవహారమున గానరాకుండుట చేతను, ఈ కర్మణ్యర్థరూపమును సంస్కృతమునందలి క్తాంతరూపప్రయోగసంప్రదాయమునుబట్టి నన్నయయే తెనుగున ప్రచారములోనికి దీసికొనివచ్చెనని తలప వలసియున్నది. కేతనపెద్దనలు దీని నొప్పరికించినను, నన్నయ చేసిన యీ ప్రయోగమునుబట్టియే తరువాతి ఆంధ్రశబ్దచింతామణ్యాదిలక్షణగ్రంథములలోని కిది యెక్కుటయు దటస్థించియుండును. 'చేతన్' అను దానిని తృతీయార్థద్యోతకముగా జెప్పిన పెద్దనయే తృతీయాపంచమీసప్తము లొకేయర్థమును సూచించు నని యీ క్రిందిపద్యమున సూచించినాడు:

"ఒనర దృతీయయు బంచమి
యును సప్తమియును దలంప సుచితనిజైకా
ర్థనియతి జెల్లుం దెలియగ
ననిరి విభక్త్యర్థవేదులైన కవీంద్రుల్."

అనగా స్థలవాచకమగు 'అల్' అనునదే 'అన్' అయి సప్తమ్యర్థమును, తృతీయాపంచములను సూచించుచుండగా, సంస్కృతభాషాసంప్రదాయమునందలి యీ తృతీయాపంచముల యర్థమును మరింత వ్యక్తము చేయుటకుగాను 'అన్'అనునదే అంతమందు గల చేయి, వలను అను శబ్దములను, అనగా చేతన్, వలనన్ అను వాని నామములపై జేర్పనొడగిరి. 'నోటన్' అనగా నోటిచేత, నోటివలన, నోటియందు అని యర్థము. నోరుశబ్దముపై 'అన్' చేరినప్పు డది నోట్టు+అన్= 'నోటన్' అయినది. నోటి యనుదానిపైగాని, అట్లే ఇకారము చేరిన రాముని వంటి తత్సమశబ్దములపైగాని 'అన్' చేరుటకు వీలులేకగాబోలు 'అందు' చేర్పబడ వచ్చినది. రామునియందు, నోటియందు అనియే కాని రామునన్, నోటియన్ అని కాలేదు. దేశ్యశబ్దము గాన 'నోటన్'అను రూపము కలదు. ఇట్లే "పాక చతుర్థీ షష్ఠులు నేకార్థమునందు బలుకనిత్తురు" అని చతుర్థీ షష్ఠు లేకార్థము లనియు జెప్పినాడు. "ప్రాణిపదములు వెలిగాగ బ్రథమలైన నరయ నొక్కకచో ద్వితీయార్థములగు". దీనినిబట్టి యీ తెలుగుభాషలో ద్వితీయాచతుర్థీసప్తము లను మూడు విభక్తులే కల వని పెద్దన యభిప్రాయ మైన ట్లగపడుచున్నది. ఇది సామాన్యజన వ్యవహారంబునందలి పద్ధతి కావచ్చును. కావుననే గ్రంథాంతమున "ఇది తెనుగునకల్లను జనపదవిదితం బైన తెలుగు పట్టించుక యెల్లిదముగ జెప్పితి"నన్నాడు. ఇది జనపదవిదితంబగు తెలుగట. "విభక్త్యర్థవేదులగు తెనుగుకవుల మతమున విభక్త్యర్థములు మూడురీతులు గలవే యైనను ఆంధ్రభాషావిభక్తులకుం గల నామాంతరముల నెఱింగింతు నని చెప్పి, తృతీయకు చేత, తోడ యనియు, చతుర్థికి కై, కొఱ కనియు, పంచమికి వలన, పట్టి, యుండి, కంటె అనియు, షష్ఠికి కి, కు, యొక్క, లోపల అను పదములును, సప్తమికి అందు, న అను పదంబులును నయ్యె" అని యీ విభక్త్యర్థములలోనగు పదములను ప్రత్యేకముగా చేర్కొనినాడు. దీనినిబట్టి సామాన్యమైన జనపదవ్యవహారము తెనుగున అన్, కి, కు మొదలగువానితో జరుగుచువచ్చినను, సంస్కృత భాషాసంప్రదాయమునుబట్టి యీ తెనుగున వలసిన సప్తవిభక్తుల యర్థములను ఈ భాషలో వ్యక్తపఱుప వలసివచ్చినపుడు తత్తదర్థబోధకశబ్దముల నా విభక్తులపై జేర్చుకొనుచుండెడివా రని వ్యక్తమగుచున్నది. కావుననే వీనిని ప్రత్యయము లనక 'పదము' లనియే యాతడు చెప్పియున్నాడు. ఇట్టివి ప్రత్యేకపదములు గనుకనే వీనికిని, నామవాచకశబ్దములకును నడుమ నొక్కొక్కప్పుడు ముఖ్యముగా నన్నయప్రయోగములలో వ్యవధానము కలుగుటగూడ తటస్థించినది. కేతన గూడ "వలసినప్పుడు చేత, కై, వలన, యొక్క, యందు నను నివి యను దృతీయాదులందు" అని చెప్పుట చేత నీ పదముల సహాయము లేకయే యీ విభక్తులు వ్యక్తముచేయబడు మార్గ మున్నదని సూచితమగుచున్నది గదా. ఈతడును "'నికి, నకు'లు నిలుచు షష్ఠి చతుర్థిన్"అని యీ రెండువిభక్తులను నొక్కవిభక్తిగా నిరూపించినాడు. దీనినిబట్టి దేశీయంబగు తెనుగుభాష వ్యవహారమున విశేషముగ విభక్తిప్రత్యయములు లేవనియు, నన్నయాదులు సంస్కృతభాషాసంప్రదాయసిద్ధములగు భావములను తెనుగులోనికి దే ప్రయత్నించినపుడు తద్భావవ్యక్తీకరణసమర్థంబులగు ప్రత్యేకపదముల నాయా విభక్త్యర్థంబులను సూచించుటకై ప్రయోగించినా రనియు తెలియవచ్చుచున్నది.

ఈ క్త్వాంతరూపములు కర్త్రర్థము నిచ్చునవి కావునను, సంస్కృతభాషాపద్ధతిని కర్తృకరణములు తృతీయావిభక్తిలో నుండవలయుగావునను, తెనుగున నీ తృతీయావిభక్తియందు కరణార్థసూచకముగా అన్నంతమగు 'చేతన్' అను హస్తపర్యాయవాచకశబ్దరూపమును నామముపై జేర్చి చెప్పు పద్ధతికూడ వాడుకలోనికి వచ్చినది.

"అతులతపంబునన్ వరుణు డన్ మునిచే బ్రభవింపగాబడిన దివ్యమునీంద్రుడు.

మహోద్వేగాలచేత నాయందు వేల్వంబడిన హవ్యకవ్యంబులు.

ఉచ్చారణదక్షుచేత నభిహితంబగు శబ్దంబు.

తల్లిచే దండ్రిచే విడువబడితి, నిప్పుడు పతిచేతను విడువబడియెద నొక్కొ.

శర్మిష్ఠచేత నాపడిన యవమానంబు"

ఒకప్పుడు 'చేత'శబ్దసాహాయ్యము లేకయే, అన్నంతపదమే ప్రయోగింపబడుచుండుటయు గలదు. 'చేతన్' అనునదికూడ 'చేయి'శబ్దమునుండి యేర్పడిన అన్నంతరూపమే.

"బ్రహ్మచర్యములను బడయబడిన పుణ్యఫలము"

"గోటను చిదుపబడియె." మొదలైనవి.

ఇట్లు పడుధాతుసహాయముతో కర్తృపదమును తృతీయాంతముగ జేసి చెప్పనక్కరలేకయే, షష్ఠ్యంత కర్తృపదముతో జేయబడిన సమాసముల మూలముగా నీ భావమును తెలుగులో వ్యక్తపరచుకొనుట యొకటి నన్నయకుపూర్వమే వాడుకలోనికి వచ్చినది. చాళుక్యభీముని 'కొఱవి'శాసనములో "నీచేసిన యుపకారంబు", మంగియువరాజలక్ష్మీపురం శాసనములో "రాజుపట్టంబు కట్టిన పతి" "రెంగరిపడసిన పదేన్తుంబు అడ్లపట్లు్రుద్గ్గాదేవి నేలయు"—ఇట్టి రూపములు కొన్ని తొమ్మిదవశతాబ్దినుండి తెనుగుశాసనములలో గాననగును. నన్నయ యిట్టి రూపములను విశేషముగా వాడుకలోనికి దెచ్చినాడు.

"తక్షకు చేసిన యపరాధంబునకు". (తక్షక కృతాపరాధస్య)

"జనమేజయుని చేయు సర్పయాగము"

"పవనతనయు బ్రాహ్మణార్థంబుగా దన సమర్పించుటయు నెఱింగించి."

వాక్యనిర్మాణమునగూడ సంస్కృతభాషాసరణియే కొన్నిచోటుల తెనుగులోనికి దేబడిన ట్లగపడుచుండును.

"అయ్యుదంకుండు......వనంబులో నొక్కరుండె చనువా (చనుచునె) డెదుర నొక్క మహోక్షంబు నెక్కి చనుదెంచువాని నొక్క దివ్యపురుషుం గని, వాని పన్నిన వృషభగోమయభక్షణంబు సేసి జనిపౌష్యమహారాజుం గని దీవించి గృహీతసత్కారుండై యిట్లనియె."

"పయనంబు వోవువా గొ (పోవుచు నొ)క్క నాడు స్నానార్థులై వచ్చి".

సంబంధార్థకసర్వనామములతో గూడిన వాక్యనిర్మాణపద్ధతికి సంస్కృతభాషయందే పరిపాటి హెచ్చు. తెనుగున నీ సంబంధము క్రియాజన్యవిశేషణముల మూలముననే వ్యక్తమగుచుండును. కాని నన్నయయీ పద్ధతినే తన రచనయందు విశేషముగా ప్రవేశపెట్టినాడు.

"ఎవ్వనియేని వీర్యంబున నిక్కన్య యుద్భవిల్లె నట్టి యుపరిచరుండు"

"ఎందేని సర్వభూతేశుండు సృజియించె సచరాచరములైన జగములెల్ల; ఎందేని గృతవాసు డయ్యె భగీరథుండు—అట్టి బిందుసరము."

"ఎప్పుడేని నన్ను నప్రియంబులు వలుకు దప్పుడ నిన్ను బాసిపోదు"

"ఎవ్వరేని వీని నెత్తికొనుడు, మిగిలియున్న బాహుయుగళంబు గన్నును నడగు, వీని కతడె యంతకుండు."

"అదోషం బెట్లు పరిహృతంబగు, నట్లుగా నీ చిత్తంబునం దలంచి" (యథా తద్దోషః పరిహృతో భవతి తథా విచింత్యః)

"ఇందుల లక్ష్య మెవ్వ డేసె నాతని వరియింపు."

సంస్కృతవాక్యనిర్మాణపద్ధతియందలి దృష్టితోడనే తెనుగున నవలంబించిన మరికొన్ని వాక్యనిర్మాణరీతులు; కారకప్రయోగములు—

"నాచిత్తం బెప్పుడు ధర్మంబున దగిలియుండను, పుత్రుండు వంశకర్తయు గాను వలయు."

ఇచ్చట తగిలియుండవలయు, కావలయు నను రూపములకు బదులుగా అన్నంత క్రియారూపములకు, 'వలయు' అనుదానికిని వ్యవధానము కలుగుటయేకాక, సముచ్చయముతో గూడిన రెండు అన్నంతరూపములకును, తుదినున్న వలయుతో నన్వయము కల్పింపబడుట

విశేషము. "మచ్చిత్తమనవరతం ధర్మే నిహితం, పుత్రశ్చ వంశకరో భూయాత్" అనురీతి నున్నది.

"నే నెద్ది సేసినను దానికి నొడంబడి వారింప కుండను, నన్ను నప్రియంబులు వలుకకుండను వలయు."

"ధారుణి నట్టి యపూర్వసభారచనలు వినగ జూడ బడ వెవ్వరిచేన్"

"కలధౌతమయపాత్రముల ప్రతిదినమును నుడు వను, గట్టను, దొడువను, బూయ ననుభవింపగలుగు టిది యేమి పురుషార్థమయ్యా"

"ఆదరింపంగగాక భేదింప నోపెడువారు గలరె"

"పలుకం దగుగాదు నాక."

"ఏల వచ్చువారగుదురు" (కథ మాగన్తాగో భవేయుః)

పశ్వనుబంధక్రియకు 'చేతన్' అను పదమును సహాయముగా జేసి తెనుగున కర్మణ్యర్థమును కల్పించి నట్లే, సంస్కృతభాషలో నొక ప్రత్యేకసంప్రదా యముగా వెలసిన ఉపయోగార్థమున—అనగా నియమ పూర్వకవిద్యాస్వీకార మర్థ మైనపుడు 'ఆఖ్యాతకు' 'తోడ' శబ్దమును జేర్చి చెప్పుటయు నన్నపార్యు డీ భాషలో జేసిన ప్రత్యేకకల్పనయే యనవచ్చును.

"చ్యవనసుతుడైన సుమతితో జదివ సకలవేద వేదాంగములు"

"అగ్నివేశులతోడ ధనుర్వేదంబు నర్థింగఱచి."

"కృపున్ వేదంబుల్ సదివించె భూసురు లతో విఖ్యాతిగా."

"తనవలన విలువిద్య గఱచిన కుమారులం జూచి ద్రోణుండు కృపాచార్యు రావించి వానితోడ దన మనుమల నందఱ విలువిద్య గఱపం బంచిన"

నియమపూర్వకవిద్యా స్వీకారంబైననే 'తోడ' వర్ణకంబు నుపయోగించినాడు నన్నయ. అట్లు కాని యప్పుడు 'వలన' వర్ణకంబునే వాడినాడు. ఇది సంస్కృత భాషాసంప్రదాయమునుబట్టి వైదికాభిమానియగు నన్నయ తెలుగుభాషలో జేసిన కల్పనయే కావచ్చును. ఈ యుపయోగార్థమును గూర్చిగాని, తదర్థమున 'తోడ' శబ్దప్రయోగమునుగూర్చిగాని తెలుగు భాషకు తొంటి లక్షణకర్తలగు కేతన, పెద్దన లేమాత్ర మును తడవియుండలేదు. కాని 'తోడ' శబ్దము నన్న యకు పూర్వమునుండియు వాడుకలో లేకపోలేదు. ఇది పూర్వశాసనములలో "తోఱ-తోఁటి" అను రూపములలో గానవచ్చుచున్నది. సహార్థముననే ప్రయోగింపబడియున్నది. "అల రామవిభుతోఁ" (చాళు. భీ. ధర్మ. శా.) "నాఱంబితోఁటి కయ్యంబున" (వైదుంబ. శా.) తుడు-తొడు ధాతువునకు 'సంధా నించుట' (బాణముగాని, ఉడుపులుగాని), తొడు గుట అని యర్థము. ఇందలి 'ఉ' కారమునకు పూర్వస్థితి 'ఱు' కారమై యుండును. 'తుఱు' = త్రొక్కు (to tread upon) అను నర్థము గల ధాతు వొకటి యితరదక్షిణ దేశభాషలలో కలదుగాని, స్పృశించు అను నర్థ ములో 'తుడు', 'తొడు' అను రూపములే కనబడు చున్నవి. ఈ 'తుడు' లోని 'ఉ' కారము ప్రాచీనమైన 'తుఱు' అను ధాతురూపమునకు సంబంధించినదే యేమో.

ఈ తుడు-తొడు ధాతువునకు స్పృశించు, తాకు, ధరించు మొదలగు నర్థములు కలవు. "తొడి, పూసి, కట్టి" అను ప్రయోగములు భాగవతకవులలో తరచుగా గానవచ్చును. ఆభరణములను తొడిగికొని (తొడవులను ధరించి), గంధాదులను పూసి, వస్త్రము లను కట్టి అని యర్థము. తొడవులను తొడి = తొడుగు కొని—అనగా ఆభరణాదులను శరీరమునం దేయే స్థాన ములందు తగిలించుకొనవలయునో అట్లు చేసి. తోడు = తగిలియుండునది, వెంట నుండునది. కావుననే సహా యము. తోడన్ = తాకునట్లుగా. వానితోడన్ = వానిని తాకునట్లుగా; వానివెంటనే. వానితోడి కయ్యంబు = వానిని తాకి, కలుసుకొని యుద్ధము చేయుట. ఈ తుడు-తొడుధాతువునుండి యేర్పడి నదే నన్నయ విశేషముగా వాడుచువచ్చిన 'తొట్టి' శబ్దము కూడను. 'తొట్టు' అనునది నష్టధాతువు కాదు. 'తొడు' ధాతువునకు సంబంధించినదిగానే తోచు చున్నది. "హిమకరు దొట్టి పూరుభరతేశకురుప్రభు పాండుభూపతు"లనగా వీరందరు హిమకరుని వంశము

లోనివారు కాబట్టి వానిని తాకినవారే అన్నమాట. కావుననే 'ఆతడు మొదలుగా' అను నర్థము వచ్చినది. శర్మిష్ఠదొట్టి, అనుగపతి దొట్టి = వారిని మొదలుగాగొని, తాకి, తిరువాత పిరంపరు వచ్చినారన్నమాట. ఇది క్త్వార్థకముగాను, అవ్యయముగానే యుండిపోయినది భాషలో. కాని 'తోడు' అను శబ్దము సప్తమ్యర్థక మగు 'అన్' ప్రత్యయమును గ్రహించి తోడన్, తోన్, తోడ, తో అని తృతీయావిభక్త్యర్థమగు సహార్థద్యోతక శబ్దముగా నేర్పడినది. కావుననే నన్నయభాషలో నిది సముచ్చయార్థమున వ్యవధానముగగూడ ప్రయోగింపబడినది. ప్రత్యయ మను దృష్టి దీనియెడ నేర్పడినట్లు లే దప్పటికి.

"అఖిలబాంధవులయు బ్రాహ్మణులయు దోడ"

"బాలకులయు, నధికక్రీడప్రీతులయు,లుబ్ధులయు, లఘుజనంబులయుం దోడ"

'తోడు'ధాతువునుండి 'తొట్టి', 'తోడన్', 'తోన్' అనున వేర్పడినట్లే, చేయు ధాతువునుండి చేసి, చేతన్, చేన్ అనునవిగూడ నేర్పడిన ట్లున్నవి. పెద్దన చెప్పినట్లుగా "విభక్త్యర్థవేదులగు తెలుగుకవుల మతంబున మూడే విభక్తులు—తృతీయా పంచమీ సప్తములు. ఇవి ఏకార్థనియతినే చెల్లును" తక్కిన వన్ని ఆంధ్రభాషావిభక్తులకు గల నామాంతరములే. పంటన్, గోటన్ మొదలగు అన్నంతరూపముల యర్థమునే వ్యక్తపరుచుటకును, ఇంకను సంస్కృతభాషలోని విశేషభావములను సూచించుటకును నన్నయాదులీ తోడన్, చేతన్, వలనన్ మొదలగు నామాంతరములను ప్రయోగించినారు. అట్టివానిలో జేరినవే 'చేసి, మెయిన్' అను తృతీయార్థమున నన్నయ ప్రయోగించిన శబ్దములుగూడను. 'చేసి' యనునది 'తొట్టి' శబ్దమువలెనే క్త్వార్థకరూప మగుటయేకాక, అది ద్వితీయాంతశబ్దముపై జేర్పబడినట్లే—(cf. హిమకరుందొట్టి, గాంధారిం దొట్టి దేవీజనులు మొ.) "తండ్రి పనుపుజేసి ముదిమి గొని జవ్వనం బిచ్చె"యనుచోట ద్వితీయపైనే చేర్పబడినదికాని, సామాన్యముగా అన్నంతము, లేదా సప్తమ్యంతశబ్దములపైనే చేర్పబడుచువచ్చినది. "అగ్నిహోత్రములు తేజరిల్లమిజేసి; తన పాదంబునంజేసి తలగంద్రోచిన; ముదితయందు తనదు హృదయము నిలుపుటంజేసి; నలు డిప్పు డసమర్థు డగుటంజేసి"—"శిరమచ్చో వామపాదంబునం దలగంద్రోచె" నన్నట్లు'చేసి'లేకుండగనే చెప్పవచ్చును. అర్థవ్యక్తీకరణమునకు 'జేసి'తోడ్పడునేమో. కాని'అసమర్థుండగుటంజేసి', 'హృదయంబు నిలుపుటంజేసి' ఇత్యాదులనుబట్టి చూడగా సంస్కృతమందలి "అసమర్థ ఇతి కృత్వా" "తస్యాం హృదయం లగ్నమితి కృత్వా" అను ప్రయోగపరిపాటినిబట్టి 'కృత్వా' అనుదాని సందర్భమున నన్నయ 'చేసి' అను రూపమును వాడినాడా యను సందేహము కలుగకపోదు. ఇట్లే 'మెయిన్'అను సప్తమ్యంతమగు 'మెయి'శబ్దమునుగూడ తృతీయార్థమం దితడు ప్రయోగించినాడు. ఇది 'క్త్వార్థకరూపమగు చేసి'వలెగాక, సామాన్యముగా ప్రథమాంత, లేదా సప్తమ్యంతశబ్దముపై జేరుచున్నది. మెయికి మై రూపాంతరము.

"తెనుగున రచియింపు మధికధీయుక్తి మెయిన్"

"ఈషంబోక పీక మై బోడువగా"

"నిష్ఠ మెయిన్ భవదగ్నిహోత్రముల్ పోడిగ వేల్వగాబడియె."

'ధీయుక్తితో', 'నిష్ఠతో', 'పీకతో'—అనియే యర్థము. కాని, ధీయుక్తిన్, పీకన్ బోడువగా అనిననే చాలుగదా ఎందులకీ 'మెయి'శబ్దమును దగుల్చుట అని శంక. 'మెయి' శబ్దమునకు 'శరీర' మర్థము. ఇచ్చట 'శరీర' మనగా సంపూర్ణస్వరూప మను భావముతో, సంపూర్ణమైన నిష్ఠతో, సంపూర్ణమైన ధీయుక్తితో, పట్టుదలతో ననునర్థమున నన్నయ యీ పదమును జేర్చినా డనవలె. ధీయుక్తి యొక్క సంపూర్ణత్వముతో, నిష్ఠయొక్క సంపూర్ణత్వముతో నను భావము సూచింపబడినది.

ఇట్లు షష్ఠిపై, లేదా సంబంధార్థకశబ్దముపై జేర్పబడిన సప్తమ్యంతశబ్దములు వలనన్, లోపలన్, అంకున్ అనునవిగూడ పంచమీ, షష్ఠీ, సప్తమీ విభక్త్యర్థద్యోతకములుగా నేర్పడినవి. వలనన్ అనునది

వలను (=ప్రక్క)శబ్దమునొక్క సప్తమ్యంతరూపమే. లోపు (cf. వెలుపు, దాపు) శబ్దముపై 'అల్' 'అన్' చేరుటవలన "లోపలన్" ఏర్పడియుండును. 'అన్' అనుదాని రూపాంతరమే 'అందు'. (cf. ఇందు, ఎందు.) ఇవి తొలుత ద్రుతాంతములుగా గనబడవు. సప్తమ్యర్థద్యోతకములైనవిగనుక ద్రుతాంతము లైన ట్లున్నవి.

"అక్కథకువలన బుణ్యకథలు విను వేడ్క".

"నావలన నెక్కథ విన వలతురు"

"ఆ కథకునివలనన్"అనగా నా కథకుని ప్రక్క నుండి, అతనిదగ్గరగా నుండి, అతనిమూలముగా పుణ్య కథలు విను వేడ్క.

"తక్షకువలని భయము" = భయము తక్షకుని ప్రక్కనుండి వచ్చినది. వానివలననుండి—వానిమూల ముగా గలిగినది.

"దాస్యంబువలనన్ పాయంగవలయు"=దాస్య మునొక్క సామీప్యమునుండి తొలగిపోవలయును.

వలనన్ వినుట, వలనన్ తొలగుట, వలనన్ విముక్తులగుట—అను సందర్భములలోని సప్తమ్యర్థము బాగుగా నర్థము కాకపోవుటచే గాబోలు -దానికి 'ఉండి' కూడ చేర్పవలసివచ్చినది. 'అక్కథకు వలనన్ ఉండి' వినుట, భయమువలనన్ ఉండి (కొంత కాలము) తరువాత తొలగుట, దాస్యమువలనన్ (లోన్) కొంతకాల ముండి, తరువాత విముక్తులగుట- అని చెప్పినచో దాని యర్థము సుబోధ మగుచున్నది.

'వలనన్' శబ్దముతో జోడింపబడకయే సప్తమ్యం తముపై 'నుండి' చేర్పబడవచ్చునుగదా.

"హైమవతోత్తుంగ హేమశృంగంబుననుండి భూమికి వచ్చె." "దేవలోకంబుననుండి నీకడకు వచ్చు" ఇక్కడ 'ఉండి' అనుదాని ప్రయోజనము స్పష్టమే.

"ఒక బ్రాహ్మణుండు ద్రుపదపురంబునుండి వనుదెంచి" (ఆది. ౭-౨) అన్నప్పుడీ పాఠమే సరి యైనచో నన్వయము కొంత కష్టముగా గనబడకపోదు. "వెట వచ్చి" యనుదానివలెనే విశేషప్రయోగముగా గ్రహింపవలసియుండును. వెంటనే "అయ్యా, ఎందుండి వచ్చితి"రని (ఆది. ౭-౨) ప్రశ్న కలదు. ఎట్లైనను 'ఉండి' అనునది 'చేసి' వలెనే సప్తమ్యంతములపై జేరినదే యనుటకు సందేహము లేదు.

"అక్కడనుండి", "నీరిలో నుండి", "ఎం దుండి" "ఆ ప్రదేశముననుండి" మొ. ఇది లేకయు సప్త మ్యంత మా యర్థము నిచ్చును.

"వానిముక్కునన్ వాతను గర్ణరంధ్రముల వారక శోణితధార లొల్కగా"—ముక్కుననుండి, వాతనుండి శోణితధార లొల్కగా నని యర్థము. 'ఉండి'వలెనే కొనుధాతురూపమగు 'కొలు'నుండి యేర్పడిన 'కొలెన్' అనునదికూడ అన్నంతసప్తమ్యర్థకరూప ములపై జేరి 'నాటంగొలెన్', 'నిన్నటగొలెన్'= నాటిని గ్రహించి, నిన్నటిని గ్రహించి; నాటనుండి, నిన్నటినుండి యను నర్థము నిచ్చినది. ఇట్లు సందర్భ మునుబట్టి నన్నయ యనేకశబ్దముల నాయా యర్థముల వాడినాడు.

'వలన' వలెనే లోపల, లోనన్, అందు అను నవి సంబంధార్థకషష్ఠ్యంతముమీద జేరినవి. 'వేల్పుల లోపలన్', 'నూతిలోన్' 'పాదలలోనన్' ఇవి స్థల వాచకములు, సప్తమ్యర్థకములు. కాని వీనిపై మరల 'అన్' చేరుట విశేషము. 'అన్' అనునదేగాక 'అందు'కూడ 'లోన్' అనుదానిపై చేరుచున్నది. 'లోపలన్' వలెనే 'లోనందు' ఒకటి.

"సుందరి మాయిద్దరిలో
నం దెవ్వరివలతు, సెప్పుమా యనవుడు బూ
ర్ణేందుముఖి నూచి మీలో
నం దెవ్వడు వోడిచి యొడిచె వతనివ వలతున్"
(ఆది. ౮-౧౧౦)

ఇక 'అందు'ను గూర్చిన కొన్ని విశేష ప్రయోగ ములు—

"గురుర్థమునందు ఋణవిముక్తుడు."

"నాయం దధికధనమ్ము గొనిపొమ్ము"

ఈ 'యందు' సులభముగా బోధపడ దిప్పుడు. విముక్తి గ్రహణార్థంబులందు 'తస్మాత్ విముక్తః' అని

పంచమీప్రయోగము యుక్తము. కాని యీ పంచమి సప్తమినుండి యేర్పడినదే యైనను (వలను—వలనన్) దీనిపై 'ఉండి' శబ్దముకూడ చేర్చినగాని, అనగా "నాయందునుండి, నావలననుండి" అని చెప్పినగాని, అర్థస్ఫురణము కలుగుటలేదు. "గుర్వర్థమునందు ఋణ విముక్తుడు" అనగా గురువున కివ్వవలసిన యర్థము, లేదా ప్రయోజనరూపమైన ఋణమునందుండి, ఋణము వలననుండి విముక్తు డన్నమాట. "నాయం దర్థము గొని పొమ్ము" అనగా నాయందునుండి, నావలననుండి, నాదగ్గరనుండి ధనము గ్రహింపుము అని యర్థమగును. 'మత్తః' అని గ్రహ్యార్థాదియోగంబున పంచమి విధింప బడినది. తెలుగున పెద్దన చెప్పినట్లుగా "తృతీయయు, పంచమి, సప్తమియును ఏకార్థనియతి జెల్లుం" గావున అన్నంతములోపాటు అందు అనునదికూడ పంచమ్యర్థ మున వాడబడినది. తరువాత నీ యర్థము వ్యక్తము చేయవలసివచ్చినపుడు 'అందుండి', 'దానివలననుండి' అని 'ఉండి' శబ్దముకూడ చేర్పబడుట తటస్థించినది. ఈ పని సప్తమ్యర్థకమే యగు 'లో' అను శబ్దము ప్రయో గించినపుడు కూడ చేయవలసివచ్చినది. నన్నయ "నూతిలో వెలువడ గోమలిం దిగిచె" నన్నప్పుడు నూతిలో వెలువడుట యేమిటని యిప్పు డనిపించక పోదు. 'లో'కిగూడ 'ఉండి' చేర్చి "నూతిలోనుండి వెలువడునట్లుగా" కోమలిం దిగిచినా డని చెప్పు కొనిన గాని మన కిపుడు బోధపడదు.

ఈ చిక్కు నన్నయనాటికే కొంతవర కేర్పడి యుండవచ్చును. కావుననే "నీరిలోననుండి యెగయు దించె"నని యాతడే ప్రయోగించినాడు. "నూతిలో వెలువడ" నన్నట్లు "నీరిలో నెగయుదించె"నని చెప్ప లేదు. అర్థస్ఫూర్తి లేకపోవుటచే గాబోలును. "భూమి దేవి నీరిలోనుండి వెలువడినది."

ఈ 'అందు' అనుదానిని నన్నయ యింకను విశేషార్థములందు ప్రయోగించినాడు. అతనికి పూర్వ మున గల శాసనముల భాషలో గనబడకపోవుటచే నాతడే యిట్టి వాడుకకు మూల మనవలసియుండును.

"నీవు మాయందు గుడిచి" అనగా 'మాయింటి లో'నని యర్థము.

"ఇంద్రునం దునికియు" అనగా 'ఇంద్రుని పట్టణమున, లేదా సభలో' నని యర్థము.

"గిరివ్రజంబు నద్వారంబునందు జొచ్చిరి" అనగా 'ద్వారములేని ప్రదేశముమూలముగా (ద్వారా) లోన ప్రవేశించి' రన్నమాట.

ఈ యర్థమునందే 'అన్'-"విమధగపతి యహి లోకమున కరిగె భూవివరమునన్." (ఆది. ౧-౧౦౨) ఇట్లే 'అందు' అనునది స్థలవాచకశబ్దమగు 'అల్' అను దాని రూపాంతరమే యై, (అల్ > అన్ > అందు) ప్రదేశము అను నర్థమే కలదైనను, సందర్భానుసార ముగా భిన్నార్థములందు నన్నయచే ప్రయోగింప బడినది.

"లాలితాపూర్వసభాలోకనంబున యందు జూదంబు కార్యంబె చెపుమ"—అనగా "సభాలోకన సమయమందు, లేదా సభాలోకనముమాత్రమునకే వచ్చిన సందర్భమునందు" అని చెప్పుకొనవలె. "సభా లోకనమే ఉద్దేశముగా బెట్టికొని వచ్చిన సమ యమం"దని తాత్పర్యము.

"అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుడు
మెలతగా దీనియందు నిర్మించెనొక్కొ."

"లావణ్యపుంజము నంతను దీని స్వరూపముగా దీనియం దమరునట్లుగా జేసినాడా"యని అర్థము చెప్పు కొనవలెను. 'దీనియందు నిర్మించుట' యనునది సుల భముగ బోధపడునట్టిది కాదు.

"అట్టియందు గోవిందుండు స్త్రీరథ కేగె"

"ఎల్లయందు నధికసాత్వికు డాస్తికు డనగ జనులు"

"అట్టి సందర్భమునందు, ఎల్లలోకమునందు=లోక మునం దెల్లెడల" అను నర్థము సులభముగానే స్ఫురింప వచ్చునుగాని, ఇప్పటి వాడుకలోనివి కావు. "నారదు వచనంబువలన ద్రౌపదియందు సమయక్రియ"="ద్రౌపది విషయమున జేసిన ప్రతిజ్ఞ".

"ధర్మరాజును రాజ్యంబునందు సమర్పించిన"= రాజ్యముచేయుటకై ధర్మరాజును నియోగించిన. "రాజ్యే నివేశ్య" అనుదానికి తెలుగు గాబోలు.

ఇట్లే 'అందు' అనునది యర్థభేదమును సూచించు శబ్దమైయుండి కుదకు విభక్తిప్రత్యయముగా వైయాకరణులచే గ్రహింపబడినది. సర్పయాగమునందు, గృహమునందు, వనములందు—వీనికి అన్నంతరూపములే గలవు. యాగమునన్, వనములన్ మొ. యాగములోన్, వనములోన్ అని వీని కర్థము. లోన్—లోపలన్ అనునవికూడ అన్నంతములే యగు సప్తమ్యర్థకములే. ప్రధానముగా సంబంధార్థకమగు షష్ఠీప్రత్యయములలో వీనిని జేర్చుట అసంగతమే. నిర్ధారణార్థమైనను సప్తమ్యర్థమేకాని షష్ఠి కాదు. అన్ అనునది స్థలవాచకమగు 'అల్' అనుదానినుండి యేర్పడినట్లే, 'లో' అనునది 'ఉల్' నుండి యేర్పడినది. ఉల్ > లో > లోపు > లోపల + అన్ = లోపలన్; లోన్ + అన్ = లోనన్. 'అన్' అనునదే కాక 'నన్' అనునది కూడ సప్తమీ ప్రత్యయమైనది. కావుననే 'అందు, న' సప్తమి అన్నారు. నన్నయభాషలో సప్తమ్యర్థకమగు నీ 'నన్' అనునది ద్వితీయార్థమును సూచించుట యొక్క విశేషము.

“తద్రూపామృతపానంబున ననిమిషత్వంబునం బొందిన తన నయనంబులు” (ఆది. ౭-౭౪) ఇందలి మొదటి అన్నంతశబ్దమునకు తృతీయార్థము (=పానంబు చేత). అనిమిషత్వమును బొందిన నయనంబులు అనిన అర్థమగును. కాని 'అనిమిషత్వంబునన్ బొందుట' యనగా సప్తమి 'నన్' ప్రత్యయప్రయోగము వలని ప్రయోజన మిప్పుడు సులభగ్రాహ్యము కాదు. 'అనిమిషత్వమునందు పొందుపడియుండిన నయనంబులు' అని అర్థము చెప్పుకొనవలెనేమో. అట్లే “దేవత్వంబునం బొంది విశుద్ధజ్ఞానులయి ముక్తులగుదురు.” దేవత్వమును పొందుటయే కాని, “దేవత్వమునందు బొందుట” అనున దిప్పుడు సుబోధము కాదు.

“శంతనుం డతిమనోరాగంబునం బొంద శాంతనవుండు తన తల్లి సత్యవతిని దోడ్కొని తెచ్చె” (ఆది. ౪-౧౫౧). “అతిమనోరాగమును బొందుట” అని కేవల ద్వితీయార్థముకంటె విశేష మేమైన కలదా? అతిమనోరాగంబునందు పొందన్ = నిమగ్నుడు కాగా అని 'పొందు'కు విశేషార్థ మేమైన జెప్పుకొనవలెనేమో.

ఇక 'న' పై 'అందు' చేర్చుటయు కలదు. “శాకలమునయందు శల్యుమద్రేశ్వరు”(సభా. ౧-౨౬౭). శాకలపురమందు, శాకల్యపురమందు అని దీనికి పాఠాంతరము లేర్పడినవి. వ్రాతప్రతులనుబట్టి నిర్ణయింపవలసిన పాఠములలో నిదికూడ జేరగలదు. శాకలమునయందనగా 'శాకలమున'ందనుదానికే ప్రయోగాంతరముగా నన్నయ ప్రయోగించినాడా? “శాకలముయొక్క అందు” అనియా? శాకలపురమం దనియే అర్థమగును. అన్వయ మెట్లో? నన్నయ యెట్లన్వయించుకొనెనో? నన్నయకు బూర్వమున గల శాసనములలో నీ 'న' వర్ణము పూర్వశబ్దమును విశేషణముగా జేయుట కుపయోగించిన ట్లగపడును.

“అశ్వమేదంబున ఫలంబు అగు” (అద్దంకి. శా) దీని యర్థము నిప్పటి భాషలో వ్యక్తముచేయుటకు 'అశ్వమేధముయొక్క ఫలము' అనిగాని, 'అశ్వమేధంబునందలి ఫలము' అని గాని చెప్పవలసియుండును. “అన్వయంబున వారు” = అన్వయంబునందలివారు (మాచర్ల.శా) అన్వయమునకు సంబంధించినట్టివారు. అట్టి అందలి అను విశేషణరూపము లక్కరలేకయే ఆకాలమున నర్థమయ్యెడిదేమో. నన్నయయు నిట్టి ప్రయోగము చేసినాడు. “ఎలజవ్వనంబున విలసనంబు” = జవ్వనమునందు = నందలి (యొక్క) విలసనము. “కుంభమున తోయములు”, “యదువంశంబున వారు”, “కాంపిల్యనగరమున జనులు”—ఈ సందర్భములలో “కుంభమునందలి తోయములు, నగరములోని జనులు” అని సప్తమ్యర్థమే చెప్పుకొనవలసియుండును. నగరములోని జనులు నగరమునకు సంబంధించినవా రగుదురుగావున సంబంధార్థముకూడ స్ఫురింపక పోదు. అంతమాత్రముచే 'న' షష్ఠీద్యోతకము కాబోదు. వాస్తవముగా నీ భాషలో సంబంధార్థద్యోతకమగు షష్ఠిని సూచించు ప్రత్యయమే యేర్పడలేదు. (తొల్లిటి ఔపవిభక్తికములు, ఇటీవలి యొక్క తప్ప) స్థానమే యీ సంబంధమును సూచించును. కావుననే నన్నయభాషలోగూడ “మంత్రంబుశక్తి”, “ఉచ్చైశ్శ్రవంబు వాలంబు”, “నేర్పుపేర్మి” ఇట్టివే హెచ్చు. ఇంకను సంబంధమును వ్యక్తము చేయుటకు

సంబంధార్థకరూపములు వాడబడును—"నీ చేసిన యుపకారము" (cf. త్వత్కృతోపకారః), "అమ్మునివరు కరపిన మార్గమున" (తమ్మునివరాదిష్టమార్గేణ).

కి, కు లు షష్ఠీప్రత్యయము లనుట యుక్తమే కాదు. ఇవి సహజముగా సంప్రదానార్థమును దెలుపుటకై యేర్పడినవి భాషలో. కావున చతుర్థీప్రత్యయ మనవలె. ఒక రొకవస్తువు నితరుల కిచ్చునపు డది పుచ్చుకొనువాని దగునట్లుగా నిచ్చుట స్వాభావికము. నాది 'అగు' నట్లుగా ఇచ్చినదే 'నా+అకుఁ'= నాకుఁ ఇచ్చినది. క్రీ. శ. ౭-వ శతాబ్దిచోళశాసనములలోఁగూడ ఆనాటి కన్నడశాసనములలో పెక్కింటిలోను 'అకుఁ' రూపమే గానవచ్చుచున్నది. 'రామాయ దదాతి' అనెడి అర్థము కాకపోయినను, రామునకుఁ ఇచ్చుట "రామునిది అగునట్లుగా ఇచ్చుట" అని మన కర్థ మగుచున్నది. నన్నయకుపూర్వము గల శాసనములలో చాలవరకు 'ఇచ్చుట' సందర్భములోనే యీ 'కు' ప్రత్యయము వాడబడినది. "ఇళరేనికిఁ ఇచ్చిన పన్నస", "నాకు ఇచ్చిరి", "వడ వరికి ఇచ్చిరి", "కార్తికేయునకు గుడి ఎత్తించె", "ఆదిత్యభటారనికి ఇచ్చిన నేల" మొ. "కోటి కటుత" "స్వామికి భక్తుండై", "దీనికి వక్రంబునచ్చువారు" ఇత్యాదిసందర్భములు కొన్ని లేకపోలేదు. కాని నన్నయ యనేకార్థములో దీనిని ప్రయోగించెను. 'కు' అనునది వానిది 'అగునట్లు' అను నర్థమున వచ్చిన దనుమాట మరచిపోబడినతరువాత, 'కు' వర్ణకముపై 'అగు' ధాతువునుండే యేర్పడిన క్త్వార్థకరూపమును 'అయి' అనుదానిని అర్థస్ఫూర్తికై చేర్చ మొదలిడిరి. "అవఘు, మా మామ శకుని నాకై కడంగి" (సభా. ౨-౩౮) = నా ప్రయోజనము అగునట్లుగా అయి = నాకొఱకు అయి, కడంగి.

ఈ 'కు' అర్థముననే కొఱకు, కొఱకయి అనునవి కూడ కాలక్రమమున వాడుకలోనికి వచ్చినవి. తుదకు 'కు'ను త్రోసిరాజని, దానిని షష్ఠీవిభక్తికి త్రోసివేసి కై, కొఱకు అనునవే చతుర్థీప్రత్యయములుగా పరిగణింపబడు స్థితి వచ్చినది. 'అగు'నుండి యేర్పడిన క్త్వార్థకరూపమేగాక, అన్యంతరూపమగు 'కాఁగ' అనునదికూడ చేర్పబడినది. "నాకై = నాకు గాఁగ." తరతమభావమును దెల్పుటకు 'కు' కు 'అంటె' అనునది చేర్పబడినది. దానికి + అంటె = దానికంటె ఇది గొప్పది. ఇట్టి భావము లనేకములను నన్నయ 'కు' ప్రత్యయముమాత్రముచేతనే సూచించినాడు.

"బ్రహ్మకుం దపముచేసి"=బ్రహ్మ (తనకు) అగునట్లుగా- ప్రత్యక్షు మగునట్లుగా - అనగా బ్రహ్మ నుద్దేశించి. దీనినే 'బ్రహ్మను గుఱించి- బ్రహ్మను గూర్చి' అని చెప్పుటయు గలదు. ఆత్మ్యముగా జేసికొని. "నీ వెల్లవారికి నత్యున్నతుడవు" = ఎల్లవారికంటె = ఎల్లవారికి+అంటె (అందరిలోపల- అందరిలోను).

యయాతికి అలుగుట; పౌష్యున కనుగ్రహించుట; నాకుం గరుణించుట; అక్కచునకు శోకించుట; నాకు వరించుట"— ఈ సందర్భములలో నన్నయ 'చతుర్థీ - కు' వర్ణకమును వాడుట ఈ కాలమున నించుక యాశ్చర్యమును కలిగింపకపోదు. కాని యిది "క్రుధ ద్రుహేర్ష్యాసూయార్థానాం యంప్రతి కోపః" అని పాణిని సూత్రించిన సంస్కృతభాషాసంప్రదాయమునందు నన్నయకు గల యాదరాతిశయమువలన గలిగినదే యనుటకు సందేహము లేదు. వానిపై కోపము, ఒకనిమీద దయ—అని సప్తమ్యర్థక శబ్దములను బ్రయోగించుటే తెలుగుసంప్రదాయము.

"ఎలుకమీది కోపమున నిల్లేర్చినట్లు" అని నన్నిచోడుడే ప్రయోగించినాడు.

"మదర్థం కన్యాం వృణీధ్వం" అను, భాషాసంప్రదాయమునుబట్టియే "నాకు వరించుట" యను పలుకుబడియు నేర్పడినది. ఇట్లు, నన్నపార్యుడు కారక విషయమునగూడ సంస్కృతభాషామర్యాదను తెలుగు రచనలోనికి విశేషముగా దెచ్చినవాడైనాడు.

# ఆగస్టు పదిహేను

[కథానిక]

●

## శ్రీ సహజానందం

సభావేదికవద్ద ధ్వజస్తంభం ఆకాశాన్ని అంటుతోంది. వేలమంది ప్రజలు శిఖరాగ్రంవైపు చూస్తున్నారు రెప్పలు వాల్చకుండా.

గాలివిసురుకు ఒక్కసారిగా జయపతాకం ఎగిరింది. శతసహస్రజీవులు—పండితులు, పామరులు, నిరక్షరకుక్షులు జీవద్భాష నేర్చుకున్నారు. ధనవంతులకు దరిద్రులకు అక్షయమైన సంపద లభించింది.

స్వాతంత్ర్యం! జన్మభూమికిపునర్జన్మ!!

జనసముద్రంలో విజయోల్లాసం. జయజయ ధ్వానాలు. ఆకాశమే జేగంటై మోగి, మార్మోగుతున్నట్టు, పృథ్వే పెదవులు విప్పి జయఘోష చేస్తున్నట్టు!

రత్నఖచితసింహాసనాలపై రాజాధిరాజులకు పట్టాభిషేకం జరిగిన దృశ్యం కాదు. దేశమే సింహాసనం. ప్రజలది ఆ సింహాసనం. ప్రజలే పాలకులు.

కిరీట మొకనిపై, దాస్యముద్ర ఇంకొకనిపై...ఆ యుగం అస్తమించింది.

పతాకస్థాపన చేసిన నాయకుడు ప్రజలవైపు తిరిగాడు. జయధ్వానాలకు అతని కళ్ళు చెమ్మగిలినయ్. హృదయం స్పందించింది. గాత్రం గాద్గదికమైంది. అతని కళ్ళముందెన్నో భయంకరదృశ్యాలు కదలిపోతున్నయ్. విప్పిన గాయంలా ఉంది స్మృతిపథం! యుద్ధభూమికోలాహలం...తీవ్రదైన్యం...ప్రాణార్పణ చేసిన పుణ్యజీవులతని స్మృతిపథంలో కళ్ళుతెరిచారు.

హతవీరుల సమాధిపై పుష్పవర్షం కురుస్తోంది. ఒకరితర్వాత ఒకరు పూలమాలలు విసురుతున్నారు.. అహ్హా.. వారేరీ?

పంద్రెండేళ్ళప్పుడు తుపాకికి గుండెనిచ్చిన ఆ పసికంకా...కన్నతల్లి ఏదీ? ఎక్కడ? ఇప్పటి పుత్రోత్సవాన్ని మించిన ఆహ్లాదం తల్లి కెప్పుడు సిద్ధిస్తుంది?

యౌవనంలో పతివియోగం పొందిన ఆ యువతు లెక్కడ? దాంపత్యాని కింతకంటె సాఫల్యం వేరేది? జీవితంయొక్క సంపూర్ణతను సిద్ధింపజేసికొన్నవారికి మృత్యువు లేదు. వారు చిరంజీవులు.

వయోభారంతో కుంగుతున్నా, అగ్నిగుండంలోకి దూకిన పెద్దలు నిత్యయౌవనులు! వీరిని దేశం మరువదు. ప్రజలు మరవరు. వీరే జాతికి అక్షరాభ్యాసం చేశారు.

—వేదికనుంచి వినబడుతున్న వీరగాథలకు ప్రజల హృదయాలు తల్లడిల్లినయ్.

లాఠీల మధ్య, తుపాకుల ముందు, ఉరితాళ్ళలో నెత్తురు గక్కి, అకాలమానుష

మృత్యువుకు ఆహుతి ఐనారు అజ్ఞాతవీరు లనేకులు. కాని వారి సంకల్పం శ్మశానాగ్నిలో భస్మంకాలేదు. మరింత స్థిరమై, హింసాయుధాలను నిర్వీర్యపఱచి, ప్రభుత్వపీఠాన్నే అధిరోహించి జయసిద్ధి పొందింది.

పీడనయొక్క నిష్ఫలత్వానికీ, మృత్యువు యొక్క అల్పత్వానికీ, సమర్పణ కున్న ప్రాణశక్తికీ ఇదే నిదర్శనం!

సంకెళ్ళమధ్య శుష్కించిన సంతతిలో ఈ అద్వితీయసాహస మెక్కడిది? ఈ సంకల్పశక్తి ఎక్కడిది? ఈ త్యాగతన్మయత ఎక్కడిది?

జననీ! గోడలు కూలి శిథిలమైంది ఇల్లు. దానమే ధర్మమైన జాతిచేతుల్లో ఇప్పుడు భిక్షాపాత్ర ఘోషిస్తోంది. అడుగడుక్కూ మృత్యువు అకాలంలో అగ్ని ద్వారాన్ని, నరకద్వారాన్ని తెఱుస్తోంది. సర్వత్రా దైన్యం అలముకొన్నది. కాని... కాని... ఈ అభాగ్యభూమిలో త్యాగశక్తి నశించలేదు. ఈ త్యాగమే, ఈ పూర్ణాహుతే, వధ్యశిలలపై స్రవించే రక్తమే సంజీవి! ఏ యుగాని కా యుగం ఒక మహాత్ముడుద్భవించి, తన త్యాగామృతంతో ఈ జాతికి జీవం పోస్తున్నాడు.

బాల్యం మసక, యౌవనం మసక, వార్ధక్య మసక త్యాగాగ్నిలో నిప్పులైన జీవులు...వీరిని జాతి ఎలా మఱువగలదు? వీరే ఈ దైన్యభూమిలో కాలిపోకపోయినచో, దాస్యపు కాష్ఠాగ్ని ఎప్పటికి చల్లారేది?

—ప్రజల కళ్ళవెంట అశ్రుధారలు ప్రవహించినయ్. 'మీరు మనుష్యులు...ఈ దేశం మీది' అని రుజువుచేసిన వీరుల ఛాయలు శూన్యంలో తటిత్తున మెరిసినయ్.

వందలకు వందలు పూలమాలలు విసిరారు.

స్వాతంత్ర్యోత్సవం ముగిసింది. జనులు గృహోన్ముఖు లయారు. నాయకులు ప్రజల ఆశీస్సుల నందుకొని వెళ్ళిపోయారు. వేదికపై దీపాలు ఆరినయ్.

చీకటి దట్టమైంది. ప్రజల జైజైలు దూరాన్నుంచి స్పష్టాస్పష్టంగా వినబడుతున్నయ్.

నిర్జనప్రదేశంలో ఒక మూలనుంచి ఎవ్వరో...గుంపు సభావేదికవైపు వెళ్తున్నారు. వేదికపై బొమ్మలూ, సామగ్రీ తీసి సమకూర్చుతున్న కార్యనిర్వాహకుల్లో ఎవ్వరో యువకుడు ఆ గుంపుమీద టార్చిలైటు వేశాడు.

బెదిరి అక్కడే నిలబడిపోయారు—గుంపు. చినిగిన పేలికలు...వికలాంగులు; దుమ్ముకొట్టుకొన్న నిర్జీవముఖాలు.

రోడ్లప్రక్కన బజారుకుక్కలను గెంటి, వాటిస్థానే కాపురం చేస్తున్న జీవరాశి.

"ఇక వెళ్ళండి. ఇళ్ళకు వెళ్ళండి" అన్నాడు వేదికమీది యువకుడు.

ఆ గుంపు ధ్వజస్తంభంపైకి చూస్తున్నారు. వికృతంగా 'జై' అని అఱిచారు.

గుంపులోంచి శతవృద్ధు లిద్దరు ముందుకు వచ్చి, నలిగిన పూలమాలలను హతవీరుల సమాధిపై బెదురుతూ బెదురుతూ ఆన్చారు.

"ఇంక ఇళ్ళకు వెళ్ళండి" అన్నాడు వేదికమీది యువకుడు. అతని పరివారంలో ఒకడు ఓపక్కకు చూపించి, "అదిగో...అటు ...అటు...ఇంకా వస్తున్నారు" అన్నాడు

మరొక గుంపు ఆ పక్కనుంచి వస్తున్నారు. యువకుడు మళ్ళీ టార్చిలైటు వేశాడు అవే చినుగులు. అదే దుమ్ము. అవే నిర్జీవముఖాలు...

వేదికమీద నున్న కార్యనిర్వాహకులు సామగ్రిని సమకూర్చుకొని గృహోన్ముఖులై బయలుదేరారు. ధ్వజస్తంభంచుట్టూ, హాత వీరుల సమాధిచుట్టూ 'మూగిన' జనం శూన్యసభాస్థలివైపు చూస్తున్నారు—దాత కేసి బిచ్చగాడు చూసినట్టు.

విన్న మహోపన్యాసాలు వాళ్ళ కర్థం కాలేదు. గాథలు చెప్పిన వీరులను వా రెరుగరు.

కాని ఏదో అవ్యక్త ఆశ...తమ జీవన వేదన ఇక ఉపశమిస్తుందని. ఈ చినుగులు, మురికి, అజ్ఞానం ఇక ఉండవని...ఏదో అస్పష్టభ్రమ. జరిగిన కోలాహలంలో వా రేమేమో కలలు కన్నారు.

ఒక్క క్షణం...ఎండు విస్తరాకుల మధ్య చెలరేగే ఆకలి యాతనను, చెత్త డబ్బాలపక్కన ఘూర్ణిల్లే మరణవేదనను మఱచి, దుమ్ములోంచి తలలు పైకెత్తి, నక్షత్రాలకేసి చూశారు! తమ చీకటి అమావాస్య ఆకాశంలో వెన్నెల పొర్లి ప్రవహిస్తోంది. నక్షత్రాలు మిరుమిట్లు గొల్పుతూ ప్రకాశిస్తున్నయ్.

కొత్తగా వచ్చిన గుంపులో కొందరు మాసిన పూలమాలలను పుచ్చుకొని బెదురుతూ నుంచున్నారు.

ఇళ్లకు బయలుదేరిన కార్యనిర్వాహకుల్లో ఒక వృద్ధు ధ్వజస్తంభంవద్ద ఆగి, ఈ నోరులేని జనసమూహాన్ని చూశాడు. వీరి శుష్కహృదయాల్లో ఏ సంకల్పం స్పందిస్తోంది? వీరి అల్పమనస్సుల్లో ఏ ఆలోచన పక్వమౌతోంది? వీరి మూగగొంతుకల్లో ఏ భాష రూపం పొందుతోంది? వీరి వికృత నేత్రాలు ఏ ఉషస్సుకై రెప్పలు వాల్చకుండా చూస్తున్నయ్?

వాళ్లవైపు ఓ అడుగువేసి, "పూల మాలలను ఆ సమాధిమీద పెట్టండి" అన్నాడు వృద్ధు.

జనసమూహం అతనికేసి చూశారు. అతని కళ్లు చెమ్మగిలినయ్.

గంటక్రితం కోలాహలం, చప్పట్లు, ఉపన్యాసాలు, నినాదాలు, శబ్దయంత్రాల ఘోష...ఇళ్లవైపు తిరిగిన కార్లసందడి... ఒక్కసారిగా అతనికి స్ఫురించినయ్. ఆ స్వాతంత్ర్యపూజ...ఉత్సవం...ఎంత సంరంభంతో జరిగింది?

తరువాత...దీపాలు ఆరినయ్. శబ్దయంత్రాలు లేవు. కోలాహలం నిశ్శబ్దమైంది. మెల్లగా, బెదురుతూ బెదురుతూ చీకటి మూలలనుంచి వచ్చి, ఈ సంస్కార విహీనులు, పశుప్రాయులు దుమ్ముగొట్టుకున్న పూలమాలలను హాతవీరుల సమాధిపై పెట్టారు. నిశ్శబ్దంగా ... ధ్యానాలు చేశారు.

ఆ శతవృద్ధు దుఃఖంతో కంపించాడు.

"ఈ సూర్యోదయం మీకే! దేశపు అశ్రుధార మీరు...యుగాలనుంచి. ఇప్పుడే మీకు మానవజన్మ. ఇది మీ యుగం. ఈ స్వాతంత్ర్యం మీ ఐశ్వర్యం. ఇక మీరు యాచకులు కారు. యజమానులు. ఇందు కోసమే వందలు, వేలు ప్రాణదానం చేశారు. స్వాతంత్ర్యం మీ ఐశ్వర్యం" అన్నాడు.

అయోమయమైన దృష్టులతో జనం అతని మాటలను విన్నారు. అతని గాత్రంలోని గాద్గదికకు, అతని కళ్లలోని అశ్రువులకు వారి హృదయాలు స్పందించినయ్. అతని ప్రబోధం, అతని మాటలు ఆకాశంలో తోక చుక్కల్లా, తటిత్తువలె దూసుకోపోయినయ్ —వారి మనస్సుల్లో. అతని భాష వారి కర్థం కాలేదు. కాని అతని మాటల్లో ఏదో వెలుగు ప్రసరిస్తున్నట్టు తోచింది.

వృద్ధూ, కార్యనిర్వాహకులూ అక్కడ నుంచి వెళ్లిపోతున్నారు. వెనక్కు తిరిగి ఎవరో కేక వేశారు. "ఇంకా ఇక్కడ ఎందుకు? మీ ఇళ్లకు మీరు వెళ్లండి."

జనం అక్కడనుంచి కదల లేదు. ఈ బహిరంగగర్జనప్రదేశం...ఆశాభూమిని వారు విడిచిపెట్టలేదు. ఇళ్ళు? వాళ్ళకు? ఎక్కడ?...'ధర సింహాసనమై, నభంబు గొడుగై..' అహ్హా. వారిక ఆ, ఆ రోడ్ల దుమ్ములోకి వెళ్లదలుచుకోలేదు. ముసలి మాటలు మధురసంగీతంలా, భజనగీతంలా వారి అంతరాళాల్లో ఝుంకారం చేస్తున్నయ్.

కొంతసేపుక్రితం విన్న పాటలు, కీర్తనలు, ఉపన్యాసాలు, వీరగాథలు, జయ జయ ధ్వానాలు ఆలాపనగా వినబడుతున్నయ్.



# కథాసాహిత్యము: పంతులుగారు

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

(గత సంచిక తరువాయి)

బరువున చిన్నవైనా గుణానికి పెద్దవైన మరో రెండు నవలలు సత్యవతీచరిత్ర, సత్యసంజీవని.

సత్యవతీచరిత్రలో పంతులుగారు సుగుణదుర్గుణాలతో, సదాచారదురాచారాలతో, మాధుర్యకటుత్వాలతో కూడి ఎంతో సహజంగా కనపడే ఒక ఆంధ్ర బ్రాహ్మణకుటుంబాన్ని చిత్రించారు. ఇంత చిన్న కథలో పంతులుగారు సృష్టించిన పాత్రలు నిండు జీవంతో కదలి ఏ మధ్యతరగతి బ్రాహ్మణకుటుంబం చూచినా కొందరు నారాయణమూర్తులూ, కొందరు సత్యవతులూ, కొందరు గండ్రయశోదమ్మలూ గయ్యాళి సుందరమ్మలూ నిత్యం దర్శన మిస్తూఉంటారు.

ఇందులో చేసిన నాలుగురకాల దంపతుల సృష్టి ౧౯ వ శతాబ్ది బ్రాహ్మణకుటుంబానికి రమణీయ వ్యాఖ్యానమే కాకుండా కథాగమనానికి అమోఘంగా తోడుపడ్డదికూడా.

వెంకటేశ్వర్లూ, సుందరమ్మా మొదటి జట్టు. ఇద్దరూ మూర్ఖులు. ఇద్దరూ స్వార్థపరులు. ఇద్దరూ దురహంకారులు.

రెండవ జట్టు—సత్యవతీ నారాయణమూర్తులు. ఆదర్శదంపతులు. కష్టసహనం, విజ్ఞానం, వివేకం, ఉపకారబుద్ధి, బంధుప్రీతి పుట్టుకతో వరప్రసాదముగా తెచ్చుకున్నవారు.

మూడవ జట్టు—మహాలక్ష్మి, రామస్వామి. మణిపూసా, మసిబొగ్గూ దాంపత్యం. రామస్వామికి చదువు రాదు. లేని వ్యసనం లేదు. ఇంట చెదిరించుకు తినే రకం. మహాలక్ష్మి చిన్నసైజు సత్యవతి. ఆమె శిక్షణంతో నిగ్గుతేరింది.

నాల్గవ జట్టు—సూరమ్మ, సుబ్రహ్మణ్యము. సూరమ్మ పల్లెటూరి మోటుకు. కాపురానికి మగనిని పీడించడం బాగా తెలిసిన సహజపాండిత్యంతో వచ్చింది. సుబ్రహ్మణ్యం చేసే హితబోధ బూడిద పన్నీరు. గాడిదతలంటు.

ఈ కథను ఉపాధిగా తీసుకుని పంతులుగారు ఒక సాంసారికజ్ఞానసర్వస్వాన్ని తయారు చేశారు.

పురుటింటి అనాచారాలు, నాటు మంత్రసానుల జిడ్డు, గయ్యాళి అత్తగారి చేతికింద కాపరం, గ్రహణకాలపు 'చాదస్తాలు', సహగమనపు కన్నీటికథలు, సీతవైధవ్యం, సోమసుందరంతో సంస్కారవివాహపు ఆశ, సంస్కారాభినివేశబీజాలు—ఇన్నిటినీ చాతుర్యంతో విన్యసించి, తాము ఆదర్శంగా ఆశించిన ఒక బ్రాహ్మణకుటుంబాన్ని ఇందులో చూపించడానికి ప్రయత్నించారు. ఈ కథలో ఇంకో విశేషం ఏమిటంటే—సంభాషణలో సజీవమైన వ్యవహారభాష ఉపయోగించి కథను మరింత జీవితానికి చేరువగా తెచ్చారు.

రెండవది సత్యసంజీవని.

పంతులుగారి కథనచాతుర్యం ఈ నవలలో మరీ చిత్రంగా ఉంటుంది.

కథ ఏమీ లేదు.

మాణిక్యం ఏడేళ్ల పిల్ల. ముత్తవతల్లిదగ్గర అక్క భ్రమరాంబా, తనూ ఉన్నారు. అక్కయ్య ఊళ్లో లేదు. ఒకనాడు మాణిక్యం ముత్తవతల్లి చూడకుండా మేడమీద గదిలోకి వెళ్లి అక్క ముత్యాలహారం దొంగతనంగా తీసి వేసుకొని ఆటకు వెళ్లగా ఆటలో అది తునిగిపోయింది.

ఆ నిజం ఒప్పుకోడానికి మాణిక్యం భయపడి ఆడిన అబద్ధాలవల్ల కుటుంబంలో ఎంతలేని చిత్త క్షోభలు కలిగినవో, నిరపరాధులైన ఇంట్లోని దాసీలమీద ఆ నేరాలు ఎట్లా పడతాయో పంతులుగారు రమ్యంగా చిత్రించారు.

స్థూలదృష్టికి ఇది ఒక నవలవలె కాన్పించినా సూక్ష్మంగా పరిశీలిస్తే మాత్రం దీనిలో నేటి కథానికా లక్షణాలు చాలా కనిపిస్తాయి.

సూటిగా ఒకే తంతువు పట్టుకొని ఏకాగ్రంగా పూలుగుచ్చినట్టు కథంతా ఒక్క ప్రధానాంశమీద ఆధారపడి ఒకే లక్ష్యంవైపు చరచర పరుగెత్తుతుంది.

కథ ఎక్కడ చదివినా ఒక్క అబద్ధం కప్పడానికి మాణిక్యం పడ్డ పాట్లూ, దానివెంట తలవని తలంపుగా పుట్టిన అనర్థాలూ ధ్వనిస్తూఉంటాయి.

ఈ కథ 'అబద్ధమాడరాదు—తోడేలు, గొల్ల పిల్లవాడు' అనే నీతిసూత్రంమీద పుట్టినా శుష్క పాఠంలా కేవలంగా జారిపోక ఉదాత్తమై హృదయ స్పందకమైన చక్కని కథానికలా నడిచింది.

మాణిక్యం ముత్యాలహారం దొంగిలించింది మొదలు అడుగడుగునా బెదురుతూ నిజం చెప్పబోతూ చెప్పలేక పెరుగుతూన్న పరిస్థితుల్లో ఊగిపోయే ఆ చిన్నమనస్సుబాధ, చెల్లెలు రామికి వచ్చిన అపకీర్తికి మంచంపట్టిన కుంటి వెంకడు సంధిలో పూచిక పుడకలవంటి చేతులతో ముత్యాలహారం తన మంచంమీద వెదుకుతూ రాజభటుల్ని, దండనం ఊహించి పడే మరణవేదనా మిక్కిలి శక్తిమంతంగా పంతులుగారు నిరూపించి దీన్ని ఒక గొప్పమనస్తత్వనిరూపకకథానిక (Psychological story)గా తయారుచేశారు. ఇది చదివినప్పుడు చిన్నపిల్లలకే గాదు, పెద్దవారికిగూడా అబద్ధం ఆడడానికి భయమేస్తుంది.

చంద్రమతీచరిత్ర, చమత్కారరత్నావళి, కురంగేశ్వరవర్తకచరిత్ర మొదలైన కథలు అన్యకథల ఆధారంతో ప్రవర్తిల్లినా వాటిలోసైతం పంతులుగారి వ్యక్తిత్వం, అచ్చపు జాతీయత స్ఫుటంగా కనబడతాయి.

చంద్రమతీచరిత్ర కేవలపురాణహరిశ్చంద్రకథ కోసమే ఉద్దిష్టమైనా పది ప్రకరణాలవరకూ పంతులుగారు చంద్రమతిగురువు విద్యాసాగరరూపంలో స్త్రీ విద్యవిషయంలో తమ అభిప్రాయాల్ని కుమ్మరించి తమలోని ఒక ఉత్తమోపాధ్యాయుణ్ణి ప్రదర్శించారు.

చంద్రమతీచరిత్రతుదిని "తమ రాజ్యమునం దంతటను బాలికాపాఠశాలలు స్థాపించి స్త్రీలనెల్లను సాధ్యమైనంతవరకు విద్యావతులనుగా జేసెను" అన్న వాక్యము చదివితే పంతులుగారి హృదయం స్త్రీ విద్యాభివృద్ధికోసం ఎంత తపించిందో మన కర్థమవుతుంది. (1) Comedy of Errors, (2) Merchant of Venice అను షేక్స్పియరుకవి నాటకకథలను మనస్సులో ఉంచుకొని మొదటిదానికి చమత్కారరత్నావళి అనీ, రెండవదానికి కురంగేశ్వరవర్తకచరిత్ర అనీ పేర్లు పెట్టి హిందూహృదయానికి సహజంగా తగిలేలా రెండు కథలు వ్రాశారు పంతులుగారు.

మొదటికథలో కథాచమత్కారమును మాత్రమే దేశీయులు చూచి ఆనందించవలె ననిగాక యోగిని వేషంలో ఉన్న చారుమతి పెద్దవసంతుని భార్య సీతకు చేసిన ఉపదేశమును భారతస్త్రీల కందరికీ తాము చేయదలచి ఈ సంఘటనమును కథకు కొలికిపూసగా అమర్చి దీన్ని సప్రయోజనం చేశారు.

కురంగేశ్వరచరిత్రలో అసలుకథలోని క్రైస్తవ యూదులకు బదులుగా హిందూ, బౌద్ధులను కల్పించడం పంతులుగారి ఉత్తమస్ఫూర్తికి తార్కాణం.

ఈ కథలోని వసుమతి సూక్ష్మబుద్ధి, సమయజ్ఞత హైందవస్త్రీల కందరికి ఆదర్శంగా ఎదుట నిలుపవలెనని పంతులుగారు కాంక్షించినట్టు కనపడుతుంది.

స్థాలీపులాకంగా శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి కొన్ని ముఖ్యమైన కథలమీద మాత్రమే ఇప్పుడు ప్రస్తావించడం జరిగింది. కాని ఆయన రచించిన కథలు ఇంకా పదులమీద ఉన్నవి. ఆయన చేపట్టి అమోఘకృషి చేసిన అన్నిసాహిత్యశాఖలూ సమగ్రపరిశీలన చేసి బుద్ధిమంతులు ఎన్నో సమీక్షలు

చేసి వాటిలోని అమూల్యరత్నాలను ఆంధ్రప్రజల దృష్టికి తీసుకురావలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

పంతులుగారి కథలు నిశితంగా చదివాక ఈ అభిప్రాయాలు కలుగుతాయి—

౧. పంతులుగారు గొప్ప కథకుడు. సందేహం లేదు.

౨. సాహిత్యం కేవలం కళ—అనే తత్త్వానికి చెందక సాహిత్యాన్ని విజ్ఞానానికీ, వినోదానికీకూడా పూర్తిగా వినియోగించి కృతకృత్యులైనారు.

౩. ప్రజలమధ్యకు నిరాఘాటంగా పోవలసిన రచనల్లో 'మడితెనుగు' అప్రయోజకంగనుక వివిధ సంధులు, విశేషశబ్దాలూ వాడి పాండిత్యం కుమ్మరించక సజీవాంధ్రవాణికి దగ్గరగా పొదుపుగా ఒక కమ్మని తెనుగువచనరచనను సృష్టించి శాశ్వతకీర్తి సంపాదించడమేకాకుండా సంభాషణలో అవసరమైన చోట ఏమీ సందేహించక శుద్ధవ్యవహారభాషను ప్రయోగించి తమ ప్రగతిశీలాన్ని పలుచోట్ల వ్యక్తపరిచారు. ఇంతేకాక—సభికులు, యజమానుడు, అపనమ్మకం, లాస్యాలు, దారాపుత్రులు మొదలైన మాటల విలువలు పూర్తిగా ఎరిగిఉండికూడా వాటిని స్వేచ్ఛగా ప్రయోగించి తను వ్యవహారాభినివేశాన్ని గూడా స్పష్టంచేశారు.

౪. పంతులుగారు నాస్తికులు కారు. పైగా మిక్కిలి దైవవిశ్వాసం గలవారు. అయితే—అంధజ్యోతిషవిశ్వాసాలమీద, మతం-దేవుడు పేరుమీదుగా జరిగే ఘోరాలమీద, హేతువాదశీలాన్ని చంపే సంప్రదాయాలు-శకునాలమీద ఆయన కున్న కదనకుతూహలం ఒక్కొక్కసారి ఆయన కథనకౌశలాన్ని బాధించినా ఆయన నొచ్చుకోరు.

౫. ఆంగ్లప్రభుత్వం, పాశ్చాత్యనాగరికత మన జాతికి చాలా మేలుచేసినవని ఈయననమ్మకం. రాజా రామమోహనరాయలు మొదలైన దేశాభ్యుదయకాములంతా దీన్ని ఆహ్వానించారు. కారణం ఏమంటే—ఆంగ్లేయప్రభుత్వం వచ్చిన కొత్తరికంలో మన దేశపు మూఢాచారాలనూ, గుడ్డివిశ్వాసాలను పారద్రోలడంలో చాలా సాహాయ్యం చేసింది. పాశ్చాత్యనాగరకత మన చరిత్రమీద, సాహిత్యంమీద, భావావళిమీద అమేయమైన తన ప్రభావాన్ని సోకించి కొత్త వెలుగులు ప్రసరించింది. ఆ కాలానికి ఈ కొత్తచూపు మిక్కిలి అవసరమై కనపడ్డది. రాజకీయంగా ఇన్ని సంఘర్షణలు తలయెత్తని ఆ రోజుల్లో ఇంతటి నవ్యాలోకాన్ని ప్రసాదించిన పాశ్చాత్యప్రభుత్వ, నాగరికతలకు మన పెద్దలు స్వాగతాంజలి పట్టినారు. ఈ దృష్టితోనే పంతులుగారు తమ కథల్లో పలుచోట్ల పాశ్చాత్యనాగరికతను శ్లాఘిస్తూ వచ్చారు.

మొత్తంమీద పంతులుగారు విషయంలో, విధానంలో బ్రహ్మాండమైన తిరుగుబాటు తెచ్చి ఏ రచన చేసినా మూడుకోట్ల ప్రజలను చూస్తూ 'వారికోసం' అన్నట్టు తమ కలాన్ని వినియోగించారు.

రవీంద్రసంగీతమనీ, శరత్సాహిత్యమనీ మన పొరుగుదేశాల్లో ఒక్కొక్క కవికి, ఒక్కొక్క ప్రముఖ రచయితకు ఇచ్చే అర్ఘ్యాణనుబట్టి చూడగా మనం మన ఉత్తమరచయితలను గౌరవించడం బాగా నేర్చుకోలేదని తెల్లమవుతుంది. కేవలం వీరేశలింగసాహిత్యమని మనం చదివి గౌరవించి పూజచేయవలసినంత ప్రత్యేకత శ్రీ పంతులుగారి గ్రంథసంచయానికి ఉన్నదని మనం మొదట గ్రహించాలి.

పంతులుగారి అన్నిశాఖల గ్రంథకలాపాన్నీ ఒకరాశిగా ఆంధ్రసాహిత్యనిధిలా ఒకచోట కూర్చి సాహిత్యాభిమాని ఐన ప్రతివాడూ దోసెడుపూలు దానిపై ఉంచి కృతజ్ఞతతో మోకరిల్లే పుణ్యదినం ఒకటి తెలుగువారికి కలుగుతుందా అనిపిస్తుంది.

శ్రీ పంతులుగారు రగిల్చిన భావవిప్లవం ఇప్పటికి సర్వతోముఖంగా ప్రజ్వరిల్లడానికి బదులుగా క్రమంగా చల్లారి పోవడమేకాకుండా హేయమైన పొగబండి సాహిత్యం, నీరసపత్రికాపరంపరా నేటి సారస్వతజీవితాన్ని పీడకలలా కలవరపెట్టడం విచారించదగిన విషయం.

ఇప్పటికైనా ఆంధ్రజాతి కన్నుతెరచి పంతులుగారివంటి ప్రజ్ఞావంతుల వినోదవిజ్ఞానసారస్వతాన్ని సమగ్రంగా చదివి తన అభివృద్ధి దారి తెలుసుకుంటుందా? అనే ప్రశ్నతో ఈ వ్యాసం ముగిస్తాను.

# ప్రతీకారము

[ఏకాంకిక]

●

శ్రీ చావలి సూర్యనారాయణమూర్తి

## ప్రథమ దృశ్యము

[ప్రదేశము : అశోకుని ఆలోచనామందిరము. ప్రవేశము : అశోకుడు ఆలోచనానిమగ్నుడై ఇటునటు పచారు చేయుచుండును.]

ప్రతీహారి (ప్రవేశించి)—మహారాజులకు జయము.

అశో—ఏమి సమాచారము ?

ప్రతీహారి—మహాత్ములు ఉపగుప్తులవారు వేంచేసియున్నారు.

అశో—ఉపగుప్త భిక్షువులా ?

ప్రతీ—చిత్తము.

అశో—సరే. ప్రవేశపెట్టుము.

ప్రతీ—దేవరయాజ్ఞ. (నిష్క్రమి)

(అశోకుడు తిరిగి ఆలోచించుచు పచారు చేయుచుండును. బౌద్ధభిక్షువు ఉపగుప్తుని ప్రవేశము.)

అశో—భిక్షుమహాత్ములకు నమస్కారము.

ఉప—శాంతి లభించుగాక !

అశో—ఈ యాసనము నలంకరింపుడు.

ఉప—మహారాజా ! నీవును కూర్చుండుము.

(ఇరువురును ఆసీను లగుదురు)

ఉప—మహారాజా ! ఏదియో దీర్ఘముగా నాలోచించుచున్న ట్లున్నావు.

అశో—అవును మహాత్మా ! రాజ్యభారము వహించువానికి నిశ్చింతత యెప్పుడు ?

ఉప—అవును. నిజమే. ఏ మా విషయము ?

అశో—కళింగదేశము నా సార్వభౌమత్వ మంగీకరించలేదు. నేడే దూత తిరిగివచ్చినాడు. దాని విషయమై ఆలోచించుచున్నాను.

ఉప—పోనిమ్ము. దానివలన నీ కేమి లోటు ?

అశో—మహాత్మా ! ఇది నా కవమానము కాదా ?

ఉప—నీ కవమాన మెట్లు ?

అశో—కళింగ, దక్షిణరాజ్యములుతప్ప సమస్త భారతదేశమున కధీశ్వరుడనైన నామాట మన్నించక పోవుట నా కవమానము కాదా ?

ఉప—ఏ దా విషయము ?

అశో—నా సార్వభౌమత్వ మంగీకరింపక పోవుటయే.

ఉప—కళింగదేశము స్వతంత్రమైనది. నీకు లోబడియుండుట, యుండకపోవుట దాని ఇష్టము. అందు నీ కే మధికార మున్నది ?

అశో—అధికారము లేకపోయినను నే నీ తిరస్కారము నెట్లు సహించియుండగలను ?

ఉప—సహించక మ రేమి చేయుదువు ?

అశో—రేపే కళింగదేశముపై దండెత్తి దానిని వశపఱచుకొందును. అప్పు డంగీకరించక తప్పునా ?

ఉప—యుద్ధము చేసియా ? ఈవిధముగా బలాత్కారమున నంగీకరింపజేయుటవలన నేమి ప్రయోజనము ?

అశో—వే ళేమున్నది? సమస్తభరతఖండమున కధీశ్వరుడ నగుటయే.

ఉప—ఎందు కీసామ్రాజ్యతృష్ణలో బడి యశాంతి నొందుట?

అశో—మహాత్మా! ఉత్తరమున హిందూదేశ సీమ దాటికూడ నారాజ్యము వ్యాపించినది. అక్కడ నా యాధిపత్య మంగీకరింపబడినది. ఇక దేశములో నివే యైన ఈ రెండు రాజ్యములను జయించక నామన స్సెట్లు ఒప్పును? ఇవి స్వతంత్రముగా నుండుట నా పరాక్రమమునకు, కీర్తికి కళంకము కదా!

ఉప—మహారాజా! రాజ్యము, కీర్తి ఇ వన్నియు వట్టి భ్రమ. ఇందు సుఖ మేమి?

అశో— అశేష భారతమహీతలమునకు సార్వభౌముడ నగుటకన్న వేఱు సుఖ మేమి కలదు మహాత్మా?

ఉప—అది కాదు. ఈ సుఖ మనిత్యము. ఇది దుఃఖరహిత మైనదికూడ గాదు. శాశ్వతసుఖము పొందగోరుము. ఉన్నదానితో తృప్తిపొంది ప్రజలను కన్న తండ్రివలె పాలించి ఇహపరలోకములను చూఱగొనుము. హింస వలదు.

అశో—తమవంటి మనోనిగ్రహము మావంటి వారి కెక్కడ లభించును? ఏమో! ఈ యుపదేశము నాతల కెక్కుట లేదు. కళింగదేశమును జయించి దాని తిరస్కారమునకు తగిన ప్రతీకారము చేయవలయును.

ఉప—మహారాజా! జాగ్రత్తగ నాలోచించుము. తుద కీప్రతీకార మెట్లు పరిణమించునో!

అశో—ఏమైనను సరియే. ఇంత చిన్న దేశమునకు భయపడుదునా?

ఉప—ఇది నీ దృఢనిశ్చయమేనా?

అశో—అవును మహాత్మా! తిరస్కారమును క్షమింపుడు.

ఉప—అది వేఱుగ నర్థించవలయునా? క్షమయే మా సర్వస్వము. సరే. నేను పోయివచ్చెదను.

అశో—చిత్తము.

ఉప—(లేచి) బుద్ధం శరణం గచ్ఛామి. (పోవును)

అశో—ఇక కళింగరాజ్యము నా భుజపరాక్రమమును చవిచూచునుగాక. ఎవ రక్కడ?

ప్రతీహారి—మహారాజులకు జయము.

అశో—మంత్రిసేనాపతులను చూడవలయును.

ప్రతీహారి—దేవరయాజ్ఞ. (నిష్క్రమించును)

(చారుమిత్రప్రవేశము)

చారు—మహారాజా! అభివాదములు.

అశో—ఓహో! చారుమిత్రా! ఏమి విశేషము?

చారు—మహాప్రభూ! మహారాణి వచ్చుచున్నారు.

అశో—సరే.

(తిష్యరక్షితప్రవేశము)

తిష్య—నాథా!

అశో—దేవీ!

తిష్య—ఏమిది? నే డింత దీర్ఘముగా నాలోచించుచున్నారు?

అశో—తిష్యా! అవును. రేపు కళింగదేశముపై యుద్ధమున కేగవలయును.

చారు., తిష్య—ఏమి? కళింగదేశముపై యుద్ధమా?

అశో—అవును. రేపే ప్రయాణము.

తిష్య—కారణము?

అశో—జయేచ్ఛయే. వే ళేమున్నది?

తిష్య—ఇంత తొందరగనే ప్రయాణమా?

అశో—వ్యవధి లేదు.

తిష్య—నేనును యుద్ధక్షేత్రమునకు రావచ్చునా?

అశో—నీ వెందుకు?

తిష్య—ఏమియు లేదు. యుద్ధము చూచుటకు.

అశో—రావచ్చును కాని అక్కడ నుండుట చాల కష్టము. ఇక్కడి వినోదము లుండవు. ఎప్పుడును యుద్ధవార్తలే వినవచ్చుచుండును.

తిష్య—వినోదమున క్షేమి? చారుమిత్రకూడ ఉండునుగదా! కొంత కాలక్షేపము జరుగును.

అశో—సరే. నీ ఇష్టము. ఇక నీ వంతఃపురమునకు పొమ్ము. మంత్రిసేనాపతులతో రహస్యముగా కొన్ని విషయములు చర్చించవలయును.

తిష్య—మంచిది. (చారుమిత్రతో నిష్క్రమి)

(అశోకుడు పచారుచేయుచుండును)

## రెండవ దృశ్యము

[ప్రవేశము: తిష్యరక్షిత, చారుమిత్ర. మహారాణి శిబిరము.]

తిష్య—చారుమిత్రా!

చారు—మహారాణీ!

తిష్య—ఏదీ, ఒకసారి శ్రవణానందముగ పాడుచు నయనానందముగ నృత్యముచేయుము.

చారు—(ఆశ్చర్యముతో) నృత్యమా?

తిష్య—అవును. ఏమది, ఆశ్చర్యపడుచున్నావు?

చారు—ఇది యుద్ధక్షేత్రముగదా!

తిష్య—అయిన?

చారు—యుద్ధభూమిని నృత్యసంగీతములు జరుగరాదని అశోకసార్వభౌముల యాజ్ఞ గదా?

తిష్య—ఆఁ,దాని కేమి? భయము లేదులే. మహారాజులు నాయం దెంత గాఢానురాగులై యున్నారో నీ వెఱుగవా? వా రెల్లప్పుడు నా సంతోషమునే కోరుచుందురు.

చారు—సామ్రాజ్ఞీ! ఆజ్ఞోల్లంఘనము చేసిన వారికి కఠినదండన విధింపబడును. ప్రాణములు దక్కుట సంశయాస్పదము.

తిష్య—తిష్యరక్షిత యుండగా నీ కా భయ మెందుకు? ఊఁ, ప్రారంభించు.

చారు—మహారాణియాజ్ఞ! (కాళ్ళకు గజ్జెలు కట్టుకొనును.)

(అశోకుడు ప్రవేశించి)

అశో—ఏమి, గజ్జెల చప్పుడా? చారుమిత్రా! (కొంచెము కోపముతో)

తిష్య—నాథా!

అశో—పాదములతో గజ్జెల నలంకరించుచున్నా వెందులకు? నృత్యమునకా?

చారు—(నిశ్శబ్దము)

అశో—మాట్లాడవేమి? నృత్యమునకేనా గజ్జె కట్టుచున్నావు?

తిష్య—బేలా, భయపడెదవేల? నాథా! అవును. నృత్యమునకే. దీని కింత కోప మెందులకు?

అశో—దేవీ! యుద్ధనియమముల నెఱుగవా?

తిష్య—ఏ వవి?

అశో—కామినీనృత్యసంగీతములు సమరభూమి యందు త్యాజ్యములు. వాటి గాలి సోకినా యుద్ధమందు విజయము సున్న.

తిష్య—ఎఱుగకేమి? కాని......

అశో—కాని,...?

తిష్య—కాని ఇంతమాత్రముననే యపజయము కల్గునా? అప్పుడప్పుడు మనోవినోదమున కివికూడ అవసరమే కదా!

అశో—అట్లు కాదు. తిష్యా! యుద్ధమం దిట్టి వినోదములకు తావు లేదు. [illegible]మిత్రా! నా యాజ్ఞ నుల్లంఘించినందులకు నీకు మరణదండన తప్పదు.

చారు—(కంపితస్వరముతో మెల్లగా) మరణ దండనయా!

తిష్య—మహారాజా! ఆగ్రహింపకుడు. ఇందు, పాప, మామె దోష మేమియు లేదు.

అశో—మఱి?

తిష్య—ఆమెను నృత్యముచేయుమన్నది నేను. ఆ బాధ్యత నాది.

అశో—(ఆమాటలు వినిపించుకొనక) చారుమిత్రా, నీవు పాలుపోసిపెంచిన పాముచంద మైతివి. ఏవిధముగ నైనను మహారాణిని, తద్ద్వారా నన్ను

యుద్ధవిముఖులను జేసి స్వదేశమును రక్షింపజూచు చున్నావు. ఏమి నీ మోసము! ఇంతకాలమునుండి నీవు చూపిన భక్తి కల్లయేనా?

చారు—మహారాజా! మన్నింపుడు.

అశో—ఛీ! దుష్టురాలా! సిగ్గులేక ఇంకను నోరెత్తి మాట్లాడుచున్నావా? నీకు మరణదండన తప్పదు!

తిష్య—మహారాజా! ఇది చాల అన్యాయము.

అశో—ఏమి?

తిష్య—అవును. నేరమునకు బాధ్యురాలను నేను. ఆమె కాదు. నిష్కారణముగా కల్లకపటము తెలియని యామెను తూలనాడి మరణదండన విధించుట న్యాయముకాదు.

అశో—దేవీ! ఈమెను రక్షింపజూడకుము. ఇది ప్రక్కలోని బల్లెముపంటిది.

తిష్య—రక్షించుట కొఱకు గాదు. నిజ మదియే.

అశో—ఏమి? నిజముగ నీవేనా నా యాజ్ఞను ధిక్కరింప ప్రోత్సహించినది?

తిష్య—తమ యాజ్ఞాతిరస్కారమునకు గాదు.

అశో—మఱి?

తిష్య—కేవలము మనోవినోదముకొఱకు.

అశో—మనోవినోదమునకా!

తిష్య—అవును.

అశో—యుద్ధక్షేత్రమందు మనోవినోదమా?

తిష్య—నాథా, యుద్ధభేరీనినాదములు, సైనికుల హాహాకారములు, మరణవార్తలు వినివిని నా చెవులు చిల్లులుపడిపోయినవి. సంగీతశ్రవణము, నృత్య దర్శనమువలన ఆ బాధ కొంత యుపశమించునని నృత్యము చేయుమంటిని. ఈ కళింగయుద్ధము మొదలు పెట్టి ఎన్నోదినము లైనది. చివర కెట్లు పరిణమించునో!

అశో—ఏమైనను ఈ కళింగజాతిని విశ్వసించుట తగదు. ఈ దేశమును జయించి ఈ జాతిని పాదాక్రాంతి మొనర్చుకొనినగాని నాకు శాంతి లేదు. చారుమిత్రా! నీ ప్రాణములను రక్షించితిని. నేటినుండి నీవు నాకంట బడరాదు. పొమ్ము.

చారు—(మెల్లగా పోవును.)

తిష్య—ఒక కుసుమకోమలహృదయమును నిర్దయగా నులినులి చేయుచున్నారు. ఇది తగదు. పాపము, మన్నింపుడు.

అశో—మన్నించుటా?

తిష్య—అవును. ఆమె నిర్దోషిగదా!

అశో—అశోకుని నోటినుండి వెడలిన మాటకు తిరుగులేదు. నీయందలి గౌరవముచేతనే యామెప్రాణములను రక్షించితిని.

తిష్య—చిన్నతనమునుండియు మన యొద్ద పెరిగి పెద్దదైనది.

అశో—అయిన నేమి చేయుమందువు?

తిష్య—ఆమెను దండింపవల దందును.

అశో—అ దెన్నటికిని జరుగదు. ఏమియు నెఱుగని నంగనాచివలె నటించుచు ఇక్కడి రహస్యము లన్నియు తన దేశక్షేమమునకై మన శత్రువుల కెఱిగించుచున్నది. లేనియెడల 'ఉఫ్'అని యూదివేయదగిన యీ రాజ్యమును జయించుట కింతకాల మెందుకు? నా కింత సైన్యనష్ట మెందుకు కలుగును?

తిష్య—నాథా, చారుమిత్ర నిట్లనుమానించుట శుద్ధఅన్యాయము. ఆమె స్వామిభక్తిపరాయణతను శంకించుట తగదు.

అశో—తిష్యా, నీవు వట్టి అమాయకురాలవు.

తిష్య—ఎందుచేత?

అశో—ఈ నక్కజిత్తులు నీ కింకను తెలియవు. తన మాతృదేశముపై ఇంతటి ఘోరవిపత్తు వచ్చిన దని చారుమిత్ర ఎంత హృదయావేదన నందుచున్నదో, దానిని తప్పించుటకై ఎన్ని పన్నాగములు పన్నుచున్నదో నేను నిత్యమును గమనించుచునే యున్నాను.

తిష్య—జాత్యభిమానము, దేశాభిమానము ఉండవచ్చును. అందు తప్పేమి?

అశో—అది యున్నవాడు పరజాతికల్యాణము కోరుట అసంభవము.

తిష్య—పోనిండు. మీకుమాత్ర మింత పట్టుదల ఏల? ఈ చిన్నదేశమును స్వతంత్రముగ నుండనీయ రాదా? దీని మనుగడవలన మన సామ్రాజ్యమునకు హాని కలుగు నను భయ మేమియు లేదుగదా!

అశో—దేవీ, అట్లు కాదు. ఇంత విశాల సామ్రాజ్యములో ఒక చిన్న స్వతంత్రరాజ్యము నుండ నిచ్చినయెడల ముమ్ముం దెట్టి ప్రమాదము కలుగునో ఎవరు చెప్పగలరు? ఇప్పుడు గోటితో చీల్చగలుగునది అప్పుడు గొడ్డట చీల్చవలసివచ్చును. పూనికతో దీనిని గూడ జయించితినా భారతవర్షమున కేకచ్ఛత్రాధిపతి నగుదును.

తిష్య—ఎందు కింత సామ్రాజ్యతృష్ణ? ఉన్న దానితో తృప్తిపడియుండగూడదా?

అశో—తృప్తియా? తృప్తి యనునది రాజ నీతిలో లేదు.

తిష్య—దీనికై వ్యర్థముగ నింత నరహత్యయా?

అశో—తిష్యా, పొరబడుచున్నావు.

తిష్య—అదెట్లు?

అశో—ఇది నా సామ్రాజ్యతృష్ణ కాదు.

తిష్య—మఱి మృగతృష్ణయేనా?

అశో—ఓహో! ఇంత పిన్నవయసున నేదాంతము ఎట్లలవడినది?

తిష్య—నిజ మంతే కదా!

అశో—ఇది భారతజాతిశ్రేయమునకై తల పెట్టినది. జాతిని వీర్యవంతమొనర్చి దేశమును బలవత్తర మొనర్చుటయే నా యుద్దేశ్యము.

తిష్య—అయిన ఇంకను ఈ యుద్ధ మెంత కాలము?

అశో—నేటితో జయమో, అపజయమో తేల వలయును.

(సైనికుడు ప్రవేశించును)

సైని—సార్వభౌములకు జయము!

అశో—(సంతోషముతో) అదిగో! జయ వార్త వచ్చినది.

సైని—ప్రభూ!

అశో—ఇదిగో, ఈ ముత్యాలహారము బహుమాన మిచ్చుచున్నాను. తీసుకో.

సైని—మహారాజా! మహాప్రసాదము.

తిష్య—ఇంకను ఏదో చెప్పదలచుచున్నట్లున్నాడు.

అశో—మఱేమి సమాచారము?

సైని—మహారాజా! ఒక స్త్రీ చనిపోయిన తన పుత్రు నెత్తికొని దుఃఖించుచు సార్వభౌముల దర్శనార్థమై వేచియున్నది.

తిష్య—స్త్రీయా! మృతబాలకు నెత్తుకొనియా?

సైని—చిత్తము మహారాణీ!

తిష్య—అయ్యో! పాపము!

అశో—సరే. ప్రవేశపెట్టుము.

సైని—దేవరయాజ్ఞ.

తిష్య—పాప మామె కెంత విపత్తు వాటిల్లినదో!

(కొంతసేపు నిశ్శబ్దము)

(మృతబాలకు నెత్తుకొని దుఃఖించుచు స్త్రీ ప్రవేశము.)

తిష్య—చెల్లీ! ఎవరమ్మా నీవు?

స్త్రీ—అమ్మా! ఎవతె నైన నేమి?

అశో—నీకు కలిగిన కష్ట మేమి?

స్త్రీ—మహారాజా! కనబడుట లేదా?

తిష్య—ఈబాలు డెట్లు మృతినందెను?

స్త్రీ—తమ ప్రభావముననే.

అశో—అదేమి అట్లనుచున్నావు?

స్త్రీ—మఱేమనమందువు మహారాజా?

అశో—నీ పుత్త్రిమరణమునకు మే మెట్లు కారకులము?

స్త్రీ—మీరు కాకపోయిన మీ సైనికులు.

అశో—సైనికులా?

స్త్రీ—అవును.

అశో—వారికి నీబాలునితో పనియేమి ?

స్త్రీ—నా బాలునితోనే కాదు. పట్టణమందలి బాలురందఱితోను పని కలిగినది.

అశో—ఏమి పని ?

స్త్రీ—ప్రత్యక్షముగా చూచుటలేదా మహారాజా ?

తిష్య—బాలుర నందఱను సంహరించినారా ?

స్త్రీ—వేఱుగ చెప్పవలయునా మహారాణీ ?

తిష్య—ఏ మిది నాథా ?

అశో—ఏమో ! ఏమియు తెలియకున్నది.

స్త్రీ—అవును. ఎట్లు తెలియును ? విజయోన్మాద మావరించినవానికి యుక్తాయుక్తము లెట్లు తెలియును ?

అశో—అమ్మా! మాటలతో నా హృదయమును చంపక సంగ తేమియో తెలియజెప్పుము.

తిష్య—అవును చెల్లీ ! మహారాజున కీ విషయ మేమియు తెలియదు.

స్త్రీ—మహారాజా ! తెలియదా ? లేక ఏమియు నెఱుగనివానివలె నటించుచున్నావా ?

అశో—నిజముగా తెలియదమ్మా.

తిష్య—నీభర్త ఎవరు ?

స్త్రీ—(దుఃఖించుచు)నాభర్త యొక సైనికుడు.

అశో—అత డెక్కడ ?

స్త్రీ—వీరస్వర్గమున.

తిష్య—అయ్యో !

స్త్రీ—అమ్మా, నేనే కాదు. నావంటి స్త్రీ లెందఱో దేశమును రక్షించుటకు తమ పతులచే రక్త దానము చేయించిరి.

అశో—అది సరే. తరువాత ?

స్త్రీ—తరువాత నేమున్నది ? మావంటి యనాథలతో నిండిన దేశమున నుండజాలక జయలక్ష్మియు మిమ్మే వరించినది.

తిష్య—అటుపైన ?

స్త్రీ—అశోకుని కృపాణము అన్నెపున్నెము లెఱుగని, పూర్తిగ కన్నులైనను తెఱవని ఈ పసికందులను, ఒకవంక భర్తృమరణమువలనను, మఱొకవంక పరాజయమునను దుఃఖించుచున్న స్త్రీలను వెదకినది.

అశో—అమ్మా ! అట్టి నీచకర్మ మొనరించు నంతటి నీచుడను కాను.

స్త్రీ—కానిచో నీ సామ్రాజ్యతృష్ణ ఎట్లు చల్లారును ? 'యథా రాజా తథా ప్రజాః.' అయ్యో ! వలదు వలదని పాదములబడి ప్రార్థించినను నీ సైనికులు యమకింకరులవలె పైబడి హింసించినారే! గృహములు కాల్చియు, శిశువులను స్త్రీలను చంపించియు సంపాదించిన జయము మంగళకరమా ? వేలాది సైనికులను జంపి సంపాదించిన జయము చాలదా ?

అశో—అమ్మా, దుఃఖింపకుము. దీనికి తగిన చర్య తీసికొందును. ఇది నా యాజ్ఞ లేకయే జరిగిన పని.

స్త్రీ—ఏమి చేసిన నేమి ? నా కుమారుడుకూడ నాకు కఱవైపోయినాడు.

తిష్య—చెల్లీ, ఊరడిల్లుము. నీ దుఃఖము నా హృదయమును గూడ కలచివేయుచున్నది !

అశో—ఎవ రక్కడ ?

సైని—మహారాజునకు జయము.

అశో—నీవు వెంటనే పోయి పట్టణములో జరుగుచున్న శిశువధ నాపమని నాయాజ్ఞ తెలిపి, ఆ క్రూరకృత్య మాచరించుచున్న సైనికుల నందఱను తెచ్చి నాసమక్షమున ప్రవేశపెట్టుము.

సైని—చిత్తము.

## మూడవ దృశ్యము

[నిశీథము. ఇరువురు సైనికులు నిశితకరవాలములు చేతబుచ్చుకొని అశోకుని శిబిరము చెంతకు వచ్చుచుందురు.]

మొ. సైని—అబ్బ ! ఎంత పిశాచకృత్యము !

రెం. సైని—కాక మఱి యేమి?

మొ. సైని—జయమందియు కసిదీరక శిశువధ చేయించినాడు.

రెం. సైని—కాని యిది యశోకుని పని యని తోచదు. వాని యాజ్ఞ లేకయే వాని సైనికు లట్లు కావించియుందురు.

మొ. సైని—ఏమైనను దాని బాధ్యత యతనిదే కదా?

రెం. సైని—తప్పక. మఱింకెవరి దగును?

మొ. సైని—నా కసిదీర నొక్క వ్రేటులో వాని తల నఱికి వేయుదును.

రెం. సైని—అవు నదియే తగిన శాస్తి. కళింగ జాతికి కలిగిన ఈ యవమానము భరింపరానిది.

మొ. సైని—ఉష్! మెల్లగా మాట్లాడుము. శిబిరములను సమీపించుచున్నాము.

రెం. సైని—అర్ధరాత్రి యైనది.

మొ. సైని—అందఱును జయోత్సాహములో మైమఱచి నిద్రించుచున్నారు.

రెం. సైని—ఇదియే తగిన సమయము.

మొ. సైని—నడువుము. తొందరగా పని ముగించుకొని పోదము.

రెం. సైని—లేనిచో పట్టుపడుదుము.

ఒక స్త్రీ—ఎవ రది?

.................

స్త్రీ—ఎవరు? మాట్లాడరేమి?

మొ. సైని—(మెల్లగా) స్త్రీవలె నున్నది.

రెం. సైని—అవును. (సమీపించి) నోరెత్తకు. లేనిచో ప్రాణములు దక్కవు.

మొ. సైని—మహారాజు శిబిర మెక్కడ?

స్త్రీ—ఏమి, మహారాజు శిబిరమా?

మొ. సైని—అవును.

స్త్రీ—ఈ ఖడ్గము లెందుకు?

మొ. సైని—కళింగజాతికి అశోకుడు కావించిన పరాభవమునకు ప్రతీకార మొనర్చుటకు.

స్త్రీ—అర్ధరాత్రి మహారాజును వధింప వచ్చితిరా! అది మీ కెన్నటికిని సాధ్యము కాదు.

రెం. సైని—సాధ్య మగునో, కాదో ఇప్పుడే చూచెదవు.

స్త్రీ—దురాత్ములారా! యుద్ధములో జయించలేక నిశాసమయమున దొంగచాటుగా కుక్కలవలె ప్రవేశించి ఈ నీచకృత్యమునకై పాల్పడుటయేనా మీ పౌరుషము! ఛీ! కళింగజాతికి కూడ తీరని కళంక మాపాదించినారు! నన్ను చంపిగాని మీరు ముందునకు పోజాలరు!

రెం. సైని—అ దెంత పని? కాచుకొనుము.

(కొంతసేపు పోరాటము)

(ఒక డామెహృదయములో కత్తితో పొడుచును)

స్త్రీ—హా దురాత్ములారా! (బిగ్గఱగా) సైనికులారా! లెండు. మహారాజును రక్షింపుడు.

కొందఱు సైని—ఏమి! చారుమిత్రా!

చారు—(మెల్లగా) అవును. మహారాజును హత్యచేయుటకు ఇరువురు దుష్టులు వచ్చిరి. వారితో పోరాడి తరిమివేసితిని. నాజన్మ ధన్యమైనది.

సైని—వీరుగో! మహారాజులు దయచేయుచున్నారు.

అశో—ఏమి యీ కలకలము? ఆ! చారుమిత్రా! ఎవ రీమెను పొడిచినది?

సైని—మహారాజా! ప్రభువుల ప్రాణరక్షణార్థము ఈమె తన ప్రాణముల నడ్డినది!

చారు—(హీనస్వరమున) మహాప్రభూ! నా జీవితము నిష్కళంక మైనదా?

అశో—అయ్యో! చారుమిత్రా! నీ స్వామిభక్తిని గ్రహించలేక నిన్ననేకవిధముల తూలనాడితిని. నా పాపమున కిక నిష్కృతి లేదు. నా జయము వృథా యైనది.

సైని—ప్రభూ! మహారాణి.

తిష్య—నాథా! ఏ మిది? ఆ. చారుమిత్రా! ఏ మిట్లున్నది?

అశో—అవును. నన్ను హత్యచేయుటకై వచ్చిన దుండగీంద్రను హతమార్చుటకై తన యసువులు బలియిచ్చినది. నా కొక గొప్ప పాఠము నేర్పినది.

చారు—మహాప్రభూ! మహారాణీ! సెలవు.

ఇద్దఱు సైనికులు—మహారాజా! మహారాజా! ఇదుగో శత్రుసైనికులు పట్టుబడిరి.

అశో—వారిని వదలివేయుడు.

సైని—శత్రుసైనికులు ప్రభూ! వీరిని....

అశో—అవును. వదలివేయుడు.

సైని—చిత్తము. పొం డావలకు.

అశో—ఈ శవమును మంచిగంధపు చెక్కలతో దహన మొనర్చి సుందరమైన సమాధి నిర్మింపుడు.

## నాలుగవ దృశ్యము

[అశోకుని శిబిరము]

ఉపగుప్తుడు—మహారాజా, మొదటినుండియు నేను చెప్పుచునేయున్నాను. కాని నీవు సామ్రాజ్య వ్యామోహమునబడి....

అశో—నిజమే మహాత్మా! సామ్రాజ్య వ్యామోహము నాకన్నులు కప్పివైచినది. నా వివేక మును హరించినది.

ఉప—దానివలన యుక్తాయుక్త విచక్షణ జ్ఞానముకూడ నశించినది.

అశో—అవును. ఈ వ్యామోహమున బడి నిష్కళంకమగు చారుమిత్రస్వామిభక్తిని శంకించితిని. తలచినంతనే హృదయము కంపించు భయంకరహింస చేసితిని.

ఉప—అశోకమహారాజా! ఇప్పుడైనను మించి నది లేదు. సామ్రాజ్యతృష్ణ విడనాడి సార్థకనామ ధేయుడవు కమ్ము. బుద్ధభగవానుడు చూపిన మార్గమున బోయి నీవు తరించి నీప్రజలను తరింపజేయుము. అహింసయే పరమధర్మముగా నెంచి శాంతితో రాజ్య పాలనము చేయుము.

అశో—మహాత్మా! ఉపగుప్తా! తమ యాజ్ఞ శిరసావహించి నేటినుండియే—ఈ క్షణమునుండియే అహింసాదీక్ష నవలంబించుచున్నాను. సంసారసాగర మును తరింపజేయు బౌద్ధధర్మమును దేశ మెల్లెడల వ్యాపింపజేయుదును. బుద్ధం శరణం గచ్ఛామి.

ఉప—తథాస్తు. దేశచరిత్రలో నీ నామము సువర్ణాక్షరములలో లిఖింపబడును.



# ప్రాచీన ఖగోళవేదం

## 8. గ్రహములు

●

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

ఋక్కులలో శుక్రబృహస్పతు లున్నారు. అంగే శుక్ర-మంథిక్-పదములు గ్రహార్థకములుగా కానిపించును.1 తైత్తిరీయసంహితయందలి గ్రహశబ్దమునకు యజ్ఞపాత్ర మని యర్థము 2. ఐతరేయ, శతపథబ్రాహ్మణములందలి గ్రహశబ్దమునకు సోమరసమును గ్రహించు పాత్ర మని అర్థము.

ఐతరేయబ్రాహ్మణమున సోమపాత్రలు తొమ్మిది, గ్రహములును తొమ్మిది3. సోమరసమును గ్రహించును గాన గ్రహ మనగా సోమ-పానపాత్ర.

సూర్యాదులయెడల గ్రహశబ్దము ప్రసిద్ధము. సూర్యాదులు గ్రహము లనబడుటకు దేనిని గ్రహింతురు? గతి నని ఖగోళశాస్త్రము, మన భాగ్యము నని ఫలజ్యోతిషము చెప్పును 4.

గ్రహశబ్దమునకు గ్రహణ మనియు అర్థము కలదు. 'భానోర్ గ్రహే', 'సకలగ్రహే' అని సూర్యసిద్ధాంతము. సూర్యగ్రహణమనగా సూర్యు నాక్రమించుట. ఎవ రాక్రమింతురు? రాహువు. కావున రాహువు గ్రహము.

అన్ని మన్వంతరములందును అందరు దేవతలును సూర్యగ్రహనక్షత్రములను ఆశ్రయించుకొని యుందురని పురాణములు చెప్పును. చంద్రసూర్యాదులు గ్రహములు. పుణ్యపురుషులకు నక్షత్రములవలెనే దేవతలకీ సూర్యచంద్రాదులు గృహములు. ఈ గృహములే గ్రహములు అని వేదపురాణములు 5. ఇచట గ్రహములకు, గ్రహరూపులగు దేవతలకును ఏకత్వము గమనింపదగినది.

చంద్రుడు, సూర్యుడు మొదలగు తేజఃపిండముల నుద్దేశించి యజ్ఞములందు వేరువేరు పాత్రలకు వాడుక కలదు. కాలక్రమమున ఆ పేరులే తేజఃపిండములకు వాడుక యాయెనని కొందర మతము. వీరు వేదకాలమున గ్రహజ్ఞానము లేదని అందురు. కాని ఇది విరుద్ధము. ఉద్దేశవిధేయములను ఇంత తలక్రిందులుగా చూచుట అసంభావ్యము.

పూర్వకాలమునందు సూర్యచంద్రులకం టె వేరగు గ్రహములకు తారలనియు, నక్షత్రము లనియు పే రుండవచ్చును. గ్రహము అను పేరు వానికి లేక

---

1. 3-3-2-1; 10-4-6-8.

2. గ్రహశబ్దమునకు మొదటి యర్థము ఆచ్ఛాదక మగు మూతదుగాని పాత్ర కాదని మార్టిన్ హాగ్. కాని పాత్రగ్రహోభయవాచకముగా బ్రాహ్మణములందు పలుతావుల గ్రహపదప్రయోగము కలదు. ఆచ్ఛాద్యాచ్ఛాదకములకు రెంటికిని గ్రహపదము వాచకమే. రాహువు ఆచ్ఛాదకము. అది గ్రహము. సూర్యుడు ఆచ్ఛాద్యుడు. అతడును గ్రహమే.

3. 3-1.

4. 'గృహ్ణాతి గతివిశేషాన్, యద్వా గృహ్ణాతి ఫలదాతృత్వేన జీవా నితి గ్రహాః'

5. 'దేవగృహా వై నక్షత్రాణి'—తై. బ్రా. 1-5-2. 'తేన గ్రహా గృహా స్యేవ తదాఖ్యా స్తే భవన్తి చ' (లింగ. 61 అధ్యా).

పోవచ్చును. అంతియకాని ప్రాచీనులకు శుక్రాది జ్ఞానము లేదనుట కల్ల. సిద్ధాంతములు వీనిని తారా గ్రహము లని వాడెను. నక్షత్రములనుండి గ్రహములను విడదీయకగనే జ్యోతిఃపదము గ్రహనక్షత్రసామాన్య వాచక మాయెను. ఈ దెస గ్రహనక్షత్రాదుల నధిక రించు శాస్త్రమునకు జ్యోతిశ్శాస్త్ర మను పేరు వచ్చి యుండును.

## బు ధు డు

వాయ్వాదిపురాణములలో సూర్యచంద్రనక్షత్ర శుక్రబుధకుజబృహస్పతిశనులు ఒకరిపై నింకొక రున్నారని కలదు. బుధాదిగ్రహము లైదును కామ రూపము కల ఈశ్వరు లని వాయువు 6. బుధ, శని, కుజ శుక్రు లష్టమూర్తి యగు నీశ్వరుని సంతాన మని విష్ణు పురాణము 7.

బ్రాహ్మణమునను, పురాణములందును తారా శశాంకుల కథ కలదు. ఆ కథ అసలు ఆకాశకథ.

'బ్రహ్మ యెంత చెప్పినను చంద్రుడు తారను విడువ ననెను. బృహస్పతి విడిపించుటకు ప్రయతిం చెను. ఫలితముగా సంగ్రామ మారంభమాయెను. శుక్రుడు చంద్రుని వైపును, ఇంద్రుడు బృహస్పతి వైపు నను నడుముకట్టిరి. ఈ రీతిగా తారకకొరకు జరిగిన సంగ్రామము కాన దీనికి తారకామయసంగ్రామ మని పేరు' అని విష్ణుపురాణము 8.

గ్రహనక్షత్రముల సమాగమమును సంగ్రామ మనియు, రణ మనియు, యుద్ధ మనియు సిద్ధాంతములు వ్యవహరించును.

తారాశశాంకపు తార యెవరు ?

ఏ తారకడ చంద్రుడును, బృహస్పతియు, శుక్రుడును, బ్రహ్మతారయు నుండునో ఆ తార.

అది తిష్య యని కొందరు. దానికి దేవత బృహ స్పతి.

బుధునకు రౌహిణేయు డని పే రున్నది. కావున రోహిణి యని కొందరు. కాదని మరి కొందరు— 'రోహిణి చంద్రుని ప్రేయసి; పైగా మహిషి. ఆమెతో బృహస్పతికి అంటు ఉండరాదు. రోహిణికి సంతు లేదు. మనువు చెప్పినటులు పలువురు భార్యలలో నే యొక తెకు పుత్రు లున్నను వారితోడనే మిగిలినవారు పుత్రవతులు 9. ఈరీతిగా బుధుడు రౌహిణేయుడు కాన ఆ 'తార' రోహిణి కాదు.

బృహస్పతికి తారకడుపున ఆరుగురు కొడుకు లును, ఒక కూతురును కలిగిరి. ఆ యారుగురును, వారి కొమరులును వేరువేరు యజ్ఞములకును, అగ్నులకును నామాంతరములు.

కృత్తికలలో ఆరు స్పష్టములు. ఒకటి స్పష్టా స్పష్టము. కృత్తికలతో అగ్నికి సంబంధము కలదు. కృత్తికలకు దేవత అగ్ని. అగ్నికి అంగిరుడును, అతనికి బృహస్పతియును కొడుకులు. బార్హస్పత్యమానమున కృత్తికాబృహస్పతుల సంబంధము విశదము. కావున కృత్తికయే తారాశశాంకమునకు, లేక తారకామయ సంగ్రామమునకు సంబంధించిన తార.

బుధునకు కుమారు డని ఒక పేరు 10. వేదమునం దగ్ని కుమారుడు. పురాణములందు కార్తికేయుడు కుమారుడు. బుధ కార్తికేయు లిరువురును ఇషీకాస్తంబ జాతులు 11. తారకాసురవధకు కార్తికేయుడును, అసురవధకు బుధుడును పుట్టి రని పరాశరుడు.

6. ౫3 అధ్యాయ. 7. ౧-౮. 8. ౪-౬.

9. సర్వాసా మేవ పత్నీనా మేకా చేత్ పుత్రిణీ భవేత్,
సర్వా స్తా స్తేన పుత్రేణ ప్రాహ పుత్రవతీ ర్మనుః.

10. 'బుధ శ్చంద్రసుతో జ్ఞేయో విబుధో బోధన స్తథా,
కుమారో రాజపుత్రశ్చ తారాపుత్ర స్తథైవచ' అని రాజమార్తాండము.

11. ౪-౬ విష్ణు.

ధనిష్ఠలో కూడిన ద్వాదశినాడు బుధుడు పుట్టెనని గ్రహయజ్ఞతత్త్వము. ధనిష్ఠలో అయనము నివృత్తమగుడు కృత్తికలో విషువము ఉండుటచేని ధనిష్ఠా కృత్తికల సంబంధము విదితము.

గ్రహముల పరస్పరసామీప్యముగాని, గ్రహనక్షత్రముల పరస్పరసామీప్యముగాని కలిగినపుడు సంగ్రామాదిపదవ్యవహారము. క్రాంతివృత్తమున ఉత్తరార్ధమున దేవగణమును, దక్షిణార్ధమున అసురగణమును ఉండునని ప్రసిద్ధము. ఇట్టి వ్యవహారములో దేవాసుర సంగ్రామము 12 మన నేమియో యిపుడు సుగమము. కృత్తికల సమీపమున విషువ మున్నపుడు ఈ దేవాసుర సంగ్రామము 13 పలుమారులు జరిగినటులు కానిపించును.

శుక్రబృహస్పతు లిరువురును దీప్తిమంతులు. కృత్తికయు దీప్తిలేనిది కాదు. సమయవిశేషమున బుధుడును ఉజ్జ్వలుడు. ఇక దాపున చంద్రుడును, కొంచెదవ్వున బ్రహ్మదైవతమగు రోహిణియు. ఇట్టి యునికి దర్శనీయము. వెనుక నెన్నడో జరిగిన యీ సమావేశమును నాటి విజ్ఞులు చూచి యీ కథలు చెప్పిరి14. మరియు కృత్తికను చంద్రుడు వదలిపోయిన పిదప వారికి బుధుడు కనిపించియుండును15. ఈరీతిగా ఆ 'తార' కృత్తికయని కొంద రనిరి. కాని బుధుడు రోహిణిలో జన్మించె నను పురాణమును వారు సమన్వయింపవలసియుండురు.

బుధమండలవ్యాసము అంగారకునిలో మూడవ వంతు. ఈ లెక్క యోజనము లని యున్నను బింబ వ్యాసపు కళ లని అనుమింపవలెను. అది సరి యగుచో బుధమండలవ్యాసము (చంద్రబింబవ్యాసమునుబట్టి) ౫। ౫౦. బుధమండలము శరాకారము16. ౫ రశ్ముల దీప్తి. రంగు శ్యామము.

## అంగారకుడు

అంగార మనగా నిప్పు. అంగారకు డగ్నికి వికేశికడుపున పుట్టెనని లింగపురాణము. బ్రహ్మవైవర్తము 17 పాద్మము 18 మత్స్యము 19 వామనము 20 కాశీఖండము నితనిగురించి చెప్పిన కథ లన్నియు, అగ్నికి సంబంధించిన యితని పేరు లన్నియు యితని వన్నెకును, క్రౌర్యమునకును సూచకములు.

---

12. యజుస్సులో 'దేవాసురా స్సంయత్తా ఆసన్' అను వాక్యముతో ఆరంభమగు కథలు పెక్కులు. వానిలో కొన్ని ఆకాశకథలు. వాయ్వగ్నిపద్మపురాణాదులలో పండ్రెండు దేవాసురయుద్ధములు కలవు. ౧ ప్రహ్లాదుని గురించి, ౨. బలినిగురించి, 3. హిరణ్యాక్షునిగురించి, ౪. అమృతమంథనముకొరకు, ౫. తారకొరకు, ౬. ఆజీవకయుద్ధము, ౭. త్రిపుర, ౮. అంధక, ౯. వృత్రులనుగురించి, ౧౦. జితరణము, ౧౧. హాలాహల, ౧౨. కోలాహలులగురించి. ఈ పండ్రెండింటిలో ఆకాశ కథ లున్నవి.

13. గ్రహనక్షత్రాన్యతరసమాగమము.

14. భూయ స్తతో రఘుపతి ర్విలసత్పతాక మధ్యాస్త కామగతి సావరజో విమానమ్,
దోషాతనంబుధబృహస్పతియోగదృశ్య స్తారాపతి స్తరలవిద్యు దివాభ్రవృందమ్. (రఘు. ౧౩-౭౬).

15. బుధుడు సూర్యుని దాటి ౨౮ అంశలు, లేక ౨ నక్షత్రముల మేర కెక్కుడు దాటిపోడు. కాన రజనీముఖమునగాని, ఉషలోగాని బుధగ్రహమును నాటివారు కనిపట్టియుందురు. అప్పటి గ్రహస్థితి యిటు లుండియుండును. గురు శుక్ర సోమ బుధులు కృత్తికలో. రవి అశ్వినిలో. ఫాల్గున చైత్రములలో సూర్యు డస్తమించినపిదప పడమట బుధుడు కనిపించును. శుక్లతృతీయాచంద్రుడు కృత్తిక నాచ్ఛాదించియుండు నని కొందరు చెప్పిరి.

16. పద్మ-సృష్టిఖండ-౬౧ అధ్యా. 17. పూర్వ. 18. స్వర్గ-౧౧.

19. ౬౮ అధ్యా. 20. ౬౭ అధ్యా.

ఇతనికి కుజు డనియు, వక్రుడనియు పేళ్లు కలవు. వానికి సంబంధించిన జ్యోతిఃకథను పరాశరు డిటులు చెప్పెను:—'తొల్లి ప్రజాపతి సృష్టి చేయగోరి తన తేజమునుండి పుట్టిన అగ్నిలో హోమము చేసెను. ఆ తేజము అగ్నినుండి భూమికి ప్రాకెను. అది అచటి అగ్నితో కలిసి ఉప్పర మెగసెను. దానచేసి అంగారకునకు ప్రాజాపత్యు డనియు, భౌము డనియు పేరు వచ్చెను. బ్రహ్మపనుపున నా భౌముడు భూచక్రమున తిరిగి తిరిగి వక్రగతి కలవా డాయెను.'

ఇతనికి మంగళు డని మరొక పేరు. అమంగళున కిది వింత. 'మంగళద్రవ్యములలో ఎఱ్ఱగందము బంగారము సింధూరము పసుపు మొదలగువాని వన్నె యితనికి కలదుగాన ఆ పే' రని కొందఱి ఊహ.

ఇతనికి గల ఆరవనామధేయము యువనులది.

ఇతనికి ఉష్ణ - అశ్రుముఖ - వ్యాల-రుధిరానన-నిస్త్రింశముసల అను అయిదు మోములు కలవని సిద్ధాంతములు చెప్పెను. ఈ మోము లిచట నష్కలు. అంగారకు డాయాయి చుక్కలలో చొచ్చినపుడీ పై పేరులు. మిగిలిన గ్రహములు వక్రించినను కుజుని యొడలనే వక్రి యను పేరు బహుళము. కుజు డుదయించిన పిదప ౭౮౦ దినములకుగాని అస్తమింపడు. ఇతరగ్రహము లటులు కాదు. ఈ ౭౮౦ దినములలో ౭౧౦ దినములు ఇతడు తూరుపుదెసనే పోవును. పిదప ౭౦ దినములు పడమటిదెస పోవును. అనగా వక్రించును. ౭౮౦ దినములలో సుమారు ౧౨౦ దినము లితడస్తమించును. ఒక రాశిలో వక్రించి మరల దారిని బడి ఆ రాశి దాటుట కితనికి చాలకాలము పట్టును. దానచేసి యితడు కదలనటులు కనబడును. దానినే కుజస్తంభ మని అందురు.

ఆషాఢానక్షత్రమున ఇతని జన్మ 21. వ్యాసము బృహస్పతిలో మూడవ వంతు—అనగా వ్యాసకలలు ౧|౪. దీప్తి ౯. రంగు రక్తము. ఆకారము ముక్కోణము 22.

## బృహస్పతి

ఋక్కులం దచటనచట బృహస్పతి అగ్ని 23. ఇతడు యజమానులకు పురోధ. దేవతలకు గురువు. ఋషి. సప్తఋషులలో నొక డగు అంగిరునకు బ్రహ్మతేజో రూపముగా బృహస్పతి పుట్టె నని పరాశరుడు.

'బృహస్పతి అంగిరునకు శుభకడుపున పుట్టెను. ఇతనికి తేజస్సు అధ్యయనసంపద ప్రతిభావిశేషము మంత్రశక్తియు అత్యధికము కావున నితనికి బృహస్పతి యని పేరు వచ్చె' నని మహాభారతము 24.

అతిపురాతనకాలముననే యితని యునికి తెలియు ననుటకు తారకాణగా పరాశరు డితనిని బ్రహ్మమానసపుత్రు డని వచించెను. ఇతడు తిష్యలో పుట్టె నని తైత్తిరీయబ్రాహ్మణము. గురుపుష్యయోగమునకు చాల ప్రసిద్ధి కలదు. 'సూర్యుడును, చంద్రుడును, బృహస్పతియు ఏకరాశిలో (కర్క) పుష్యలో సమ్మిళితు లగుదురేని అపుడు సత్యయుగ మావిర్భవించు' నని విష్ణుపురాణ 25 మహాభారతములు26. నాటివారును సత్యయుగమునకు వాచుకొని రనుట కిది వ్యంజకము27. ఇతనికి జీవు డని ఒక పే రున్నది. ఋగ్వేదమున నితడు పుష్టివర్ధకుడు28. ఓషధులకు జనకుడు29. ఇతడు దేవా

---

21. వాయు-౫౩ అధ్యా. 22. పద్మ-సృష్టి-౬౧ అధ్యా.

23. ౨-౧, ౩-౨౬ మొదలగువానిని చూచునది.

24. వన-౨౧౭ అధ్యా. 25. ౨-౨౪. 26. వన. ౧౯౦ అధ్యా.

27. బృహస్పతి క్రాంతివృత్తమునుండి సుమారు ౧/౧౮ అంశలకంటె పైనె దవ్వు చనడు. కాన గురుపుష్యయోగ మసంభవ వ్యాపారము కాదు. ప్రతి పంద్రెండేండ్లకును ఇదీ సంభవించును.

28. ౧-౧౮-౨. 29. ౧-౯౭-౧౫.

సురసంగ్రామమున చనిపోయిన దేవతలకు దివ్యౌషధు లిచ్చి బ్రతికించుచుండువాడు కావున జీవు డాయెను 30.

బృహస్పతికి వాక్పతి యని యొక పేరు కలదు. 'వాఘ్గి బృహతీ. తస్యా ఏష పతిః'అను బ్రాహ్మణము దీనికి మూలము. ఇది ఫలజ్యోతిషమునకు వ్యాపించెను.

ఇతడు ఫల్గునిలో పుట్టె నని వాయువు 31. కావన నితడు ఫల్గునీభవుడు. బృహస్పతివ్యాసము శుక్రునిలో మూడవ వంతు; అనగా వ్యాసకల ౧. దీప్తి ౯౨. రంగు హారిద్ర. ఇతనిది పట్టికాకారము 32.

## శుక్రుడు

శుక్లవర్ణమునుబట్టి యితడు శుక్రుడు. కావున నే జలమయుడు.

'తొలిసృష్టిలో పితామహుండు రుద్రుని రోదనము విని నీవు భవుడ వగు మని చెప్పెను. ఆ రుద్రుని జలమూర్తి యగు భృగుకన్యకను, ఉశనసను శుక్రుడుదయించెను. శుక్రుడు శివు నారాధించి ధనపతిత్వము, అమరశరీరమును బడసెను'అని పరాశరుడు.

ఈ కథలోని శుక్రుని జలమయత్వము తల్లి చార. అమరశరీరత్వము తండ్రిచార.

ఋగ్వేదమునందలి వేనదేవతయే శుక్రు డనియు ఆ వేనుడే పడమటివారి Venus 33 అనియు శ్రీ బాలగంగాధరులు34. వేనదేవత వృష్టిని ప్రేరించును.

'కృత్తిక మృగశిర పుష్య మఘ ఫల్గునీద్వయము చిత్త స్వాతి విశాఖ పూర్వభాద్రపదలలో శుక్రుడు వృష్టిని కలిగించును. మరియు కృష్ణచతుర్దశి పంచమి అష్టములలో శుక్రోదయ మగుచేని, లేక శుక్రాస్త మగుచేని భూమి జలమయ మగునని సంహితలు చెప్పును.

వాయు 35 మత్స్య 36 లింగ 37 భాగవత 38 పురాణములలో నిత డసోమయుడు.

ఇతనికి కవి యనియు, కావ్యు డనియు పే ర్లున్నవి. ఫలజ్యోతిషమున నితనికి శిల్పకవిత్వాదులతో సంబంధ మున్నది. శుక్రుడు అసురమంత్రి. బృహస్పతి దేవమంత్రి. దీనిని బట్టి శుక్రనీతి, బృహస్పతినీతి ఉదయించెను.

శుక్రవ్యాసము చంద్రునిలో పదునారవ పాలు. అనగా వ్యాసకలలు ౨. దీప్తి ౧౬. రంగు తెలుపు. శుక్రుడు పుష్యలో జన్మించె నని వాయువు 39. మఘలో నని పురాణాంతరము. ఇతనిది పంచకోణాకారము 40.

## శని

'తొలిసృష్టిలో వేడికి చరాచరములు మలమల మాడిపోవదొడగుడు బ్రహ్మ సూర్యుని జూచి దేవతలే నీ వేడిమి కాగలే కున్నారు; ఇక మానవుల లెక్కయేమి అని యనగా సూర్యునకు చాల కినుక పొడమెను. దాన శని పుట్టెను' అని పరాశరుడు. ఈకథ ఇతని క్రూరతకు మూదల.

పురాణములలో ఛాయాసూర్యుల కుమారుడు శని. ఇతడు నల్లనివాడు.

'శని విమలవైదూర్యమువలె కానిపించినచో ప్రజకు సుఖము. మరియు బాణపుష్పమువలె అతినీలముగనైనను, అతసీకుసుమమువలె నీలముగనైనను కానిపించినను శుభమే' అని వరాహమిహిరుడు.

ఇతనికి ఛాయాసుతుడు, అసితుడు, అసితాంబరుడు అను పేరులు కలవు. ఇవి నైల్యమునకు సూచకములు.

30. జీవయతీతి వా, జీవ్యంతే అనే నేతి వా జీవః.

31. ౫౩ అధ్యా. 32. పద్మ-సృష్టి-౬౧ అధ్యా. 33. ౧౧-౫౮; ౧-౧౨౩.

34. The Orion, pp. ౧౬౧, ౧౬౨. 35. ౫౩ అధ్యా. 36. ౧౨౭ అధ్యా.

37. ౬౧ అధ్యా. 38. ౫ స్కం౦, ౨౨-౧౨. 39. ౫౩ అధ్యా.

40. పద్మ-సృష్టి. ౬౧.

సంగు శనైశ్చర మంద నామధేయములు గమనమాంద్యమునకు వాచకములు.

శనివ్యాసము బృహస్పతిలో మూడవవంతు. వ్యాసకళలు ౩౨. దీప్తి ౮. రంగు నలుపు. శని రేవతిలో జన్మించెను 41. శనిది నరాకారము 42.

## రా హు కే తు వు లు

వేదమునందు స్వర్భానుడు భాను నాచ్ఛాదించె ననియు, అత్రి గ్రహణమును కనుగొనె ననియు కలదు 43.

'స్వర్భానుడు ప్రభాకరు నాక్రమింపగా చీకటులు కమ్మి సూర్యుడు క్రింద పడుచుండె ననియు, అటులు పడుచున్న వానిని అత్రి చూచి 'ప్రభాకరా! నీకు స్వస్తి' అని అనగా ఆ బ్రహ్మర్షి వచనమున అతడు పడక నిలిచె'నను లింగపురాణము దీనికి వ్యాఖ్య 44 కానోపు. స్వర్భానుడు రవిక్రిందుగా నున్నటులు ఋక్కు చెప్పెను 45.

పురాణములం దీ స్వర్భానుడే రాహువు 46. 'దేవాసురులు సురగంగకడ చేరి మందరమును కవ్వముగను, వాసుకిని తరితాడుగను జేసి అమృతము చిలికిరి. అమృతము పంచునపుడు భగవానుడు రాహుశిరమును నరకె'నను అమృతమథన మాకాశకథ. ఇట మందరము మేరువునకు విష్కంభపర్వతము. వాసుకి పర్వతనాడీవలయము. దేవాసురులు సురగంగకడ చేరుట పాలపుంతకడ ఉత్తరదక్షిణనక్షత్రముల సంధి. మరియు మృగశిరలో క్రాంతిపాతము. అమృతము చంద్రుడు. చంద్రుడు మృగశిరకు దేవత 47. రాశిచక్రస్వరూపుడగు భగవంతుడు అపుడు రాహుశిరశ్ఛేదము చేయుట (తత్కాల) చంద్రపాతము. రాహువు గ్రహమై సూర్యచంద్రుల బట్టుకొనబోవుట కర్థ మిది: రాహుకేతువులను పేరు కల చంద్రపాతముల సమీపమున సూర్యుడుండనియెడల గ్రహణము సంభవింపదు.

ఈ ఆఖ్యాయికకు మూల మొకానొకపుడు పాలపుంతకడ మహావిషువత్క్రాంతిపాతమును, అపుడే సూర్యగ్రహణమును అయియుండును. దేవాసుర సంగ్రామసమయమున పెద్ద సూర్యగ్రహణము పట్టినటులు మహాభారతము48. అత్రి చూచిన దీ గ్రహణమేమో యని అనుమానము.

సంవత్సరాదినాడు సురగంగాసమీపమున సూర్యగ్రహణమును పిమ్మట ఋషులు చూచియుండకపోవుటచే ఈ గ్రహణమున కింతటి ప్రసిద్ధి వచ్చియుండును. మరియు ఈ వ్యాపారము సామాన్యము కాదు. క్రాంతిపాతమును, చంద్రపాతమును ఎల్లపుడును ఒకచో కావు! ఇంతియకాక మృగశిర, లేక ప్రజాపతినక్షత్రమున క్రాంతిపాత మగుట అతీతవిషయము. క్రీస్తు వెనుక సుమారు నాలుగువేల యేండ్లక్రిందట సురగంగాసమీపమున క్రాంతిపాత మాయెను. పై సూర్యగ్రహణమప్పటిదే కావచ్చు నని పలువుర యూహ.

రాహురథము ధూసరము. గుఱ్ఱములు తుమ్మెదలవలె నల్లనివి. కేతువుగుఱ్ఱములు పలాలధూమలములు;

41. ౫౩. 42. పద్మ-సృష్టి ౬౧. 43. ౫-౮౦.

44. ఆత్రేయవంశప్రభవా స్తాసాం భర్తా ప్రభాకరః, స్వర్భానుపిహితే సూర్యే పతితేఽస్మిన్ దివో మహీమ్, తమోభిభూతే లోకేఽస్మిన్ ప్రభా యేన ప్రవర్తితా, స్వస్త్యస్తు హి తవే త్యుక్తే పతన్నిహ దివాకరః, బ్రహ్మర్షే ర్వచనా త్తస్య పపాత న విభు ర్దివః, తతః ప్రభాకరే త్యుక్తః ప్రభు రత్రిమహర్షిభిః.

45. ఋక్-౫-౮౦-౬, ౯.

46. 'స్వర్భానుం సువతే యస్మా త్తస్మా త్స్వర్భాను రుచ్యతే'

47. ఆకాశసముద్రము సోము డనియు, అది అద్భుత మనియు, దేవతల కాధార మనియు లింగపురాణము-౫౪ అధ్యా.

48. ఆది పర్వ-౧౯ అధ్యా. వనపర్వ-౨౧౩ అధ్యా.

తేక లాక్షారుణములు. ఈ వర్ణనమువలన ఈ జ్యోతిర్విషయము గమనింపదగినది: రాహుకేతువులు రెండు చంద్రపాతములు. అనగా సూర్యచంద్రమార్గసంపాత బిందువులు. వీనికి గమనము కలదు. కావున రథకల్పన. చంద్రగ్రహణసమయమునను, సూర్యగ్రహణసమయమునను కనబడు ఈ రెండు గ్రహముల వర్ణము రాహుకేతువుల రథములయందును, అశ్వములయందును ఆరోపితము.

రాహువు సూర్యచంద్రులకంటె పెద్ద. రాహు బింబవిస్తృతి ౧౩,౦౦౦ యోజనము లని భాగవతము. పురాణాంతరములలో ఈషద్భేదము కలదు. రాహువు రవిచంద్రమండలతుల్యుడై భూచ్ఛాయ నాశ్రయించి రవిచంద్రులక్రింద తిరుగు నని వాయుపురాణము. రాహుకేతువులు రోహిణిలో పుట్టి రని అందే కలదు.

‘ఈ గ్రహములును, నక్షత్రములును కనబడని గాలిపగ్గములచే ధ్రువబద్ధములు. ధ్రువుడు నదిలో పడవలనువలె ఈ దేవాలయములను లాగుకొనిపోవుచున్నాడు.

‘అంగారకుడును, బృహస్పతియు, శనియు దవ్వున నున్నారు. వీరి గమనము మందము. బుధశుక్రులు దాపున నున్నారు. వీరి గమనము శీఘ్రము. అయనభేదముచే సూర్యుడు పైగను, క్రిందుగను కనబడును. దక్షిణాయనమున ఇతడు యథాకాల ముదయింపడు. మరియు వడిగా అస్తమించును. అపు డమావస్యాచంద్రుడు దక్షిణమున నుండును. విషువద్దినమున నీ సూర్యచంద్రులు సమసమయముల నుదయించి అస్తమింతురు. దక్షిణాయనమున రవి సకలగ్రహములకును క్రింద నుండి తిరుగును. అపుడు చంద్రుడు ఒడలు పెంచి సూర్యునిపై తిరుగును.’ అని వాయుపురాణము.

ఇవి పురాణగ్రహములు. సిద్ధాంతగ్రహముల నికముందు చూతము.



# స్వర్ణసీత

## 'ఆనందకుమార్'

మా వెనుక పడే నీడలు రెండూ దూరాన విడిపో తున్నాయి.

తెల్లని గుర్రాల్లా ఊబుకుకుంటూ పరుగెత్తుకు వచ్చే నురుగుకెరటాలు మాముందు విచ్ఛేదమయిపో తున్నాయి.

సన్నని యిసుక నా చేతిలో పోస్తూ ఆమె చెప్పడం మొదలుపెట్టింది:

"అతని 'మంగళం' చదివేను...నన్ను ఎంత కదిలించిం దనుకున్నావ్! అది చదివాకే దాక్షిణాత్య దేవాలయా లన్నీ చూడా లనిపించింది. అప్పుడే బయలు దేరుత.

శ్రీరంగం వెళ్లేనన్నాను కాదూ!

దేవాలయమంతా కాళ్లు అరిగేవరకూ తిరిగేను.

ఎంత కళావైదగ్ధ్యము! భక్తిఉద్రేకాలను రాశిగా పోసి ఆ దేవాలయం కట్టేరు. దైవసాన్నిధ్యంలో మోకరిల్లినప్పుడు మీరు జ్ఞాపకంవచ్చారు... 'సుకుమార్' భార్య జ్ఞాపకంవచ్చింది...అతను మొట్ట మొదట దైవసాన్నిధ్యంలో అక్కడే కాదూ ఆమెను చూస్తే. తన పేరున అర్చన చేయించబోయి తన జరీ కండువామీద పొరపాటున కుంకుమ వొలకబోసిన ఆమె పేర అర్చన చేయించివచ్చాడు కాదూ?

నాకు దేవుని చూసినకొద్దీ ఆ దంపతులు జ్ఞాపకంవచ్చారు......

నేను ఒక్కరితినూ వచ్చేనే అనిపించింది.

ఒకనాడు సంధ్యాకాలంలో దేవాలయానికి వెళ్ళేను. మీకు నచ్చిన ఆ లేతమబ్బురంగుచీర కట్టుకున్నాను. బాగా జ్ఞాపకం. ఆ ప్రేమికులమధ్య నుంచున్నాను. నన్ను నేనే చూసుకోవా లనిపించింది. అక్కడ నేనుకూడా శిలావిగ్రహమై ఆచంద్రార్కమూ నిలిచిపోవా లనుకున్నాను.

రామేశ్వరం చూశాను.

చిన్నచిన్న దేవాలయాలన్నీ చూడా లనుకున్నాను.

కొబ్బరిచెట్లూ, పోకచెట్లూ వున్న దేశంలోకి వచ్చాను...శుచీంద్రదేవాలయం చూసితీరాలి. ఆది శంకరుడుకూడా ఈ దేవాలయం చూశాడు. ఎంతటి కళావైదగ్ధ్యం! నువ్వు చూసితీరాలి.

శుచీంద్రంత్రిమూర్తుల దర్శనార్థం బయలుదేరేను.

స్థాణుమూర్తిదేవాలయానికి కలువలు తీసుకుపోయాను. 'శివునికి కలువపూవు!' లని అందరూ ఆశ్చర్యపోయారు......

జయఘంటలు మ్రోగుతున్నాయి!...

దోసిలినిండా కలువపువ్వులు—విరిసినవీ, విరియనివీ.

పతాకముద్ర పట్టిన శ్రీవిగ్రహంపాదసన్నిధి నుంచి నా శిరస్సుతో ఆ పాదయుగ్మం స్పృశించాను.

త్రోవ చేసుకుని శివస్వరూపసందర్శనానికి వెళ్ళేను.

సుందరమూర్తినాయనార్ జ్ఞాపకంవచ్చాడు. ఆయన ఈప్రాంతాలన్నీ తిరిగాడు. మనస్సు దైవసాన్నిధ్యంలో వుంచాడు. కాని దైవమే అతని గీతావళితో ప్రయాణం చేసేవాడు......

ఒకసారి ప్రసిద్ధ - తిరువారూర్ దేవాలయానికి వచ్చాడు. అక్కడ శివునే వరించిన తపస్విని వుంది,

కేవలము పార్వతీదేవి అపరావతారము—పరవైయార్. ఆమెభక్తి చూసి సుందరమూర్తి తన్మయుడయ్యాడు. వారు దైవసాన్నిధ్యంలో భార్యాభర్త లనుకున్నారు; అయినారు.

పరమశైవశిఖామణినిగురించి యీ సంఘటన నాకు జ్ఞాపకముండిపోయింది. అప్పటినుంచీ సుందరమూర్తినాయనార్ 'తేవారమ్' లోని ధ్యానగీతాలను మననం చేశాను. ఎన్నోసార్లు ఎవరైనా పాడమన్నప్పుడల్లా సభల్లో పాడేను. వారికి కొంచెం నిస్పృహ కల్గించింది. జయదేవగీతాలను పాడమని అడిగేవారు; సుందరమూర్తినాయనార్ గీతాలను పాడేదానిని......

నేను ముందుకు వెళ్లి అంతరంగంలో అడుగు పెట్టేను. 'శివోహం' అంటూన్న కొంతు నాభిలోనుంచి హృదయం చీల్చుకుని గొంతులోంచి వస్తూంది. నడిచే చోటంతా మట్టిగా వుంది. కాని సాష్టాంగంగా స్థాణుమూర్తికి వందన మాచరించాను. స్మశానంలో కూడా శివతాండవానికి ఆవిధంగానే మోకరించివుండేదాన్ని.

గర్భాలయంలోనికి వెళ్ళేను. కళ్లు రెండూ గట్టిగా మూసుకుని అభిషేకజలానికి హస్తం చాచాను. ఇంకా ఘట్టిగా కళ్లు మూసుకున్నాను. ఇంకా స్పష్టంగా శివలింగము కనుపించడానికి. నాచేతిలో ఉదకం పడలేదు. కళ్లు తెరిచి స్థాణుమూర్తికేసి చూశాను.

ఎదురుగా నంబూద్రి; దేవాలయార్చకుడు.

“మీరా! మీరేనా?” అని అడిగేడు.

“నేనే; నేనేనండి. పాదోదకం యివ్వరూ?” అని వినయంతో అడిగేను.

“సుందరమూర్తినాయనార్ గీతాల్ని పాడుతారు కాదూ? తేవారంలోని గీతాలను దైవసాన్నిధ్యంలో పాడాలి. దేవునికి అభిషేకం స్తోత్రాలతో మీరే చెయ్యాలి.” అన్నాడు. పీఠం చూపించాడు.

నాలుగువైపులా నాలుగు వెండిపువ్వులు. ఎత్తయిన నగిషీ కోళ్ల పీట. కూర్చోడానికే వణుకు వచ్చింది. గొంతు విప్పడానికి దడ వచ్చింది. శివసాయుజ్యం పొందిన నాయనారే నాముందు వచ్చి కూర్చున్నట్లయింది. ఎదురుగా నంబూద్రి వినమ్రుడయి నించున్నాడు. పార్వతీచరణనూపురాలనుగురించి మొదలు పెట్టేను. ఆదిశంకరుని ధ్యానముద్రనుగురించి ఆలపించాను. శివతాండవంమీద గీతం పాడేను. శివప్రళయతాండవం మళ్లీ అంతమయ్యేటప్పటికి శాంతిమూర్తిని గురించి గట్టిగా నా ఆవేశము అణిగేవరకూ పాడేను.

నేను శివమెత్తి వున్నానా? అందరూ పరవశులై వున్నారా? ఆపగానే నాకే క్రిందికి విసిరి పారవేసినట్లయింది......

ఎన్నోసార్లు, ఎన్నోమాట్లు పాత్రానుగుణమైన ఉద్రేకంతో పాడే ననుకున్నాను. జనంకూడా అన్నది. యువకులందరూ తన్మయతతో సమగ్రంగా విన్నారు. విని మళ్ళీమళ్ళీ వారి హృదయంలోనే పాడుకుని నన్ను అభినందించేవారు. ఎన్నడూ ఈ వెర్రిఆవేశంతో నేను ప్రార్థించలేదు. పావనసలిలం కోసం, పాదగంగకోసం స్తుతించాను.

నంబూద్రి ఉద్ధరిణితో ఉదకం తెచ్చి నా పుడిసిట పోశాడు. అది కళ్ల కద్దుకుని శిరస్సున చల్లుకున్నాను......

ఆలయం దాటి బయటకు వచ్చాను. కొంచెం కూడా నడవలేకపోయాను. ఎక్కడలేని నీరసతా వచ్చింది. వడిలిన కలువకాడలా ఒరిగిపోయాను. ఆ నీరసత యిప్పుడుకూడా తేల్చుకోలేను......”

* * *

నా రెండుచేతులూ తన చేతుల్లోకి తీసుకుంది.

నేను అంతా విన్నాను. ఎదురుగా కూర్చుని, పుప్పొడిరంగు చెక్కిళ్ళు ఎర్రబడడం చూశాను. పెదిమెలు సడలిన గులాబీరేకుల్లా వణకడం చూశాను......

ఆమె, నేనూ కూడా ప్రయాణము చేశాము కాదూ? కలకత్తానుంచి కాశ్మీరు వెళ్ళేము. ఆమె ఉపన్యాసంకోసమని నేనూ వెళ్ళేను.

శంఖంలాంటి గొంతుకలోంచి జాలువడే మధుర పదాలకోసమని వెళ్ళేను; ప్రతివాక్యమూ వేదవాక్యం అన్న పవిత్రతతో వినాలని......

మరునాడు ఆ ఆనందోత్సవము.

రాత్రి పడుకోకుండా కూర్చోబెట్టింది.

నిద్దుర రావడం లేదంది.

"గులాబీల వాసన కలిగించే కలతలా వుంది మనస్సు. రేపు ఏమవుతుందో! జీవితమంతా నిర్ణయింప గలిగే ప్రథమప్రయత్నం. దేశమంతా వినడానికి వచ్చారు. ఏం చెయ్యగలను?"

ఓదార్చాలన్న స్పృహ నాకు లేదు. నేను ఆమెలోనే వున్నాను—పుష్పానికి సౌరభంలాగు. మాట చెప్పబోయాను. సాయంసంధ్యాసమయంలో కమలములో చెరపడ్డ తుమ్మెదలా గిలగిలా గొంతులో కొట్టుకుని నిల్చిపోయింది......

లోపలకు వచ్చి పడుకోమనడానికి లేచేను. రెండు చేతులతోనూ కూర్చోబెట్టింది......

* * *

అప్పటికి నెలరోజులయింది.

అప్పుడూ యింతే.

రెండు చేతులతోనూ కూర్చోబెట్టింది.

నక్షత్రాలు ఒక్కొక్కటే చెబుతున్నాను. మాతాతగారు నన్ను ఒళ్ళో కూర్చోబెట్టుకుని ఎప్పుడో ఆకాశమంతా చూపించారు. ఆ జ్ఞాన ముంది. నేనూ ఈనాడు ఆమెకు నక్షత్రస్థానాలు చూపించగలిగేను. శుక్రుణ్ణి చూపించాను. ఎంతో తేజోవంతమయిన నక్షత్ర మన్నాను.

"కాదు. విగ్రహ" మంది. ఒప్పుకున్నాను.

ధ్రువనక్షత్రము చూపించాను. "నిశ్చలతకు ఆదర్శ" మన్నాను. ఒక్కొక్కటే చీకటిలో చూశాము.

ఆమెకనులలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. అక్కడ చూడబోయాను.

వ్రేళ్లు చేతి కిచ్చింది. గోళ్లకు ఎర్రని గోరింటాకురంగు; ఆ రంగులో మిలమిలమనే తారకరశ్మి. అదే చూసి ఊరుకోలేకపోయాను. కొత్త పగడాలలా మెరసే ఆమె పెదిమెలమీదకు నా కళ్లు పోయితీరాయి. చటుక్కున నాకేసి చూసింది. ఎంతో చనువుతో నవ్వి-

"సప్తఋషులు ఎక్కడ వున్నారో?" అంది.

చూపించాను. ఆ మొదటి నాలుగున్నూ, తక్కిన మూడున్నూ. అరుంధతి తనకు కనుపించలేదంది. మళ్ళీ వ్రేలు పట్టుకు చూపించాను. ఆ సన్నని వేళ్లను కలువమొగ్గలా ముడిచింది......

కాలం ఆ క్షణంలో నిలిచిపోయింది.

పృథివికి భ్రమణం ఆగిపోయింది. చీకటి ప్రవహించడం కట్టిపోయింది. మే మిద్దరమూ లేనే లేము. ఎవరమూ లేము......

* * *

నేను శాంతినికేతనం వదలి వచ్చేశాను. నిత్య జీవితంలో ఒక మెట్టు ఎక్కాలని ప్రయత్నం. ఉత్తరాలు ప్రతిదినం వ్రాసేవాడిని:

"హవామహల్‌కి ఎదురుగా కూర్చుని నువ్వు చెప్పిన శుచీంద్రయాత్ర ఏనాటికీ మరిచిపోను. అది మరచిపోయిన్నాడు నేను లే నన్నమాట. ఆనాటివరకూ

...... నీ—ఆనందుడు"

అని, మళ్ళీమళ్ళీ—

"ఏ అమృతమైన కావ్యం చదివినా నీతోనే చదవా లనిపిస్తుంది......

ఏ తీయని శృతి విన్నా నీదృష్టితోనే విన్నాను. అందుకే... నీ—ఆనందుడు".

మళ్ళీ వ్రాశాను:

"నిశ్శబ్దతే పలుకరించి మాట్లాడుతూ వుంది. నీ దగ్గరనుంచి ఉత్తరాలు అరుదై పోతూవున్నాయి. నీకు మరుపు వస్తానన్న భయం ఏనాడూ నాకు లేదు. కాని నీదగ్గరకు త్వరగా వచ్చి చేరలేనేమోనని భయపడుతూ వున్న— నీ ఆనందుడు"

అప్పుడే 'యశోధర' నాటకం పూర్తిచేశాను. నా సర్వస్వమూ సిద్ధార్థుని ప్రతిమలో అమర్చబోయాను. కాని నాకు తెలియకుండానే యశోధరకు ఇచ్చాను. యశోధరను చూశాను. ఆమే! అంతా ఆమే! ఎంత పోలిక!

తక్షణం నీలపు కాగితం తీశాను;

"ఇదుగో, నీకు కానుక. ఎంతో ఏకాగ్రతతో వ్రాశాను. ఐదు అంకాలు: సిద్ధార్థుని జన్మమూ, వివాహమూ, త్యాగమూ, తపస్సూ, పునస్సంధానమూ వ్రాశాను. ఎన్నాళ్ళో నాలో వుండే సంగీతమంతా ఇందులో ఇమిడ్చేను. తీరా చదివిచూశాను. అది సిద్ధార్థుని చరిత్ర, యశోధరగాథ. అంతా నీ పోలికయిన యశోధర. నువ్వే. ఆ యశోధరకు నారచన కానుక. స్వీకరించవూ? నీకే అంకితం చెయ్యాలనుకుంటున్నా. అనుమతించవూ? మొట్టమొదట నీకే వినిపించి తరువాత ప్రచురించాలనుకుంటున్నా. నీ మూగనోము మాని జవాబు వ్రాయవూ? తక్షణం వ్రాస్తావు. నాకు తెలుసు. జవాబుకు ఎదురుచూస్తూవున్న–నీఆనందుడు.."

ఎదురుటపా చూశాను. నాకే నవ్వు వచ్చింది. ఇంకా ఉత్తరము చేరన్నైనా చేరదుకదా అని. రెండవ టపా చూశాను. రేపు ఇలాగే నడుస్తూ వస్తాడుకదా అనుకున్నా.

మూడవనాడు ఉత్తరం వచ్చితీరుతుంది...

ప్రొద్దుటే స్నానం చేసి సముద్రపు ఒడ్డున నడిచాను. ఎంత చక్కని సూర్యకిరణాలు! కొంచెం సేపయితే సహనకరం కావు. ఆ అలలు చంటిపాపల్లా ఆ కిరణాలతో ఆడుకుంటున్నాయి. సాయంత్రానికి నాఎత్తున లేచిపోతాయి. అంత ఉద్రేకంతో ఎంత ఎత్తు ఎగిరితేమాత్రం చంద్రుని తాకగలవా? కొంతమంది హృదయంలో ఆ తితీర్ష వుంటుంది. అలలు ఎంత ఎత్తు లేస్తే అంత లోతు కాదూ? ..

ఉత్తరం వస్తుంది ..నేను వెళ్ళి యీ 'పంచవటి'ని ఆమెకు చదివి వినిపిస్తాను. ఎంత బాగుందో చెప్పడానికి ఆమెకు మాటలు రావు. వళ్ళి రెండు చేతులూ తన చేతుల్లోకి తీసుకుంటుంది.

"నిజంగా నన్ను అంత ఆదరంతో చూస్తారా?" అని ఆమె అడుగుతుంది.

అప్పుడు చెప్పడానికి నాకు మాటలు రావు.

దేశమంతా తబ్బిబ్బు అయ్యే ఆమె నాయశోధరలో వుంది. ఇమిడిపోయింది. యశోధర నాసృష్టి. ఆమె నాదే,

ఉత్తరం వస్తుందని ఎదురుచూస్తున్నా. ఈ పాటికి వస్తూవుండాలి. ఎన్ని ఆలోచనలు!

అందరూ దినదినమూ స్తుతించే ఆమెకు నా చిన్న రచన ఎంత అల్పం అనుకున్నాను...'చంద్రునికి ఒక నూలుపోగు' అని సమర్థించుకున్నాను.

"మీరు వ్రాసినది నాకు చదివి వినిపించండి. తరువాత ఆలోచిస్తా"నని వెకిలిగా వ్రాస్తుంది.

–నేను చదవడానికి వెళ్లి ఆమెను చూస్తూ చదవడానికి తీరిక లేక వచ్చేస్తాను. మళ్లీ ఉత్తరం వ్రాస్తాను......

పోస్టు జవాను నడచిపోతున్నాడు!

ఉన్నపళంగా లేచిపోయాను!!

"మాణిక్యం! ఉత్తరాలు?" అని అరిచాను.

"ఏమీ లేవండి!" అన్నాడు.

వణికిపోయాను...మళ్ళీ చూడమన్నాను.

"లేవండీ" అన్నాడు.

పొరబాటు అయివుంటుంది. నిన్న వ్రాయడానికి సావకాశం లేకపోయివుండవచ్చు. రేపు తప్పకుండా వస్తుంది.

ఈవేళ యశోధరస్వరూపం మళ్ళీ దిద్దుతాను.

సిద్ధార్థుణ్ణి దగ్గరగా కూర్చోమంటుంది. అతనిని పెనవేసుకుపోతుంది. సిద్ధార్థుడికి ఈ ఆనందం అశాశ్వతమనిపిస్తుంది. ఆకౌగిటిలో నీరయిపోతుంటాడు.

"ప్రేమస్వరూపము ఏమిటో?" అంటాడు. "చిరుగాలికూడా వినకూడదు. ముఖం దగ్గరగా తీసుకువస్తే చెబుతాను" అంటుంది.

దగ్గరగా వస్తాడు. రెండు చేతులతోను ముఖం పట్టుకుని పెదిమెల్ని లేతగా ముద్దు పెట్టుకుని "ప్రేమస్వరూపం" అంటుంది...

ఈ ఘట్టం ఒకవేళ ఆమెకు నచ్చదేమో!

... ... ...

ఈవేళ ఉత్తరం వస్తుంది. ఈవేళ సముద్రం దగ్గరకు వెళ్లను. నిన్న వెళ్తే ఉత్తరం రాలేదు. ఈవేళ వెళ్లకపోతే వస్తుంది.

కూర్చుని యశోధరాసిద్ధార్థుల ప్రథమసందర్శనం చదువుతా.

సిద్ధార్థుడు ఆరోజు అందరికీ కానుక లిస్తూంటాడు. తను యివ్వడానికి కొంచెం జంకి చెన్నునిచేత యిప్పిస్తుంటాడు.

కోసలరాజపుత్రిక వస్తుంది. గుఱ్ఱపుస్వారిలో పురుషులనుకూడా ఓడించిన నిపుణురాలు. చెన్నుడు మణులనూ, తాళపత్రరామాయణమూ యిస్తూంటాడు. ఆమెకు నచ్చలేదు.

సిద్ధార్థునివైపు తిరిగి "ఇక్కడ రాజపుత్రు డెవరో తెలుసుకోవా లని వుంది" అంటుంది.

ఈ ప్రశ్నకు చెన్నుడు తెల్లపోతాడు.

యోధానయోధుడు సిద్ధార్థుడు ఆ స్త్రీస్వరూపం చూసి చిట్లిన కలువరేకులా ఒణికిపోతాడు.

తరువాత సిగ్గుతో క్రుంగిపోతాడు.

"క్షుంతవ్యులము. ఈ మా ఆతిథ్యాన్ని స్వీకరించి పునీతులను చెయ్యవలసినదిగా మాకోరిక" అని వినయంతో, భీతితో అంటాడు. స్వహస్తంతో ఇస్తాడు... అందరికీ ఇస్తాడు...

పారితోషికసామగ్రి అంతా విరివిగా యిచ్చేస్తాడు.

యశోధర ఒక చివురున మిగిలిపోతుంది. క్రింది నీటిలో ప్రతిబింబించి చిరుగాలికే కదిలే కుసుమస్వరూపము ఆమెది. మూర్తీభవించిన తీయని కల. కదలడానికి బరువయ్యే హృదయము. కోసలరాజపుత్రిక చేసిన అమర్యాదపు చేష్టకు ఆమెవదనం ఎఱ్ఱబడి పోయింది. ఆ రక్తిమ ఇంకా తగ్గలేదు.

సిద్ధార్థుడు ఆమెను చూసి స్థాణువై పోయాడు.

ఆ విగ్రహం ఉషఃకన్య అనుకున్నాడు.

వడ్డాణం ధరించి వచ్చిన ఏకైకచంద్రకిరణ మనుకున్నాడు.

ఆమెరాకను సమన్వయించుకోలేకపోయాడు.

ఎవరోకి ఏ మివ్వగలడు ?

చెన్నుడు వివరించి చెప్పేడు.

రాజపుత్రిక యశోధరసన్నిధికి పోయి తనే తీసుకువచ్చాడు. ముందు చెన్నుడు, వెనుక యశోధర, భగీరథుడు గంగను భూతలంలోకి తీసుకువస్తున్నాడు...

బహూకరించడానికి ఏమీ తగినది లేదు.

చెన్నునితో ఆమెకు నచ్చినదీ, ప్రియమైనదీ తెలుసుకొని తెప్పించమంటాడు.

యశోధర పెదిమెలు విప్పుతుంది.

కిన్నరవాణినుంచి వచ్చే సంగీతం !

"క్షమించాలి. నాకు ప్రియతమమైనది యిప్పించాలి."

"పృథివిలో ఎక్కడ దొరకినా ఈ పాదాల సన్నిధిని వుంచడానికి శాక్యుని వాక్యం బాస" అంటాడు ఆనందంతో... యశోధరకళ్లు మెరిసి పోతాయి.

"కోరుకుంటున్నాను. మీరు. మీరే నాకు కావాలి" అంటుంది.

సిద్ధార్థుడు ఆ మకరానికి అనుకుంటాడు. సింహ లలాటంమీద కాలు గట్టిగా మోపుకుంటాడు.

'శాక్యుని వాక్యం బాస'అంటుంది యశోధర.

సిద్ధార్థుడు పీఠం దిగి వస్తాడు......

ఎంత చక్కని ఘట్టం !

* * *

ఆమెకు తప్పకుండా నచ్చుతుంది. నచ్చితీరుతుంది. సంతోషంతో నాకేసి చూస్తుంది. ఆ ఒక్క చూపూ చాలదూ జన్మమంతా ఆవరించుకోడానికి ?

కాని మరునాడు ఉత్తరం రాలేదు. తరువాతా రాలేదు.

భూమిలోనికి...అథఃపాతాళంలోనికి క్రుంగి పోయాను. ఎంతో ఆశ పెట్టుకుని వున్నాను. నా ఉత్తరానికి జవాబు వ్రాయకపోతే నా స్థితి ఆమె తప్పకుండా ఊహించుకోగలదు.

నేను చెప్పనవసరం లేదు. అయినా వ్రాశాను:

"రోజురోజూ ఒక క్రొత్త ఆవేదన తెస్తూంది. ప్రతిదినమూ నిరీక్షే. ప్రతిదినమూ కాంతి ఎక్కువవు

తుంది. ఆ వేదనలో క్రొత్తదనమూ, కాంతిలో పాత దనమూ రావడానికి నువ్వే సరియైన సమాధానం చెప్పాలి......

"దూరపుతనంలో బాధ భరించలేనప్పుడు దగ్గర వున్నప్పుడు ఆనందం భరించలేనని నన్ను తృణీకరించ వద్దు. ఆ అర్హత సంపాదించుకో ప్రయత్నిస్తాను...

"తప్పకుండా జవాబు వ్రాయవూ ?..."

ఆరు నెలలవరకూ జవాబు లేదు.

మళ్ళీ మళ్ళీ వ్రాశాను. ఆమెకు విసుగు కల్గిస్తున్నానేమో...

"నాకు ప్రభాతం నీ నామోచ్చారణతో ప్రారంభం. నిద్దుర నీ పేరుతో.

"నీదగ్గరనుంచి ఒక్క చల్లని వాక్యం రాకపోతే జీవితమంతా కటికనిశీథిని."

జవాబు రాలేదు. తరువాత రాలేదు... ఎప్పుడూ రాలేదు.

*        *        *

అంతటితో నా జీవితం నిల్చిపోయింది.

ఆనాటితో నా ప్రవృత్తే నిలిచిపోయింది.

శైలాన్ని ఢీకొన్న నిర్ఝరిలా వెయ్యివిధాల ప్రవహించడం ప్రారంభించింది. శకలా లయిపోయింది.. స్వరూపరహిత మయిపోయింది.

...        ...        ...

నా ఆశే తప్పేమో!

లేక ఈ నిరాకరణకు కారణ ముందేమో.

ఏమీ లేదు. అందుకు తొంగిచూసే సావకాశము లేదు...

ఆమె ప్రపంచకానికంతకూ ఆనందప్రదాయిని. ఎంతమందికి తన వక్తృత్వచాతుర్యమూ, గానమాధుర్యమూ చూపించలేదు ? ఎంతమంది మన్ననలకు ఆమె పాత్రురాలు కాలేదు ? ఆమె బహూకరించిన చేవ్రాలు చూసి ఎంతమంది మురిసిపోవడం లేదు ?

నే నొక్కడినే దూరమయిపోయాను! పూర్వజన్మంలో ఏ క్రౌంచమిథునాన్ని ఎడబాటుచేశానో!!

*        *        *

ఏం చెయ్యగలను! ఎక్కడికి వెళ్ళగలను!!

విశ్వం వచ్చి పిలిచేడు, ఇంద్రాణి నృత్యం చేస్తుందని.

అమ్మ రమ్మని చెప్పమన్న దని ఎంతో అనురాగంతో వచ్చి చెప్పేడు— చెల్లెలు నృత్యం చేస్తుందని.

ఎంత చల్లని హృదయాలు! ఈ చిన్న హృదయాలలో ఎంత నిర్మలత్వం! నిశ్చింతతో విరగబడి నవ్వగలరు. నవ్వి, నవ్వినందుకు సంతోషపడగలరు.

సాయంత్రం వెళ్ళేను.

ఆ నల్లని తెరముందు పచ్చని నున్నని శరీరం. చంద్రవంకలా వంగి నమస్కారం చేసింది. అందరికీ, సభకంతకూ నమస్కరించింది.

నాకే నమస్కరించిందని నేను అందుకున్నాను.

పెదవి విప్పి దీవించాను. అందరూ చూశారని సిగ్గుపడ్డాను. నన్ను చూసి నేనే.

ఆమె వెనుకనుంచి కిన్నరకోటినుంచి వచ్చే లాంటి వీణానాదం అందుకొన్నారు.

తాం, తాం, తధికిన, తాం, తాం.

అడుగు తీసి అడుగు వేస్తూంది. పాదాల గజ్జెలరెండింటి చప్పుడూ సుధామాస్థానంనుంచి వినిపించే ధ్వనిలా వుంది. కిసలయాల్లాంటి ఆ వేళ్లు ముద్రలుపడుతున్నాయి.

తధికిన, తధికిన, తోం, తధికిన.

త్వరగా పాదాల గోళ్ల ఎర్రని మెరుపుకూడా కనుపించని వేగంతో ఆ చిన్నిపాదాలు ఆలీఢంలోంచి ప్రత్యాలీఢంలోకి మారిపోతున్నాయి.

తాం, తాం, తధి, తధి.

తధికినతో, తకతై,

తక, తక, తకతాం.

వెనుక కంఠస్వరం హెచ్చిపోతూంది. ఆ వేళముతో గొంతుక వణికిపోతూంది. ఇంద్రాణితన్మయత హెచ్చిపోతోంది. భంగిమలలోని ఒంపుల్లోంచి నా మనస్సు తిరిగేలోపున మరొక భంగిమ వచ్చేస్తూంది...

సర్పశీర్షం పట్టిన ఆ హస్తాలు శివజటాజూటానికి చుట్టుకునే సర్పాల్లా వంపులుతిరిగిపోతున్నాయి. ధృతభావంలో శరీరంమీద జ్ఞానమే లేదు. సర్వస్వమూ ఏకాగ్రమైన ధ్యాస. నాగుండెలు ఆవేశంతో కొట్టుకుంటున్నాయి. విద్యుల్లతలా మెరసిపోతూంది ఇంద్రాణి; హిమాలయశైలశిఖరంలా ఎక్కడో దూరంగా కనుపిస్తూంది. క్రింద పడిపోతుందేమోనని లేచి నిల్చున్నాను.

తాం, త్తాం, తధకిన తా—ఆం...

ఇంద్రాణి ఆగింది. పరిగెత్తుకు వచ్చి ఆగిన లేడిపిల్లలా వుంది.

ఒళ్లంతా ముచ్చెమటలూ పోశాయి. పాపం! ఘర్మబిందువు ఒకటి చెక్కిలిమీదనుంచి జారుతూంది. ఆ వెల్తురులో మిలమిలా మెరుస్తూంది. ముక్కునున్న అడ్డబాసచిగురున మెరిసే ముత్యానికీ, చెక్కిలిమీద బిందువుకీ ఏమీ తేడా తెలియడంలేదు...

ఆమెఆవేశం అణగింది. ధ్యానముద్ర పట్టగలిగిన నిశ్చలత వచ్చింది. సముద్రం ఒక క్షణం నిలిచిపోయినట్లుంది.

"భద్రాయ నిద్రాయతే" అని కాదూ కల్పాంతమందు విష్ణుస్వరూపం?

మళ్ళీ ప్రారంభించింది. ఎంతో స్నిగ్ధదృక్కులు.

"చింతయామి సతతం"

చటుక్కున లేచిపోయాను. 'చింతయామి'! తెలియకుండానే నన్ను ఏ భావంలోకి పంపేసింది ఈ ఇంద్రాణి!

లేచి వచ్చేశాను.

ఆనందముహూర్తాలే బాధ కలిగిస్తాయి. ఉషఃకాంత కెంగలో సాగిపోయే సాంధ్యదేవత అనిపిస్తుంది. స్మృతిపథాలపై అలుముకున్న ఈ నునుమంచు తెరను పూర్తిగా ఈ ముహూర్తం విచ్ఛేదంచేసింది. మరచిపోయి నడవదల్చుకున్న మార్గంలో కప్పలేనిలేని అగాధం ఉందని చూపించింది ఇంద్రాణి......

నన్ను మరచిపోయి అందరి ఆవేదనలతోనూ సానుభూతి చూపించా లనుకున్నాను. కేవలమూ సుమరూపం ధరించా లనుకున్నాను...

కాని ఏమూలో దాగి అణగద్రొక్కబడిన తితీర్ష బయటికి వచ్చి పొగమంచులా జీవితమంతా ఆవరించింది...

బయట వెన్నెల కురుస్తూంది. ఆ చెట్ల ఆకులు గాలికి అల్లల్లాడి పోతున్నాయి. క్రింద నీడలు చిత్రచిత్రంగా అల్లుకుపోతున్నాయి.

అక్కడ నుంచో లేకపోయాను. ఆ సుధామాస్థానంలోనుంచి వచ్చే గజ్జెల చప్పుడికి దూరంగా నడచిపోయాను!!

* * *

ఎప్పటికీ జవాబు రాలేదు.

* * *

ఆరాత్రి తెల్లని దుప్పటిమీద గోరింటాకు చుక్కలు!

సాయంత్రం ఇంద్రాణి పెట్టుకుంటూన్నప్పుడు నా రెండు చిటికెనవ్రేళ్లకూ పెట్టించుకున్నాను.

మగవాళ్లకు గోరింటాకని కిలకిలా పుచ్చపువ్వులా నవ్వింది ఇంద్రాణి. నాకు స్మృతిచిహ్నమని ఆమె కేమి తెలుసు? ఆ గోరింటాకువ్రేళ్లలో తారకరశ్మి యీ రోజు కనుపించడంలేదు. ఆ వెన్నెలలో ఆ వ్రేళ్లు ఎంతో కలతపెట్టేయి. వెళ్లి తక్షణం కడిగివేశాను. కొంచెమూ పోలేదు. ఆ ఎర్రని రెంగతో వెలిగే ఆ రంగు అలాగే వుండిపోయింది.

* * *

ఇంతలో స్నాతకోత్సవం వచ్చింది.

మబ్బు విడుతుందని ప్రతివారూ ఆశిస్తారు.

మేఘం ఎక్కి వెళ్ళినంత తేలికగా చేరను కలకత్తా—శాంతినికేతనానికి.

ఆ మరునాడు స్నాతకోత్సవం. ఆ, నేడే ఆమెను చూడగలుగుతాను!

నా పెట్టెలో వుండే వాడిన మొగలిరేకులన్నీ తీసేశాను. అవి నా కింక అనవసరం, ఆ సాయంత్రమే క్రొత్త పూలచెండు మళ్ళీ బట్టలలో పెడతాను...

స్నాతకోత్సవానికి ఆమె వస్తుంది. ఆమెకోసమని ఆ జాజిపందిర విరగబూస్తుంది. చక్కని ఆకారంలో చెండు కడుతుంది. నేను చెయ్యి సాచి ఆ తల కేసి చూస్తాను. ఘట్టిగా నవ్వి "ఇంకా ఈ చిలిపితనం పోలేదూ ?" అంటుంది. 'వయస్సు వచ్చినా కుర్రతనము !' అన్నట్లు చూస్తుంది.

ఒక ఉత్తరము వ్రాయకపోయినా ఆ ఒక్క మాటా చాలదూ ? జీవితమంతా ఆర్ద్రం చెయ్యగలిగే మాట ఒక్కటే.

* * *

మరుసటిరోజు స్నాతకోత్సవం.

ఆ రోజు సాయంత్రం 'వత్సరాజు' మీద ప్రసంగం; కూలంకషంగా నాటకరీతులనూ, మానవ హృదయాన్నీ తెలుసుకున్న ప్రసంగం.

"వత్సరాజు ధీరలలితుడు. ఉదాత్తమూర్తి. జీవితపు చరియలలో పుష్పించే చిన్నపువ్వుల నన్నిటినీ కూడా చేర్చగలిగే రసికుడు...

మాళవిక అనామధేయురాలు. బేల. వాయువు చంచలతకు భయపడే మాలతీదళము........"

ఎంతో రక్తితో బోధిస్తున్నాడు.

ఆమె వచ్చింది !!

కలువపూవులకై వెదకుతూ వచ్చిన మాళవికలా వచ్చింది. సూర్యుని తొలికిరణం తాకి ప్రకాశించే మంచుబిందువులాంటి ముక్కుపుడకతో వచ్చింది...

ఆచార్యుడు మాళవికఅపహాయతను వర్ణిస్తున్నాడు.

ఒక నవ్వు !...మాళవికను కించపరుస్తూ ఒక నవ్వు !! ఆ ముగ్ధను చిన్నతనం చేస్తూ ఒక హేళన !!

ఆమెదే ఈ నవ్వు ?

ఎంత మాధుర్యమైన నవ్వు—అప్పుడు !

మందస్మితం తెల్ల మందారపువ్వులను జ్ఞాపకం చేసేది.

హృదయం శకలాలు చేసే నవ్వు—ఇప్పుడు

మోదుగుపువ్వులాంటి నవ్వు !!

తత్క్షణం నన్ను నేను తిట్టుకున్నాను.

నేను సరిగా వినలేదు !!

నా రసనయే చచ్చిపోయింది !!

ఆమెనవ్వు కాదు...

* * *

ఆరోజు స్నాతకోత్సవం.

ప్రారంభంలోనే ఆమె వచ్చింది.

తలనిండా జాజిపువ్వులు. మధ్య విడువని జారిపోతూవున్న కలువమొగ్గ పెట్టింది.

ఏదో చిత్రంలోంచి వచ్చే అప్సరసలా వచ్చింది.

నా కళ్లు రెండూ అక్కడే స్థాపితమయి పోయాయి.

ఉత్సవం అయిపోయిందట ! ..

... ... ...

ఉత్సవం అయిపోయింది.

నడువలేని కాళ్లతో ఆ ఉన్నతద్వారందగ్గర నుంచున్నా.

ఒకొక్కరూ వెళ్ళిపోయారు.

నా యశోధరాసిద్ధార్థుల ప్రథమసందర్శనం జ్ఞాపకంవచ్చింది. ఆఖరుకు మిగులుతుంది యశోధర.

... ... ...

ఆఖరున నడచిపోయింది ఆమె.

నేను చూస్తూనే వున్నాను. నన్ను ఆమె చూడనే లేదు.

అంతకాలం నుంచున్నానే !

ఆమె సాగిపోయింది. ఎవరికో నమస్కారం చేసి మాట్లాడుతూంది.

మెల్లగా అడుగులు లెక్కపెట్టుకుంటూ నడిచేను ఆమెప్రాంతంలోకి...

దూరంగా నుంచున్నాను.

ఎవరితోనో నవ్వుతూ కబురుచెబుతూంది.

దూరంనుంచి నేనూ నవ్వుతున్నాను.

చాలాసేపు అలాగే నుంచున్నాను !

ఇటు తిరిగింది !

రెండు చేతులూ హృదయందగ్గరగా జోడించి నమస్కారం చేశాను !!

చటుక్కున నాకేసి చూసింది. ఉలిక్కిపడింది.

"మీరా ? మీరుకూడా వచ్చారా ?" అంది.

నేనూ ప్రపంచకంలోకి వచ్చా ననబోయాను.

ఒక మాటా రాలేదు.

"క్షమించండి. కొంచెం తొందరగా వుంది"అని నమస్కరించింది.

నమస్కారం అందుకోబోయాను.

అప్పటికే ఆమె ఆ సమూహంలో కలిసి పోయింది.

నమస్కారం అందుకోవడంమాత్రం పూర్తి చేశాను.

అలాగే నిలువబడిపోయాను. ఏమి జరుగుతూందో స్పృహలేదు. ఎప్పుడు సాగిపోయానో స్మృతిలేదు.

అలాగే సాగిపోయాను !

ఎంతోకాలం !!

* * *

ఆమెస్వరూపము నాకు దివ్యవిగ్రహం. అందరూ ఆమెనూతనప్రదర్శనాలనుగురించి ప్రసంగిస్తారు. ఈ మధ్యన స్వరూపం మారిం దంటారు. నాకు చూడా లన్న జిజ్ఞాసే లేకపోయింది. ప్రతిక్షణమూ నాలోనే వుంది. ప్రతిదృశ్యమూ ఆమెకళలతోనే చూస్తాను. ప్రతిధ్వనీ ఆమెకోసం వింటాను. ఇంక ఆమె నా కెందుకు ? ఆమెజీవితమే నేను బ్రతుకుతున్నాను. ఆమెఆశయాలే అనుకరిస్తున్నాను. నేను ఆమెకు ఎందుకు ?

* * *

ఆ రోజు సన్నని చినుకులు పడుతున్నాయి.

భయభక్తులతో కూడా నడుస్తున్నాను.

"ఆమె నిన్ను ప్రోత్సాహపరచిందని చెప్ప గలవా ?"అని అతని ప్రశ్న. సర్వమూ తెలుసుకున్న అతని ప్రశ్న. ఉభయపక్షాలనూ తెలుసుకున్న అతని ప్రశ్న. ఎవరిదగ్గరనుంచి వచ్చిందో ఈ ప్రశ్న ? దానికి సమాధాన మేమిటి ? నేను చెప్పాలా ?

"నా తలంపులే నన్ను ప్రోత్సాహపరిచాయి. ఆమె ప్రోత్సాహపరచడ మేమిటి ? జన్మతః వుండే మాధుర్యమే మనలో వికసిస్తుంది... కాని ఆమె ఛాయలో నేను వృద్ధిపొందేను..."

అతనికి విసుగు కలిగింది.

"అదికాదు నాయనా ! ఆమె ఎప్పుడైనా మాటల్లోకాని, లేఖల్లోగాని ఏ విషయం గురించి అయినా నీలో ఆశలు రేకెత్తించిందా ?"

హఠాత్తుగా ఆగిపోయాను.

"నువ్వు జీవిస్తున్నందుకు ఋజువు వుందా"అని అడిగినట్లయింది...

అవును. ఎవరి జీవితమో నేను బ్రతుకుతున్నా నన్నానుకాదూ ?

కొన్నిరోజులక్రితం ఆమెను చూడాలని ప్రయత్నం చేశానుకాదూ ?...

కాని—

"నీ అసౌఖ్యము పంచుకోవడము నాకు ఒక ఆనందము. ఎప్పుడూ అక్కడ ఎక్కువ లోభత్వమే కన్పిస్తాను. నాకు వున్న కొంచెము భాగ్యమూ నాతో పంచుకోవూ ?"అని అడగా లనుకున్నాను.

కాని అదొక అసామర్థ్యత. బ్రతుకు లేకపోవ డము. 'నాలో నేనే సర్వస్వము' అన్న వేదవాక్యము మరచిపోవడము.

నాకు వేరువ్యక్తిత్వ మేది ? వేరు భావాలు ఏవి ?

ఈ శరీరంలో వేరొకరి జన్మ నడుస్తూంది. ఇంక నేను వారి కెందుకు ?

"ఆమె అశ్రు శేషాన్ని త్రించిందా?" అని ఈనాటి ప్రశ్న...

కబరీభరంలో వాడిన గులాబీరేకులులా రాలిపోవాలి పాతస్మృతులన్నీ...

"ఏవిధమైన ఆధారమూ లేదు. అలా అనుకో కూడదు.

ఆమె సాయంసమయంలో వెలిగే అస్పష్ట ఆవేశం, నేను ఆ సృష్టివైచిత్ర్యము చూసి ఆనందించి పోయాను...అంతకు తప్ప మరేమీ లేదు"...

అతను నడచిపోయాడు!!

'తుది సందేశం ఇదేనా?' అనుకున్నాను.

* * *

సెలవుల్లో నాన్నగారు రామాయణం చదవమన్నారు. సంస్కృతికావ్యాలంటే ఆయనకు ఎంత అభిమానం!

ముంగిలివాకిలి మురారిపదచింతనంతో మ్రోగిపోయేది...మహాశ్వేతను నాకు పరిచయంచేసినవారు మా తాతగారు...

ఆ దివ్యపరిసరాల్లో జన్మే జ్ఞానము. ఇంక చదువనవసరములేదు...

అన్నీ చదువుతూ వచ్చాను...సీతను భక్తితో, వినయంతో లక్ష్మణుడు వదిలివెళ్ళినచోట కళ్లనీళ్లతో కొంతభాగం నాన్నగారు తీసెయ్యమన్నారు. జరిపివేశాను...తరువాత శ్రీరామచంద్రమూర్తి 'హస్తాంబుజములు మోగిచి' అంటాడు :

"...భువనాంచితమూ హయమేధ మేను మీ
యనుమతి జేయువాడ నని
యాత్మ దలంచితి మీర లమ్మఖం
బునకు ననుజ్ఞ యిం డని..."

శ్రీరామచంద్రమూర్తియే ప్రార్థిస్తాడు. ప్రాజ్ఞుడు; ధర్మమూర్తి. శ్రీరామచంద్రుడు. తలపెట్టినదా "ముజ్జగములకు సమ్మత మాక్రతువు". పూర్వము వృత్రవధవలన గలిగిన బ్రహ్మహత్య బోగొట్టగలిగినది హయమేధము. ఇలునకు పురుషస్వరూపము స్థిరమైన జన్మము. ఇంక ఆయనకు అడ్డు ఏమిటి?

మును లందరూ ఆశీర్వదించారు.

కాని, ధర్మశంక వచ్చింది. 'సహధర్మచరి' సీతకు దూరమైపోయాడు శ్రీరాముడు. సీత ఎక్కడో వుంది. కాదు, అతనిలోనే వుంది—కాని విధ్యుక్త ధర్మ నిర్వహణకు ఒక స్వరూపం అవసరము.

ధర్మవిదులు సందేహం తీర్చారు. సీతప్రతిమను స్వర్ణముతో సీతగా నిర్మించారు. ఈమె 'ధరాసుతాకార సువర్ణపుత్రిక'.

ధర్మలోపం లేకుండా తన సతి సీతస్థానం ఆక్రమించిన ఆదర్శం, అతని ఆశయం సీత; అనుకరణ స్వర్ణ సీత. అతని ఆవేదన సీత; ఆవేదనారూపబింబము స్వర్ణసీత!

తక్షణం ఆగిపోయాను.

జన్మజన్మాల వివేకమూ, నా జీవితపు కీలకమూ నాకు అర్థమయింది.

ఒకటే చిన్న గులాబీపువ్వు వాసనలా నన్ను సోకింది. తక్షణం ఆకాశమంతా ఆవరించిపోయింది...

తక్షణం ఆమెకు ఇలా వ్రాశాను :

"కొంతమందికి స్వర్ణసీత ఒక విధ్యుక్తధర్మము.

కొంతమందికి ఒక తీరని కోరిక.

నాకుమాత్రం కోరికే లేని తీరిక.

నాలోని స్వర్ణమంతా పోగుచేసి ప్రతిరహితమైన స్వర్ణసీతను నేనే నిర్మించుకున్నాను.

ఆమెనే సతతం అర్చిస్తున్నాను.

నా జీవితమే ఆ ఆరాధన!"

# ఇండియాభావిరాజ్యాంగవిధానము

## మన నాయకుల బాధ్యత

●

### శ్రీ చావలి వెంకటహనుమంతరావు

ఇండియా దేశరాజ్యాంగచట్టనిర్మాణసభ వచ్చే అక్టోబరులోకాని కూడదని ఈమధ్య చేయబడిన ఒక ప్రకటనవలన తెలియుచున్నది. దీనినిబట్టి రాజ్యాంగచట్టము తయారగుటకూడ మరికొంతకాలము వాయిదా వేయబడిన దని నమ్మవచ్చును. మే నెలలోనే కూడునని తలచిన చట్టనిర్మాణసభా సమావేశము ఈ విధముగ అక్టోబరు నెలాఖరువరకు వాయిదా వేయబడుటకు కారణ మేమని దేశమం దనేకులు ప్రశ్నించుచున్నారు. చట్టనిర్మాణసభవారు ప్రకటించిన రీతిని కొన్ని ముఖ్యవిషయములను గురించిన నిర్ణయము ఇంకను కొంత ఆలస్యమగుటయే దీనికి కారణమా, లేక ఏమైన ఇతరకారణము లున్నవా? ఈ సందర్భములో దేశమందు ప్రబలియున్న అపోహలను పోగొట్టుటకు చట్టనిర్మాణసభవారు స్పష్టముగ కారణములను విశదపరుచుట అవసరము. రాజ్యాంగపరిషత్తు ఈ విధముగ వాయిదా వేయబడుటకును, ఇండియా ప్రధాని పండిట్ నెహ్రూ వచ్చే అక్టోబరులో లండనునందు జరుగబోవు కామన్వెల్తు ప్రధానుల సమావేశమునకు పోయి ఇండియా దేశపు భావినిగురించి జరుపు చర్చలకును ఏమాత్రము, ఎంత సంబంధ మున్నది అనునదికూడ ఒక ముఖ్యప్రశ్న.

అధినివేశరాజ్యముల ప్రధానుల సమావేశములో బ్రిటిష్ కామన్వెల్తుయొక్క భవిష్యత్తునుగురించి చర్చ జరుగుననియు, ముందు అధినివేశ రాజ్యములకును, బ్రిటనుకును ఎట్టి సంబంధబాంధవ్యము లుండవలె ననువిషయము ఆ సమావేశమందు నిర్ణయింపబడుననియు అప్పుడప్పుడు ఆ సమావేశమునుగురించి ప్రచురింపబడు వార్తలవలన గ్రహింపనగును. అప్పటికే ఇండియా రాజ్యాంగచట్టనిర్మాణసంఘమువారు తమ చిత్తుముసాయిదాలో నిశ్చయించినట్లు ఇండియా స్వతంత్రప్రజారాజ్యముగ ప్రకటింపబడిన, నెహ్రూపండితుడా సమావేశమునందు పాల్గొనుటకుగాని, బ్రిటిష్ అధినివేశ రాజ్యముల విధానమునకు సంబంధించిన ఏవిషయమునందును జోక్యము కలిగియుండుటకుగాని అవకాశ ముండదు. అట్లుగాక రాజ్యాంగపరిషత్తుసభ లండను సభానంతరము జరిగిన పండిట్ నెహ్రూ లండను సమావేశములో ఇండియా ప్రధానిగ పాల్గొనుటకును, ఆ సమావేశఫలితములను బట్టి ఇండియాయొక్క భవిష్యత్కార్యక్రమమును నిర్ణయించుకొనుటకును అవకాశ మేర్పడును. అది ఒక విధముగ లాభమే యని అంగీకరించినప్పటికిని, దానిలో మరి కొన్ని ముఖ్యవిషయము లిమిడియున్న వనికూడ అంగీకరింపకతప్పదు. వీటిలో ముఖ్యముగ గమనింపవలసిన దేమన, ఒకసారి భారత ప్రధానిగా పండిత నెహ్రూ బ్రిటిష్ కామన్వెల్తులో ఇండియా స్థానమునుగురించి కాని, ఇండియాయొక్క భావిరాజకీయసంబంధములను గురించికాని ఏదేని ఒక నిశ్చితాభిప్రాయమును వెలిబుచ్చినను, దానినిగురించి ఎట్టి పద్ధతికి కాని అంగీకరించి వచ్చినను దానిని మార్చుటకుగాని, వేరువిధముగ నిర్ణయించుటకుగాని రాజ్యాంగపరిషత్తువారికి కష్టమగును.

ఈ సందర్భములో ఇండియాను ఎదుర్కొనిన క్లిష్టసమస్య ఏమన: ప్రస్తుతము అధినివేశప్రతిపత్తి పొందిన ఇండియా ఆ విధముగ అధినివేశరాజ్యముగనే యుండుటా, లేక ఇదివరలో అనేకసార్లు కాంగ్రెసు సమావేశములలోను, ఇతర జాతీయసమావేశములలోను

అధికసంఖ్యాకులచే నిర్ణయింపబడినరీతిని 'సర్వ స్వతంత్ర ప్రజాస్వామ్య ప్రజారాజ్యము'గ నుండుటయా యనునది. బ్రిటన్ దేశస్థులు, రాజకీయవేత్తలు వీలైనంతవరకు ఇండియా-బ్రిటన్ సంబంధమును వదలుకొనక, బ్రిటన్ మూలస్థానముగ నుండు ఒక సమిష్టి స్వేచ్ఛారాజ్యముల కూటమిలో ఇండియాకూడ సభ్యత్వము కలిగియుండునట్లు తీవ్రముగ ప్రయత్నింతురనుటలో సందేహము లేదు. అట్లు వారి ఆశయమే సఫలమైన అది వారికి లాభదాయకముగను, వారి దేశ ప్రతిష్ఠాగౌరవములను పెంపొందించునదిగను ఉండునని వేరుగ చెప్పవలెనా? ఇండియా దేశమును చేతులార బ్రిటిష్‌వారెప్పుడును వదలుకొనుట కిష్టపడరు. కారణాంతరముల వలనను, అప్పుడున్న విషమ పరిస్థితులవలనను బ్రిటిషువారు ఇండియాకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యము నిచ్చుట కంగీకరించినప్పటికిని, ౧౯౪౭ ఆగస్టు ౧౫ తరువాత మౌంట్‌బాటన్ ప్రభువు మొన్న మొన్నటి వరకు ఇండియా గవర్నరుజనరలుగా నుండుటకు సమ్మతించుట, దానికి బ్రిటిష్ ప్రభుత్వము వారు సమ్మతించుట గమనింపదగు విషయములు. మౌంట్‌బాటన్ ప్రభువు మన దేశముయొక్క స్వాతంత్ర్యప్రపత్తినిర్మాతలలో ఒకడని మనము సంతోషించుచున్నాము. దానియందు కొంత నిజము కూడ లేకపోలేదు. కాని మౌంట్‌బాటన్ విధానములో ఇండియాను బ్రిటిష్‌రాజ్యాంగకూటమితో శాశ్వతసంబంధబాంధవ్యములుంచుకొనునట్లు చేయుటకూడ ఒక ముఖ్యవిషయమని మనము గ్రహించవలసియున్నది. ఇండియాపై అధికారము చెలాయించుచు ఆర్థిక, పారిశ్రామిక వగైరాలాభములను ౧౫౦ సంవత్సరములకు పైగా బ్రిటన్ దేశ మనుభవించినది. ఇకముందు కూడ స్నేహభావముతో, సహకార పద్ధతులపై అట్టి లాభములనే అనుభవించుటకు బ్రిటన్ ప్రయత్నించుటలో ఆశ్చర్యమేమున్నది? అట్లు ప్రయత్నించకపోవుటయే ఆశ్చర్యము కలుగజేయవలసియుండును కాని ప్రయత్నించుట కాదు.

ఇట్టి ఉద్దేశ్యముతో తన ప్రణాళిక నెరవేర్చుకొనుటకు బ్రిటన్ నెహ్రూపండితుని సహకారమును సంపాదించుటకు గట్టి ప్రయత్నము చేయుననియు, అక్టోబరులో అధినివేశరాజ్యముల ప్రధానుల సమావేశ సందర్భములో ఈ ప్రయత్నము తీవ్రరూపము దాల్చుననియు ఊహింపవచ్చును. ఇట్టి సహకారమును పొందుటకే మౌంట్‌బాటన్ ప్రభువు గవర్నరు జనరలుగా నుండగా ఒక విధానమును ఆలోచించియుండెననియు, దాని ప్రకారము, ఇక ముందు బ్రిటిషు అధినివేశరాజ్యముల కూటమి యను పేరుకు బదులు 'స్వేచ్ఛారాజ్యముల కూటమి' (Common Wealth of Free Nations) అని బ్రిటిష్‌కామన్వెల్తుకు నామకరణము చేయబడుననియు, ఆ కూటమిలో ఇప్పుడున్న బ్రిటిషు అధినివేశరాజ్యములన్నియు (ఇండియా, పాకిస్తానులుకూడ) ఇమిడియుండుననియు, అట్లు ఒక రాజ్యాంగకూటమి ఏర్పాటయిన అది ప్రపంచపరిణామమునకు, అంతర్జాతీయ రాజకీయములలోను గొప్ప పలుకుబడి, బలము, ప్రతిష్ఠ కలిగియుండు ననియు మౌంట్‌బాటన్ విధానములోని ప్రధానవిషయములుగా ఇదివరలో ప్రకటింపబడియుండెను. అట్టి కూటమిలో బ్రిటిష్‌జాతికి చెందని ఇండియా మొదలగు దేశములుకూడ ఎట్టి అభ్యంతరము లేకుండ, సమానఫాయిదాతో చేరుటకు వీలగును కాన ఏ దేశమునకు కాని అభ్యంతర ముండ నక్కరలేదని బ్రిటన్‌లో ప్రచారము ఇదివరలోనే జరుగుచున్నది; ఇకముందు మరీ ఎక్కువగ, తీవ్రముగ జరుగు ననుటలో అనుమానము లేదు.

కాన ఈ సందర్భములో ఇండియాదేశము తన అభిమతమునుగురించి ఒక నిర్ణయమునకు రావలసిన అవసరము కలదు. ఆ నిర్ణయ మేవిధముగ నుండవలెను? బ్రిటనుతో సంబంధ ముంచుకొని, స్వేచ్ఛారాజ్యకూటమిలో సభ్యత్వము కలిగియుండుటా, లేక చట్టపూర్వకముగ అట్టి సంబంధమును వదలుకొని, స్వతంత్ర ప్రజారాజ్యముగా నుండుటయా యనునవియే ఇప్పుడు భారతదేశము నెదుర్కొన్న ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు జవాబు రాజ్యాంగచట్టమును నిర్మించు సమయములో నిర్ణయింపవలసియున్నది; అనగా చట్టనిర్మాణసభా సమావేశములోనే ఈ నిర్ణయము జరుగవలెనన్నమాట.

ఆ సభా కార్యక్రమము అక్టోబరువరకు వాయిదా వేయబడిన, అక్టోబరుతరువాతగాని, అనగా అధినివేశరాజ్యముల ప్రధానుల సమావేశానంతరముకాని మన మెట్టి నిర్ణయమునకు వచ్చుటకును వీలుండ దన్నమాట.

ఈ ప్రధానవిషయమునుగురించి నిర్ణయించుటకు పూర్వము చాల జాగ్రత్తగా దానిలోని సాధకబాధకముల నన్నింటిని ఆలోచించవలసిన ఆవశ్యకత కలదని వేరుగ చెప్పవలెనా ? అట్టి నిర్ణయమునకు రాకపూర్వము మనము విచారించవలసినది : బ్రిటన్‌తో, బ్రిటిష్‌రాజ్యకూటమితో సంబంధ ముంచుకొన్నందువలన ఇండియాకు వచ్చు లాభ మేమి ? అట్లు సంబంధ ముంచుకొనుటకే నిశ్చయింపబడిన, అది ఏ షరతులపై ఉంచుకోవలెను ? ఇండియాయొక్క పేరుప్రతిష్ఠలకు, ఆమెయొక్క స్వాతంత్ర్యమునకు, ఇతరదేశములతో సరిసమానహక్కులు, ప్రపత్తి కలిగియుండు విషయములోను అవసరమగు రక్షణలు ఈ సంబంధమువలన చేకూరునా ? బ్రిటన్ మాట అట్లుండగా బ్రిటిష్ సామ్రాజ్యకూటమిలోని ఇతరదేశములు ఈ రక్షణల నంగీకరించి, ఇండియాదేశస్థులను, ఇండియాదేశమును తగు గౌరవభావముతో చూచెదరా ? అనగా దక్షిణ ఆఫ్రికావంటి దేశములలో ఇండియన్ పౌరులు పడుచున్న బాధలు, అనుభవించుచున్న కష్టనిష్ఠురములు దీనితో అంతమొందునా ? ఇండియాకు ఇట్టి సంబంధమువలన కలుగు ఆర్థిక, పారిశ్రామిక లాభము లేమి ? ఏదైన యుద్ధము వచ్చిన ఇండియా తన ఇష్టము లేనిదే అట్టి యుద్ధములో చేరవలసిన అవసర ముండకుండ యుండునా ? ఇండియాదేశరక్షణకై బ్రిటన్‌దేశము పూనుకొని, దాని కవసరమగు నౌకాదళసహాయము, ఇతరవిధములగు సహాయములు చేయుటకు సంసిద్ధముగ నుండునా ? ఇవన్నియు ఈ నిర్ణయమునకు చాల దగ్గర సంబంధము కలిగియున్న విషయములే.

'అధినివేశప్రపత్తి'యను పదము ఒక నిర్ణీతమగు పద్ధతికాని, ప్రపత్తికాని కాదు. ఆ పదము వివిధఅధినివేశదేశములకు సంబంధించినంతవరకు వివిధఅర్థములు కలిగియున్నది. వెస్టుమినిస్టర్ చట్టము ననుసరించి అధినివేశరాజ్యము లన్నియు తమతమ అంతర్దేశీయవిషయములలో సంపూర్ణస్వాతంత్ర్య మనుభవించుచు, విదేశాంగవ్యవహారములలోను, దేశరక్షణ, మరికొన్నివిషయములలోను, బ్రిటిష్‌రాజుయొక్క సంబంధము నంగీకరించుచున్నవి. వాటివాటిమధ్య పరస్పరసంబంధములలో అధినివేశరాజ్యము లన్నియు సమానమైన ప్రపత్తిహక్కులు కలిగియుండును; ఒకదాని కింకొకటి ఏ విషయమునందును లొంగియుండవు. కాని అధినివేశరాజ్యము లన్నియు అంగీకరించునట్టి, వాటిని సమన్వయించునట్టి బంధనము బ్రిటిష్‌రాజు, బ్రిటిష్ రాజకుటుంబమునకు వారు చూపు రాజభక్తియును. ఈ విధమగు సంబంధము బ్రిటిష్‌జాతితో సంబంధము కలిగి బ్రిటిష్‌నాగరికతా భాషా విశేషములను అంగీకరించు కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలాండు దేశములకు ఎట్టి కష్టము లేకుండ, ఎట్టి అనుమానము లేకుండ అన్వయించును. కాని బ్రిటన్ అంత దగ్గరసంబంధము లేనట్టి ఐర్లాండు, దక్షిణ ఆఫ్రికా, ఇండియా దేశములకు, బర్మా, సిలోన్ దేశములకు అంత సరిగ వర్తించుట కష్టమే. ఈ దేశస్థులకును, బ్రిటిష్‌వారికిని జాతి, నాగరికత మొదలగు విషయములలో అంత దగ్గరసంబంధము లేకపోవుటయే కాక, మొన్నమొన్నటిదాక వారికున్న సంబంధము అధికారి - నౌకరు సంబంధము మాత్రమే కాన ఇండియాకాని, సిలోన్‌కాని, బర్మాకాని బ్రిటన్ దేశపు సంబంధమును కనడా, న్యూజీలాండు దేశములు సంతోషముతో అంగీకరించినట్లు అంగీకరించుటకు ఎట్టి అవకాశములు లేవు. ఈకారణమువలననే ౧౯౨౯ డిసెంబరులో లాహోరు కాంగ్రెస్ సమావేశములో పండిత నెహ్రూ స్వాతంత్ర్యజండా నెగురవేసినప్పటినుండియు మనదేశస్థులలో స్వాతంత్ర్యమే పరమావధి, బ్రిటనుతో ఎట్టి రాజకీయసంబంధము కానిలేనట్టి సర్వస్వాతంత్ర్యమే మన మాశించదగినది అను అభిప్రాయము ప్రబలమైనది. అధినివేశప్రతిపత్తి నంగీకరించిన లిబరల్ ఫెడరేషను మొదలగు సంస్థలను కాంగ్రెసువాదులు, జాతీయవాదులు కొంతవరకు గౌరవహీనముగ చూచుటకూడ మన కందరకు తెలిసిన విషయమే.

కాన మన భవిష్యత్పంథాను గురించి ఆలోచించుకొని నిర్ణయించుకొనునప్పుడు ఇంతవరకు బ్రిటనుకు, మనకు ఉండుచువచ్చిన సంబంధమును మరచుట దుర్లభము. మన మింతవరకు ఆ భవిష్యత్తునుగురించి కట్టుచువచ్చిన ఊహాసౌధములను ఇప్పుడు ఒక్కసారిగ త్రోసిపుచ్చి మరల బ్రిటిష్‌సంబంధమునకు అంగీకరించుట దేశస్థులలో చాలమందికి నిరాశాజనకముగ నుండుననికూడ చెప్పకతప్పదు. ౧౯౪౭ ఆగస్టు ౧౫ తరువాతకూడ బ్రిటన్ ఇండియాదేశమునకు నష్టము వచ్చునట్లు, ఆమె జాతీయాభివృద్ధికి, శ్రేయస్సుకు అడ్డుతగులునట్లు కొన్నివిషయములలో ప్రవర్తించుటకూడ గమనించవలసిన విషయమే. కాశ్మీర్, హైదరాబాదు విషయములలో బ్రిటనుయొక్క విధానము ఇండియాకంత లాభదాయక మనియు, స్నేహభావము చూపునదిగ నున్నదనియు చెప్పుట కష్టము. ఇదియుకాక, బ్రిటనుతో ఒకే రాజ్యకూటమిలో ఇండియా భాగస్వామిగ నున్న మన దేశరక్షణకైకాని, ఆర్థిక పారిశ్రామికాభివృద్ధికికాని బ్రిటన్ తగినంత నిజమైన సహాయము చేయగలదా? చేయుటకు సంసిద్ధముగ నున్నదా అనువిషయముకూడ ఆలోచించవలసియున్నది. రెండవప్రపంచ సంగ్రామానంతరము బ్రిటన్‌యొక్క మిలిటరీబలము, నౌకాబలముకూడ రష్యా, అమెరికాలతో పోల్చిచూచిన చాల తక్కువగ నున్నవని చెప్పకతప్పదు. ఇట్టి సందర్భములో మరొక ప్రపంచసంగ్రామము వచ్చిన ఎంతవరకు ఇండియాను రక్షించుటకు బ్రిటిష్‌నౌకాదళము, బ్రిటిష్‌సేనలు తోడ్పడగలవు అను విషయము అనుమానాస్పదమే. ఇంక మన పారిశ్రామికాభివృద్ధి కవసరమగు సామగ్రి, యంత్రములు, నిపుణుల సహాయము మొదలగునవి మన కందజేయుటకుకూడ బ్రిటనుపైననే ఆధారపడియుండుటవలన లాభము లేదనియు, ఏదేశములో అవి దొరకిన ఆదేశములో వాటిని సంపాదించుటకే మనము ప్రయత్నించవలె ననియు అనుభవమునుబట్టి మనము నేర్చుకోవలసిన పాఠముగా నున్నది.

స్థితిగతు లన్నియు ఈవిధముగ నుండగా మన పెద్దలు కొంతమంది ఇంతవరకు వారు చెప్పుచువచ్చిన మాటలను, చేయుచువచ్చిన ప్రకటనలను దిగమ్రింగి, తిరిగి బ్రిటనుతోను, బ్రిటిష్ సమిష్టిరాజ్యకూటమితోను ఇండియాకు రాజకీయసంబంధ ముండునట్లు ప్రయత్నించుట ఆశ్చర్యము కలిగింపకమానదు. ఆ సంబంధమును ఉంచుకొనుటవలన ఇండియాదేశమునకు ముందుముందు ప్రపంచ, అంతర్జాతీయరాజకీయములలో అనుకూలపరిస్థితు లుండునని తలచుట తప్పు. ఇండియా చేయవలసినదేమన, ఇదివరలో మన కాంగ్రెస్‌నాయకులు పదే పదే నిర్ణయించినపద్ధతినే ఇండియాదేశము సర్వస్వతంత్రదేశముగా నుండునట్లును బ్రిటనుతోకాని, ఏ ఇతర ప్రత్యేకరాజ్యకూటమితోకాని ప్రత్యేకసంబంధములు లేకుండ యుండునట్లును నిర్ణయముచేసుకొనుటయే. ఇట్టి నిర్ణయమువలన మన దేశముయొక్క విదేశాంగపద్ధతిని అప్పటప్పటి పరిస్థితులనుబట్టి, అవసరములనుబట్టి దేశాభ్యుదయమునకు తోడ్పడునట్టియు, సహకారులుగ నుండునట్టియు సూత్రములపై ఏర్పాటుచేసుకొనుటకు వీలగును. ఇండియా స్వతంత్రప్రజారాజ్యముగ నుండినప్పటికిని, దీనివలన బ్రిటనుతో స్నేహసంబంధములు కలిగియుండుటకు నిషేధముకాని, అభ్యంతరముకాని ఎంతమాత్రముండదు. కాని నిజముగ లోపము దేనియం దున్నదనగా, దేశకాలపాత్రల ననుసరించి, ఏ ఇతరదేశములతోనైన (అనగా ఒక్కొక్కసమయములో బ్రిటనుకు వ్యతిరేకముగ, ప్రతికూలపక్షములో నున్న దేశములతోకూడ) స్నేహమును కలుపుకొనుటకు, ఒడంబడికలు చేసుకొనుటకు ఎట్టి అడ్డముకాని యుండదు. ఇట్లు చెప్పుటవలన బ్రిటనుతోకాని, బ్రిటిష్‌రాజ్యకూటమిలో చేరిన ఇతరదేశములతోకాని మనము అన్నివిధములగు (అనగా వర్తకవ్యాపారములలోగాని, ఆర్థికముగకాని, ఇతరవిషయములలోకాని) సంబంధములను వదులుకోవలసినదని చెప్పుటకూడ కాదు. స్వతంత్రభారతదేశమునకును, అధినివేశభారతదేశమునకును ఉండు భేదములు, ఆయా ప్రపత్తిలోనుండు లాభనష్టములు చూపుటమాత్రమే దాని ఉద్దేశ్యము.

ఈ దృక్పథమునుండి చూచిన ఇండియా సంపూర్ణస్వాతంత్ర్యపంథా త్రొక్కుటయే అన్నివిధముల శ్రేయోదాయకమని అంగీకరింపవలసియున్నది. శ్రీ పండిట్ నెహ్రూ, వల్లభాయ్‌పటేల్, డాక్టరు

రాజేంద్రప్రసాద్ గార్లు, ఇతర కాంగ్రెస్ నాయకులు ఈ అతిప్రధాన విషయమును గ్రహింపలేకున్నారని తలప నవసరములేదు. ఇన్ని సంవత్సరములనుండి స్వాతంత్ర్యముకొరకై వారు చేయుచువచ్చిన ప్రచారము ఇంతలో మరచిరనికూడ మన మనుమానము పడ నక్కరలేదు. కాని బ్రిటిష్ ప్రభుత్వమువారు చేయు ప్రయత్నములను వారు జాగరూకతతో గమనింపవలసి యున్నది. ఇప్పుడు మనదేశపు భావిరాజ్యాంగచట్టమును శాశ్వతముగ నిర్మించు ఈ సమయములో ఇట్టి జాగరూకత చాల అవసరము. ఇండియాతో బ్రిటిష్ కాక, ఇంక ఏ ఇతర పెద్దరాజ్యములును స్నేహితులుగ నుండబోరను అనుమానము ఎంతమాత్రము నవసరము లేదు. ఇండియా తన [illegible] సైనికబలమును పెంపొందించుకొనిన, ఆమె స్నేహమునకై ప్రపంచమందలి పెద్ద రాజ్యములన్నియు తహతహపడు ననుటలో సందేహము లేదు. అదియుకాక బ్రిటనుతోనే స్నేహము, సఖ్యము కలిగియుండుటకుకూడ స్వతంత్రభారతదేశమున కెంత మాత్రము అభ్యంతర ముండకూడదు. ఇట్టి సఖ్యత పెంపొందించుటకై బ్రిటిష్‌రాజ్యకూటమిలో సభ్యత్వము మాత్రమే మార్గము కాదు. స్వతంత్ర ప్రజారాజ్యముగు ఇండియా బ్రిటనుతో సమానస్థాయిని సంధిచేసుకొని, తుదకు స్వాతంత్ర్యమున కెంతమాత్రము భంగము రాకుండ స్నేహముతో నుండవచ్చును. ఇదియే మన రాజ్యాంగపరిషత్తువారు చేయవలసిన పనికాని, పరిషత్తుసభను వాయిదా వేసి ఏదోవిధముగ బ్రిటిష్ సామ్రాజ్యముతో సంబంధమును పొడిగించుట, లేక బ్రిటిష్ అధినివేశ ప్రతిపత్తితో సంతృప్తిపడియుండుటకు సిద్ధపడుట కూడని పనులు. ప్రజలలో కల అపోహమును తొలగించుట కిదియే మార్గము.



# శబ్దప్రయోగము

శ్రీ విక్రమదేవవర్మ

శాస్త్రసమ్మతశబ్దమె ప్రయోగార్హమని కొందఱ మతము; శాస్త్రనిషిద్ధశబ్దమయినను, మహాకవిప్రయోగ ముండునేని యది ప్రయోగార్హమని మఱికొందఱ మతము. ఇట్లుండుటవలన నా యాశయమును వెల్లడింతును :

"శాస్త్రమేవ ప్రమాణమ్" అని యుండుటవలనను, "శాస్యతే అనేన ఇతి శాస్త్రమ్" (దేనిచేత శాసింపఁబడునో యది శాస్త్రము) అగుటవలనను, శాస్త్రసమ్మత శబ్దమె గ్రాహ్యము. "ప్రయోగశరణా వైయాకరణాః" అను వాక్యము వ్యాకరణరచనకు ముం దుండిన ప్రయోగములను వ్యాకరణ రచకులు గ్రహింపవలసివచ్చె ననుటకు సూచి ము. విశ్వామిత్రాదశబ్దములు తన్నిదర్శనములు.

ఋషిగాని, కవిగాని చేసిన శాస్త్రనిషిద్ధప్రయోగము దష్టే యగును. తప్పెప్పుడు నొప్పు గాదు. భ్రమప్రమాదములు మనుజులకుఁ గలుగుచుండుటవలన నట్టి వానిని "ఆర్షప్రయోగా త్సాధుః "అనియును, "మహాకవిప్రయోగా త్సాధుః" అనియును గౌరవింతుము. అంతేకాని, యట్టివి పెఱవారికిఁ బ్రయోగానర్హములు.

సురగురుని యిల్లాలు-తార-వ్యభిచరించుటవలన వ్యభిచారము కర్తవ్యమగునా? హరిశ్చంద్రుఁడు వరుణునకుఁ బ్రతారణము సేయుటవలనఁ బ్రతారణ మనుష్ఠేయమగునా? ధర్మరా జనృతమాడుటవలన ననృతము పలుకఁదగునా? మహాత్మగాంధి పీడితగోవును జంపించుటవలన గోవధము కరణీయమగునా?

పైని పేర్కొనఁబడిన కార్యములు శాస్త్రనిషిద్ధములగుటవలన నన్యులకాచరణీయములు గానేరవు. అట్లే వ్యాకరణము భాషాశాస్త్ర మగుటవలన దన్నిషిద్ధ ప్రయోగము లాధునికులకు గ్రాహ్యములు గావు. నియమబద్ధము విబుధలక్షణము.

పెఱుగుచున్న తెలుఁగుబాస కిప్పటి వ్యాకరణము లసమగ్రములు. కాఁబట్టి తుని యందు జరిగిన యాంధ్రసాహిత్యపరిషద్ద్వాదశతమవార్షికసమ్మేళనాధ్యక్షోపన్యాసమున నే నిట్లు నుడివితిని:

"ఆంధ్రభాషకుఁ దగు వ్యాకరణ మొకటి రచింపఁబడుట యత్యావశ్యకము. తద్రచయిత లనేకులుగాను, సంస్కృతాంధ్ర భాషాద్వయాభిజ్ఞులుగా నుండవలెను. మఱి యది పరిషత్తుయొక్క సమ్మతిని బడయవలెను. గ్రహింపఁబడియుండని శబ్దరూపములలోఁ గొన్నిటిని దానియందుఁ జేర్పవచ్చును......... ....................."

నేఁటికిని నాకోరిక నెఱవేఱకుండుట ఖేదకరము.



# జయపతాక

•

శ్రీ కొమరవోలు వెంకటసుబ్బారావు

ఈ జండాను ప్రతిష్ఠసేయుటకై భార్యాబంధులన్ పుత్రులన్
స్త్రీజాతిన్ బలిచేసి సమ్మదమునన్ శ్రీకృష్ణజన్మస్థలుల్
పూజార్హంబుల జేసి రెందఱో మహాత్ముల్ మున్ను తత్తత్త్వ
తేజస్సత్త్వము లీ పతాకకు యశశ్శ్రీశ్రేయముల్ గూర్చుతన్ !

మరఫిరంగులు లేవు మందుగుండ్లును లేవు బందూకిబాజరబంది లేదు
విషవాయువులు లేవు మిషనుగన్నులు లేవు బాంబర్ల యట్టహాసంబు లేదు
లెఫ్టురైటులు లేవు స్లీపుమార్చిలు లేవు అధికారశిక్షణాయుధనా క్షేమ
గాలికోటలు లేవు కదననౌకలు లేవు జను లొండొరుల చంపుకొనుట లేదు
త్యాగమును, ధైర్యమును మహాస్త్రములుగాగ - పోరు సాగించి శత్రుల పొడ వడంచి
స్వేచ్ఛగాంచిన భారతవీరవరుల - యాత్మశక్తికి భక్తితో నంజలింతు.

ఏ నీ సుధాహాసహిమచంద్రికలకునై యెందఱు ప్రాణంబు లిచ్చినారో
యే నీ ముఖారవిందేక్షణాసక్తిమై యెందఱు చెఱలందు మ్రందినారో
యే నీ చరణనూపురానుషంగేచ్ఛచే నెందఱు జీవిక లెడసినారో
యే నీ పరాధీనహింస మాన్పుటకునై యెందఱు బలిపీఠ మెక్కినారో
యందఱును చూచుచున్నార లభ్రవీథి - తారలయి వారి మహలెల్ల తనివిఁజెంద
భారతీయుల హృదయపంకేరుహముల - తాండవింపవె తల్లి! స్వాతంత్ర్యలక్ష్మి!

బాకుల పోట్లతో, నణువుబాంబులతో, హననాస్త్రశక్తితో
భీకరహోమకుండముగ వ్రేల్చె ప్రపంచము నెల్ల పశ్చిమా
స్తోకమనీష; వెన్నెలలతో, ననురాగముతో, నహింసతో
లోకము నెల్ల నీ యడుగులో కడిగింపవె భారతాంబికా!

విజయోస్తు! జగదేకవీరభారతమాత, కభ్యుదయోస్తు! కల్యాణమయికి
శ్రీరస్తు! వివిధమతారామసీమకు, విభవోస్తు! నీహారభృచ్ఛిఖునకు
సందీప్తి రస్తు! ఆనందకాననవాటి, కభివృద్ధి రస్తు! అనాదిగమకు
చిరశాంతి రస్తు! సంగరభైరవీశక్తి, కైశ్వర్యమస్తు! మహర్షిసుతకు
అతులితోత్సాహసంగళావాప్తి రస్తు - యతికులకులాయ నైగమాయతనమునకు
ప్రథితకీర్తిప్రభావసంప్రాప్తి రస్తు - నవనవోన్మేషదివ్యవిజ్ఞానఖనికి!



ఇచటి 'ఉత్పిబ' శబ్దమునకు 'ఉత్తమ పానీయ' మను అర్థము ఎట్లును కుదురజాలదు.

'ఉత్పిబంబులు భుక్తిగా—' అనుచో నేను పాఠమును దిద్ది 'ఉత్పిబం బల భుక్తిగా' అని మార్చితి నని శ్రీ నారాయణరావుగా రనుకొన్నారు. 'బులు'కు మాఱు 'బల' అని చేవ్రాత పొరపాటు! 'ఉత్పిబం బల భుక్తిగా' అనినచో అర్థము కుదురనే కుదురదు.

౪. 'కాళికా' శబ్దమునకు 'కాఱుమబ్బు' అను నర్థ మున్న దని శ్రీవారు ఒప్పుకొన్నందులకు సంతోషము; 'కాళికా' శబ్దమున కీ యర్థము నిఘంటువుల కెక్కలే దన్నంతవఱకే నాకు సంబంధము. సారస్య మునుబట్టి, ప్రతిభనుబట్టి అర్థములను కల్పించుకొన వచ్చును. రూపమునుబట్టియు, గర్జనమునుబట్టియుకూడ నిచట ఏది యుచితమో, సహృదయులే నిర్ణయింప సమర్థులు!

౫. 'చాగు' అను పదములో అర్ధానుస్వార మున్న దనియు, మరాఠీభాషలో ఆ పదమునకు 'చక్కనిది' అని యర్థ మనియు శ్రీ నారాయణరావుగారు వ్రాసిరి. ఇది ఆశ్చర్యానందాదులను సూచించు అనుకరణ పదము! దీని యర్థనిర్ణయ మూహాధీనము! ఇట్టి పదముల యనుస్వారచర్చయు అప్రస్తుతము; ఇట్టి పదములను పురస్కరించుకొని ఇదమిత్థమని ఒక నిర్ణయముచేయుట దుర్ఘటము.

౬. 'ప్రస్తుతము' అనుదానికి ఉపనయన, వివాహాదిక విశేషము లర్థ మని నేను తెల్పితిని. శ్రీ నారాయణరావుగారు చెప్పిన 'గర్భాధానము'ను దాని కర్థము కావచ్చును. కాని 'గర్భాధాన' మెక్కటియే 'ప్రస్తుత' పదవాచ్య మనుటలో కారణము కానరాకున్నది.

౭. 'ముయ్యాడు' పదమునకు 'కౌమారావస్థ' అను నర్థమే కాక 'మూడుమూర్తులా ఒకటే పోలిక కలిగి' అని యర్థ మని శ్రీ నారాయణరావుగారు సోదాహరణముగా వివరించిరి. వారు చెప్పిన యర్థము వారిచ్చిన యుదాహరణమునకు సరిపడును. కాని 'ముయ్యాడు'నకు రామకృష్ణాభిప్రేతమగు అర్థ మిదియే యని చెప్పనక్కఱలేదు.

'గోమున బెరుగుచు ముయ్యాడై మెలగుచు……'

అను పద్యమున గల 'ముయ్యాడు' కౌమారావస్థ యనుట పొసగదని చూపుచు శ్రీవారు దాని తరువాతి పద్యము నుదహరించి సమర్థించిరి. 'ఎల్ల కాలము కౌమారావస్థలోనే యున్న బాలురకు కాలానుగుణముగ, తత్తత్కర్మ లాచరించుట కుదుర'దని వారి యభిప్రాయమై యుండవోపును. సుశీలాదేవిపుత్రులు చూచుటకు నిత్యకుమారులుగా ఉన్నారని యభిప్రాయము; కాని వారికి కాలానుగుణముగ చేయదగిన కృత్యములు లోపింపవలె నని అభిప్రాయము కాదు. మఱియు తల్లికి బిడ్డలెల్లపుడును 'కౌమారావస్థలో ఉన్న వారే' (కుమారులే) అగుదురుగదా! శ్రీనారాయణరావుగారి యర్థమును మాత్రము గ్రహించినచో, వా రుదాహరించిన పద్యమునకు జేఱువనే కల—

"ఒకడు నిరూఢకృష్ణరుచి
యొక్కడు నిర్మలమానసప్రియుం
డొకడు ప్రయత్నయోగ్యఫలు
డొక్క డనాద్యతిబంధకంచుకుం
డొకడు రసానుకూలమతి
యుక్తుడునై విలసిల్లిరి…"

అను పద్యభావము పొందుపడదేమో యని తోచుచున్నది. ఇందు ఆ బాలురకు గల పరస్పర భేదము స్పష్ట మగుచునే యున్నది.

౮. 'శ్రావమూకుడు' కందదుంపవంటి జంటపద మనియు, అది ఒకజాతిమూకుడయి ఉండవచ్చు ననియు శ్రీ నారాయణరావుగా రూహించి తెలిపిరి. 'శ్రావమూకుటక' అని ముద్రితపుస్తకములలో ఉన్నను అది సరియైన పాఠము కాదు. 'స్రావమూకుటక' అని వ్రాతప్రతిలో గలదు. అదియే సరియగు పాఠము. 'స్రావమూకుడు' గంజిమూకుడగును. నా వ్యాసమున వ్రాతపొరపాటున సకారమునకు బదులు 'శ'పడి, 'శ్రావమూకుడు' అని అట్లే ముద్రిత మయినది.

'శరావము' నకు 'శ్రావ' రూపాంతరమును కల్పించి, 'శ్రావమూకుడు'ను జంటపదముగా జేసి, అర్థము కుదురకపోగా 'ఒకవిధమైన మూకుడు' అని యూహించుట అంత యుక్తియుక్తమని తోచకున్నది.

భాషాతత్త్వశాస్త్రమున నాకుగల పరిచయము తక్కువ యగుటచే 'కుడిపలు'ను గూర్చి పరిశోధించి గాని ఎట్టి నిర్ణయమును చేయజాలకున్నాను. భాషా విషయమున ఆఱితేఱిన శ్రీ నారాయణరావుగారి యాశయమే సరియైన దయినను కావచ్చును.

నా యాశయములను 'భారతి' పాఠకుల కెఱుక పఱచుటకే వ్యాసము వ్రాయబడినదే; కాని సుప్రసిద్ధ విద్వాంసులగు శ్రీ నారాయణరావుగారిని విమర్శింప దలచి మాత్రము కా దని మనవిచేయుచున్నాను.













ఈ నెం॥ 15-వ తేదీ- స్వాతంత్ర్య దినోత్సవమునాడు భారతజ్యోతియైన బాపూజీ స్మృతిచిహ్నముగా విడుదల కానున్న కొత్త తపాలాబిళ్లలు.

# లేములవాడ చాళుక్యులు

●

## శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

(గత సంచిక తరువాయి)

### ౪. వినయాదిత్యయుద్ధమల్లుడు

వినయాదిత్య-యుద్ధమల్లుని శాసనము లెవ్వియు నింతవఱకు లభ్యపడలేదు. కాని ఇతని సంతతి వారి శాసనములవల్లను, పంపకవి విక్రమార్జునవిజయ పీఠికవల్లను నితని చరిత్ర కొంతవఱకు దెలియవచ్చు చున్నది. ఇతని పుత్రుడగు మొదటి యరికేసరిదని చెప్పబడు కొల్లిపఱ తామ్రశాసనమున నితడు విశ్వరాటనియు, రామవిక్రమనృపాంకుశాదిబిరు దాంకితుడనియు, వరాహలాంఛనముచే వశీకృతభూచక్రు డనియు, సాగరవేలాపరివేష్టితసకలధరామండలు డనియు, దురుష్క యవన బర్బర కాశ్మీర కాంభోజ మగధ మాళవ కళింగ గంగ పల్లవ కేరళప్రభృతిరాజలోకముచే నర్చలు గొను ననియు జెప్పియున్నది. ఈ శాసనము కృత్రిమమని ప్రబలమైన సంశయము గలదు. కాని శాసనము కృత్రిమమైనను నందువర్ణింపబడిన యంశములు కృత్రిమములు కాక చరిత్రాత్మకములే కావచ్చు నను శాసనవిమర్శకుల మతము ననుసరించి దీనినివిచారార్హ్యముగాదని త్రోసిపుచ్చక పరామర్శించి యందెంత సత్యము గలదో కనుగొనవలసియున్నది.

వినయాదిత్యయుద్ధమల్లుడు దాక్షిణాత్యుడగు చాళుక్యుడు. ఇతని పుత్రుడగు మొదటి యరికేసరి క్రీ. శ. ౭౮౦ మొదలు ౭౯౧ వఱకు దక్కను సామ్రాజ్యము నేలిన రాష్ట్రకూట చక్రవర్తి. ధ్రువనిరుపమదేవున కితడు సామంతుడును, సమకాలీనుడును నగుటచే నితడు క్రీ.శ. ౮ వ శతాబ్దతృతీయపాదమున నభ్యుదయ మంది యుండవచ్చునని పూర్వప్రకరణమున నిశ్చయించియున్నాడను. ఈ కాలమున కొల్లిపఱశాసనమున వర్ణింపబడినంతటి గొప్ప చాళుక్యనరపాలు డెవ్వడేనియు నుండెనో విచారింతము. అప్పటి రాష్ట్రకూటశాసనములను బరిశీలించి చూడగా రాష్ట్రకూటసామ్రాజ్యస్థాపకుడైన దంతిదుర్గుడు గతించిన వెనుక ప్రబలుడైన చాళుక్యరాజొకడు సామ్రాజ్యము నాక్రమించుకొని కొంతకాలము రాజ్య మొనర్చినట్లు దెలియవచ్చుచున్నది.

మొదటి కృష్ణరాజుపుత్రుడగు ముమ్మడి గోవిందరాజు దన రాధన్‌పుర, వణిదిండోరి తామ్రపట్టికలయందీ విషయము నిట్లు ప్రస్తావించియున్నాడు:

పక్షచ్ఛేదభయాశ్రితాఖిల మహా
భూభృత్కుల భ్రాజితా
ద్దుర్లంఘ్యా రపరై రనేకవిమల
భ్రాజిష్ణురత్నాన్వితాత్
య శ్చాలుక్యబలా దనూనవిబుధ
వ్రాతాశ్రయో వారిధే
ర్లక్ష్మీం మన్దరవత్సలీల మచిరా
దాకృష్టవాన్ వల్లభః 1.

మొదటి యమోఘవర్షనృపతుంగుని సంజన్ తామ్రపట్టికయందును నీ విషయము జెప్పబడియున్నది.

స్వయంవరీభూతరణాఙ్గణే తత
స్స నిర్వ్యపేక్షం శుభతుంగవల్లభః,
చకర్ష చాలుక్యకులశ్రియం బలా
ద్విలోలపాలిధ్వజమాలధారిణీం 2.

---

1. ఎపి. ఇండి. సం. ౬, పుట ౨౪౩; ఇండి. ఆంటి. సం. ౧౧, పుట ౧౫౬.

2. ఎపి. ఇండి. సం. ౬, పుట ౨౪౩; ఇండి. ఆంటి. సం. ౧౧, పుట ౧౫౬ త.

ఈ రెండు శాసనముల వల్లను దంతిదుర్గుడు కాలగతి నందిన పిమ్మట చాళుక్యులు ప్రబలి సామ్రాజ్యము నాక్రమించుకొని రనియు, వారిని నిర్జించి మొదటి కృష్ణరాజు దానిని మరల స్వాధీనము గావించుకొనె ననియు దెలియవచ్చుచున్నది. మఱియు పై పేర్కొనిన ముమ్మడి గోవిందరాజు తన పైఠాను తామ్రపట్టికయందీ సందర్భమున చాళుక్యులను ప్రస్తావించక వారి బదులు రాహప్పయను నొకని పేర్కొనియున్నాడు.

రాహప్ప మాత్మభుజజాతబలావలేప
మాజౌ విజిత్య నిశితాసిలతాప్రహారైః,
పాలిధ్వజావలి శుభా మచిరేణ యో హి
రాజాధిరాజపరమేశ్వరతాం తతాన.3

అనగా నీ మొదటి కృష్ణరాజు రాహప్ప యను నతని యుద్ధమున జయించి యతనికడనుండి పాలిధ్వజావలిని, రాజాధిరాజపరమేశ్వరపదమును పొందెనని తాత్పర్యము. రాష్ట్రకూటసామ్రాజ్యస్థాపనకు ముందు దక్షిణాపథమున రాజాధిరాజ పరమేశ్వర పట్టము చాళుక్యుల దగుటచేతను, పాలిధ్వజము చాళుక్యులదే యగుటచేతను, చాళుక్యులను జయించి వారివైన పాలిధ్వజాది సామ్రాజ్యములను గొన్న విధముననే మొదటి కృష్ణరాజు రాహప్పను జయించి వానినే యతనికడ నుండియు గైకొన్నట్లే చెప్పియుండుటచేతను రాహప్ప చాళుక్యుడై యుండవలయు నని తోచుచున్నది. ఇతని చరిత్రను గూర్చి యేమియు దెలియరాకున్నను, నితడు సామాన్యుడని తలచుటకు వీలులేదు. చాళుక్యులను జయించి దంతిదుర్గుడు స్వాధీనపఱచుకొనిన సామ్రాజ్యమును మరల వశపఱచుకొని యతని పినతండ్రియైన ప్రథమకృష్ణ నరపాలుని రాజాధిరాజపరమేశ్వరపట్టమును బొంద నీయక యడ్డుపెట్టెను. రాష్ట్రకూటరాచరికస్థితి యపుడెట్లుండెనో ప్రథమకృష్ణరాజు తన భండకతామ్రపట్టికయందు సూచించియున్నాడు.

ఉల్లంఘితమర్యాదే
కలిజలధౌ వ్యాకులా నిమజ్జన్తీ
యే నోద్ధృతా ధరిత్రీ
శ్రీప్రలయమహావరాహేణ. 4

ఇందు చెప్పబడిన కలిజలధి చాళుక్యుల ప్రతాపము. అందు మునిగిన ధరిత్రి రాష్ట్రకూటరాజ్యము. దీనిని మునిగిపోనీయక యుద్ధరించినవాడు ప్రలయమహావరాహబిరుదాంకితుడగు ప్రథమకృష్ణరాజు. కావున రాహప్పనాయకత్వముక్రింద చాళుక్యులు నష్టమై పోయిన స్వకులక్రమాగతమైన సామ్రాజ్యమును సాధించి యల్పకాల మేలి రనియు, మరల నా రాహప్పను జయించి రాష్ట్రకూట మొదటికృష్ణరాజు స్వాధీనపఱచుకొనె ననియు దెల్ల మగుచున్నది.

మఱియు రాష్ట్రకూటసామ్రాజ్యస్థాపకుడైన దంతిదుర్గుడు చాళుక్యులతోడి యుద్ధమున మృతినొందెననుటకు గొంత యవకాశము గలదు. రాష్ట్రకూట ముమ్మడి కృష్ణనరపతియొక్క రామేశ్వరశిలాశాసనమున నిట్లు చెప్పియున్నది:

తస్మిన్ సాహసతుంగనామ్ని నృపతౌ
స్వస్సున్దరీప్రార్థితే
యాతే యాని దివం దివాకరసమం
వేశ్యేవ లక్ష్మీ స్తతః
త త్రాతాప భుజద్వయేన నిబిడం
సాశ్లిష్య రమ్యై ర్గుణైః
ప్రీత్యా ప్రాణసమం చిరం రమయతి
శ్రీకృష్ణరాజాధిపం. 5

ఇందువలన సాహసతుంగనృపాలుడు, అనగా దంతిదుర్గుడు స్వర్గస్త్రీలచే ప్రార్థితుడై వసితనమునకే దిసంగతు డాయె నని తెలియుచున్నది. రణనిహతులైన వారి పొందును స్వర్గస్త్రీ లర్థించుట సుప్రసిద్ధమైన విషయము. కావున, రామేశ్వరశిలాశాసనసాక్ష్యము విశ్వసనీయమేని, దంతిదుర్గుడు యౌవనవంతుడై యుండగనే యుద్ధమున మడిసి వీరస్వర్గమును బొందె నని చెప్పవలసియున్నది. అతని మరణానంతరము రాష్ట్రకూటరాజ్యలక్ష్మి చాళుక్యుడగు రాహప్పను హస్తగత

---

3. ఎపి. ఇండి. సం. 3, పుట ౧౦౭ ఆ.

4. ఎపి. ఇండి. సం. ౧౪ పుటలు, ౧౨౧-౩౦

5. సౌ. ఇన్. ఇన్. సం.౫, భా.౧, నెం.౪౭.

యగుటచేత, దంతిదుర్గుడు చాళుక్యులతోడి పోరునందు మృతినొందెనని తోచుచున్నది.[6]

పై చర్చవలన వేములవాడ చాళుక్యవంశస్థాపకుడైన వినయాదిత్యయుద్ధమల్లుని కాలమున రాష్ట్రకూటుల యధికారమును గూలద్రోయునంతటి శక్తి సామర్థ్యములు గల రాహప్ప యను చాళుక్యవీరుడొకడుండెనని తెలుచున్నది. ఈ రాహప్పయే కొల్లిపఱశాసనములోని వినయాదిత్య యుద్ధమల్లుడు కాగూడదా యను శంక యొకటి కలుగవచ్చును. రాహప్ప యనునది యతని వాస్తవమైన పేరును, వినయాదిత్య యుద్ధమల్లనామము లతని బిరుదులును గావచ్చును. కొల్లిపఱశాసనమునందు వర్ణింపబడిన వినయాదిత్య యుద్ధమల్లుని విజయము లన్నియు రాహప్పకును జెల్లచ్చును; కాని యీ సందర్భమున పరామర్శించదగిన యంశ మొకటి కలదు: ఈ రాహప్ప బాదామి చాళుక్యరాజులలో గడపటివాడైన ద్వితీయ కీర్తివర్మయో, లేక యువరాజ ఇమ్మడి గోవిందవల్లభునిచే బరాభూతుడైన వేంగీశ్వరుడగు విష్ణువర్ధనుడో కావలయుననువాదము ద్వితీయకీర్తివర్మ రాష్ట్రకూటులను జయించి మరల రాజ్యమును సంపాదించెననిగాని, యతనికి రాహప్పయని మారుపేరుండెననిగాని తలచుట కెట్టి యాధారము లేదు. రాష్ట్రకూటప్రథమ కృష్ణభూపాలుని కుమారుడును, యువరాజును నగు ఇమ్మడిగోవిందరాజు యొక్క వేంగీశ విష్ణువర్ధనుని జయించుటనిశ్చయమే. ఇతడు వేంగీమండలమును జయించినపిమ్మట కృష్ణామునీసంగమమున విజయస్కంధావారమునుండి యిచ్చిన అలాసు తామ్రశాసనమున "కోశదణ్డాత్మభూమిసమర్పణే నానతే వేంగీశే" యని చెప్పుకొనియున్నాడు.[7] ఇట్లు కోశదండాత్మభూములను యువరాజగోవిందరాజునకు సమర్పించిన వేంగీశుడు చాళుక్యుడు. కృష్ణరాజుచే నోటువడి పాలిధ్వజావలిని, రాజాధిరాజపరమేశ్వరపదమును గోలుపోయిన రాహప్ప ఇతడే యని రాష్ట్రకూటచరిత్రకారులగు డాక్టరు ఆల్టెకారనుచున్నారు.[7a] ఇది యొప్పదగని విషయము. వేంగిచాళుక్యులు తమ శాసనములయందు తాము మహారాజాధిరాజపరమేశ్వరభట్టారకుల మని చెప్పుకొనినను పాలిధ్వజము వీరి కుండెననుట కే యాధారమును లేదు. అది యాద్యమున ఉత్తరాపథచక్రవర్తుల సామ్రాజ్యచిహ్నము. క్రీ. శ. ౭ వ శతాబ్ద తృతీయపాదమున బాదామియందు చాళుక్యప్రథమ విక్రమాదిత్యుడు రాజ్యము సేయుచుండగా నతని కుమారుడైన వినయాదిత్యుడును, మనుమడైన విజయాదిత్యుడును నుత్తరదేశములపై దండెత్తిపోయి సకలోత్తరాధిపతి నొక్కని జయించి యాతని సార్వభౌమపదచిహ్నములైన గంగాయమునలను పాలిధ్వజములను గొని స్వదేశమునకు మగిడి వచ్చిరి.[8] అది మొదలివి బాదామి శాఖవారి సార్వభౌమచిహ్నము లైనవి. బాదామి చాళుక్యులకును, వారిని దొలగద్రోసి వారి సార్వభౌమపదము నాడించికొనిన రాష్ట్రకూటులకు దప్ప దక్షిణదేశము చేరిన యే వంశప్రభువులకును నీ పాలిధ్వజాది

6. రాష్ట్రకూటవంశపు గుజరాతుశాఖకు జెందిన కర్కసువర్ణవర్షుని బరోడా తామ్రపట్టికలందలి (ఇండి. ఆంటి. సం. ౧౨, పుట ౧౫౯)—

ధర్మాత్మన స్తస్య నృపస్య జజ్ఞే
సుత స్సుధర్మా ఖలు కృష్ణరాజః,
యో వంశ్య మున్మూల్య విమార్గభాజం
రాజ్యం స్వయం గోత్రహితాయ చక్రే.

అను శ్లోకము నాధారపఱచుకొని కొందరు బరోడ శాసనమున వంశ్యుడే రాహప్పయని వాదించుచున్నారు. (ఇండి. ఆంటి. సం ౧౨, పుట ౧౬౨.) కాని వీరి వాదమంగీకార్యము గాదు. ఏలనగా: లభ్యమైన శాసనసాక్ష్యమునుబట్టి చూడగా రాహప్ప రాష్ట్రకూటు డని చెప్పుట కెట్టి యాధారమును లేదు; చాళుక్యుడనుటయే యొక్కువ సమంజసమని తోచుచున్నది. కావున వంశ్యునికి రాహప్పతో నైక్యము గల్పించుట సరకాదు. వారు భిన్నపురుషులని తలచుటయే యుక్తము.

7. ఎపి. ఇండి. సం. ౬, పుట ౨౧౧

7-a. రాష్ట్రకూటులు-వారికాలము, పుట 43.

8. ఎపి. ఇండి. సం. ౫, పుట ౨౦౪.

చిహ్నములు లేవు. 9 కావున యువరాజ గోవింద రాజున కోడి తన సర్వస్వము నిచ్చి యతనికి సఖుడైన వేంగీశుడు రాహప్ప కాజాలడు. రాజాధిరాజపరమేశ్వరుడును, పాలికేతనుడును నగుటచే రాహప్ప బాదామి చాళుక్యవంశజు డని నిశ్చయముగ జెప్పవచ్చును.

ఇక నీ రాహప్పయు, లేములవాడచాళుక్యుల వంశకర్తయగు వినయాదిత్యయుద్ధమల్లుడును నేకపురుషు లగుదురేమో విచారింతము. కొల్లిపఱశాసనములోని వంశావళి మిక్కిలియు సంశయగ్రస్త మగుటచేత దాని నాధారపఱచుకొని వినయాదిత్యయుద్ధమల్లునికి బాదామి చాళుక్యవంశముతో సంబంధము గల్పించుట యుక్తము గాదు. వాదమునకై యతడు బాదామిశాఖకు జెందినవాడని యొప్పుకొనినను నతనికిగాని, యతని సంతతి వారికిగాని పాలిధ్వజ ముండె ననుట కే యాధారమును లేదు. కావున రాహప్పయు, వినయాదిత్యయుద్ధమల్లుడును సమకాలికులే యైనను వారు భిన్నపురుషు లని చెప్పవలసియున్నది.

ఇంతదనుక కొల్లిపఱతామ్రపట్టికలయందు వర్ణింపబడిన వినయాదిత్యయుద్ధమల్లుని విజయాదులు సత్యాత్మకము లను దృష్టితో బరికించితిమి. కాని వీని యాథార్థ్యమును ఋజువుసేయగల సాధనాంతరము లిప్పటివఱకెవ్వియు గానరాలేదు. ఇతని సంతతివారి శాసనములలో నితని పరాక్రమాతిశయాదులు ప్రశంసింపబడియున్నను, నితడు విశ్వరా టనిగాని, సాగరవేలాపరివేష్టితసకల ధరామండలాధిపతి యనిగాని, తురుష్క యవన బర్బర కాశ్మీర కాంభోజ మగధ మాళవ కళింగ గంగ పల్లవ పాండ్య కేరళ ప్రభృతి ససంభ్రమ సమర్చితపాదపీఠు డని గాని చెప్పియుండలేదు. వానిలోని విషయమును బట్టి చూడగా నితడొక చిన్నరా జని తోచుచున్నది. ఇతని సంతతివారి శాసనములలో నెల్ల ప్రాచీనతమమైన లేములవాడ శిలాశాసనమున నీ వినయాదిత్యయుద్ధమల్లుడు అనన్యశాస్యమగు సపాదలక్షదేశమును పాలించె ననియు, బోదనపురమున నూనెచే నిండిన కొలకున౦ దేనుగులను దాన మాడించె ననియు, జిత్రకూట మను దుర్గమును సాధించె ననియు జెప్పియున్నది. పంపకవి తన విక్రమార్జునవిజయపీఠిక యందు చిత్రకూటమువూట యెత్తక తక్కిన యంశములను రెండింటిని పేర్కొనియున్నాడు. పరభణి తామ్రశాసనమునందుగూడ చిత్రకూటప్రస్తావన లేదు. విక్రమార్జునవిజయము లేములవాడ శిలాశాసనమునకు సమకాలికకావ్య మైనను చిత్రకూటవిజయమును బ్రస్తావించకపోవుటకు గారణము దెలియదు; కాని యీ మూడును చరిత్రాంశము లని మనము విశ్వసింపవచ్చును.

మొట్టమొదట పరామర్శించదగినది సపాదలక్ష విషయము. శాసనములందలి వరుసను బట్టి చూడగా నిదియే వినయాదిత్యయుద్ధమల్లుని ప్రథమకార్యకృత్యమని తోచుచున్నది. సపాదలక్షదేశ మెచట నుండెనో లేములవాడ పరభణిశాసనములవల్లగాని, పంపని విక్రమార్జునవిజయమువల్లగాని తెలియవచ్చుటలేదు. పాల్కురికి సోముని పండితారాధ్యచరిత్రయందు సపాదలక్ష ప్రస్తావము గలదు:

లక్షింపగ సపాదలక్ష నేపాళ
మీక్షింపగ సపాదలక్ష కేదార
మీక్షింపగ సపాదలక్ష తీర్కాద్రి
లక్షింపగ సపాదలక్ష కాశ్మీర
మీక్షింపగ సపాదలక్ష కన్నోజ
మీక్షింపగ సపాదలక్ష గొంకణము
లక్షింపగ సపాదలక్ష కళింగ. 10

ఈ ద్విపదలయందు 'సపాదలక్ష' దేశపైశాల్యమును సూచించు పదముగ బ్రయోగింపబడియున్నది.

---

9. పూర్వచాళుక్యవంశజుడైన గుణగవిజయాదిత్యుని సాతలూరుతామ్రశాసనమున (భారతి. సం ౧, సం ౧, పుట ౧౦౫) "ద్వారి ప్రతిష్ఠాపితగంగా యమునాచంద్రాదిత్యపాలికేతనసమధిగతపఞ్చమహాశబ్ద శ్రవణమిత్రానీకచతురాశాచక్రో వరాహలాఞ్ఛనవీర మకరధ్వజః" అని యున్నది. ఇందు పేర్కొనబడిన గంగాయమునాపాలిధ్వజాదు లతనికి గులక్రమాగతములు గావు. రాష్ట్రకూట ఇమ్మడి కృష్ణరాజును యుద్ధమున నోడించి యతనికడ గొన్నవి.

10. పండితారాధ్యచరిత్రము, పర్వతప్రకరణము. (ఆం. ప్ర. ౨ భా.) పుట ౪౫.

మఱియు 'సపాదలక్ష' గ్రామములు గల దేశ మొక్కటి కా దనియు, నట్టివి నేపాళకేదారాదులు పెక్కు గల వనియు దెల్లమగుచున్నది. కాని వేములవాడ పరభణి శాసనములందును, పంపని విక్రమార్జునవిజయమందును చేర్కొనబడిన 'సపాదలక్ష' కేవలదేశాంతర్గతగ్రామ సంఖ్యను దెల్పు పదము గాదనియు, నది ప్రత్యేక మొకానొక దేశమున కంకితనామ మనియు దోచుచున్నది. ఈ దేశమును గూర్చిన ప్రశంస కాదాచిత్కముగ సంస్కృతవాఙ్మయమునందును, నుత్తరహిందూస్థానమందలి మధ్యయుగశాసనములయందును గానవచ్చుచున్నది. ఆధునికగ్రంథములయందును సపాదలక్షదేశనిర్దేశమును గురించిన చర్చలచటనచట గలవు. 'అశ్మన్త దేశ్యవిహాయ యాహి' యను సోమదేవసూరియశస్తిలకచంపూవాక్యమునకు వ్యాఖ్యాత 'అశ్మన్తకసపాదలక్షపర్వతవాసిన్' అని యర్థము వ్రాసియున్నాడు. 11 మఱియు క్రీ. శ. ౧౧౫౦ నాటి చాళుక్యవంశజుడగు గూర్జరకుమారపాలుని చితోడ్‌గడశాసనమున 12,—

మహీభృన్నికుంజేషు శాకంభరీశః
ప్రియాపుత్రలోకేన శాకంభరీశః,
అపి ప్రాప్తశత్రు ర్భయా త్కంప్రభూతః
స్థితా యస్య మత్తేభవాజిప్రభూతః.
సపాదలక్ష మామర్ద్య నమ్రీకృతభయానకః,
స్వయ మాయా న్మహీనాథో గ్రామే శాలిపురాభిధే.
సన్నివేశ్య శిబిరం పృథు తత్ర
  త్రాసితాసహనభూపతిచక్రం,
చిత్రకూటగిరిపుష్కలశోభాం
  ద్రష్టు మారనృపతిః కుతుకేన

భగవాన్‌లాల్ ఇంద్రాజిగారు, కాంగ్రా మొదలు నైనితాలువఱకు వ్యాపించియుండు సివాలిక్ పర్వతమునకు సంస్కృతమున 'సపాదలక్షపర్వత'మని పే రనియు, సపాదలక్షాధిపతు లని పేరువడసిన శాకంభరీ చాహమానప్రభువుల కా పే రాద్యమున సపాదలక్షపర్వతప్రాంత నివాసులైయుండిన కారణమున వచ్చె ననియు, దరువాత వారు వలసవచ్చి తూర్పురాజపుత్రస్థానమున నుండు శాకంభరీప్రాంతమున నివాసము లేర్పఱచుకొని యచట నెలకొనుటచే నా ప్రాంతమునకు సపాదలక్షదేశ మని పేరు వచ్చె ననియు వ్రాసియున్నారు. 13 వీరి యభిప్రాయమునే నందోలాల్ దేగారు తమ భూగోళకోశ మను గ్రంథమున నిట్లు సంగ్రహముగ ననువదించియున్నారు: "సపాదలక్షకు సవాలక్ అపభ్రంశరూపము. సవాలక్‌నకు సివాలిక్ అపభ్రంశరూపము. సపాదలక్ష, శాకంభరీ తూర్పు రాజస్థానములోని యిప్పటి సంభర్." 14 సపాదలక్ష (సివాలిక్) పర్వతప్రాంతవాసులగు చాహమానరాజపుత్రులచటికి వచ్చి నెలకొనుటచే శాకంభరీపరిసరప్రదేశమునకు సపాదలక్షదేశ మని పేరు వచ్చె నను భగవాన్ లాల్ గారి సిద్ధాంత మెంతవఱకు సత్యమో తెలియదు. కాని శాకంభరీప్రభువులు సపాదలక్షీయు లనియు, వారి యేలుబడిక్రింది దేశము సపాదలక్షదేశ మని పిలువబడుచుండె ననియు దృఢముగ జెప్పవచ్చును.

తూర్పురాజస్థానమందలి ఇప్పటి సంభార్ ప్రాంతదేశమే మధ్యయుగమునందలి సపాదలక్ష యని నిశ్చయ మైనది గదా. ఇక దాక్షిణాత్యుడగు వినయాదిత్యయుద్ధమల్లు డా దేశముపై నాధిపత్య మెట్లు సంపాదించగల్గెనో విచారించవలసియున్నది. ఈ విషయమును నిర్ధారించి చెప్పుటకు దగిన యాధారము లెవ్వియు గానరావు. వినయాదిత్య - యుద్ధమల్లుడు సామాన్యుడైన చిన్న రాజని ఇంతకుముందే వివరించియున్నాడను. ఇట్టివాడు జిగీషామనీషచే స్వయము దండెత్తిపోయి నిజబాహుబలపరాక్రమముచే ననన్యశాసితమైన సపాదలక్షదేశము నాక్రమించుకొనె ననుట యంతగ నమ్మదగిన విషయము గాదు. తనకంటె బలవత్తరుడైన యధిపతి నెవ్వనినేనియు గూడి దండువోయి యతని పక్షమున నిత డా దేశమును జయించి శాసించె నని తలచుట యుక్తము. ఈ వినయాదిత్యయుద్ధమల్లుని కుమారుడగు మొదటి యరికేసరి కాలమునుండియు గడపటివాడగు ముమ్మడి

11. కావ్యమాల ౭౦, పుట ౧౯౭.

12. ఎపి. ఇండి. సంపు. ౨., పుట ౪౨౧ త.

13. బాంబేగజట్టీరు, సం ౧. భా. ౧. పుట ౧౫౭, పు. ౧౫౮ అధోజ్ఞాపిక.

14. భూగోళకోశము, పుట ౧౭౮.

యరికేసరి వంటివారు నితని సంతతివా రందఱును రాష్ట్రకూటచక్రవర్తులకు సామంతులై వారి నాశ్రయించి యుండిరి. వారివలెనే ఇతడును రాష్ట్రకూటసామంతుడై యుండి యుండవచ్చు నని తలచుటయం దసహజ మేమియు లేదు. ఈ యూహ యసమంజసము గాదేని, ఇతని కధిపుడై యుత్తరదేశముపై దండెత్తిపోయిన రాష్ట్రకూటచక్రవర్తి యెవ్వడో కనుగొనవలసి యున్నది. వినయాదిత్యయుద్ధమల్లునికి సమకాలికు లని యెన్నదగినరాష్ట్రకూటచక్రవర్తు లిరువురు గలరు. రాష్ట్రకూటసామ్రాజ్యస్థాపకుడైన దంతిదుర్గుడు మొదటివాడు. ఇతనిపిమ్మట సామ్రాజ్యపీఠము నెక్కిన యితని పినతండ్రియైన ప్రథమకృష్ణరాజు రెండవవాడు. వీరిద్దఱిలోను కృష్ణరా జుత్తరాపథముపై దండెత్తిపోయిన ట్లెచ్చటను జెప్పియుండలేదు; కావున నితని గూర్చి వినయాదిత్యయుద్ధమల్లుడు సపాదలక్షను జయించె నని తలచుటకు వీలులేదు. దంతిదుర్గ డీడులేని జోదు; పేరందిన దళనాయకుడు. ఇతడు యౌవనముననే వీరస్వర్గమును బొందినను, జీవదశయం దుండిన యల్పకాలములోను చాళుక్యుల యధికారమును గూలద్రోసి వారికడనుండి దక్షిణాపథసామ్రాజ్యమును నాచికొనెను; అంతట దృష్టినందక దిగ్విజయార్థమై యుత్తరహిందూస్థానముపై దండెత్తి పోయి, పెక్కు దేశములను జయించెను. ఇతని విజయములు యెల్లోరాలోని దశావతారగుహయం దితడు జెక్కించిన శిలాశాసనమున నిట్లు వర్ణింపబడియున్నవి :

"దణ్డేనైవ జిగాయ వల్లభబలం
యస్సన్ధుభూపాధిపం
కాఞ్చీశం సకలింగకోసలపతిం
శ్రీశైలదేశేశ్వరం,
శేషా న్మాలవ లాట టంక నృపతీ
నన్యాంశ్చ నీత్వా వశం
యశ్శ్రీవల్లభతా మవాప చరణం
న్యస్య ద్విషాం మస్తకే. 15

దంతిదుర్గుడు జయించినట్లు పై శ్లోకమున జెప్పబడిన రాజులలో నీ సందర్భమున ముఖ్యముగ గమనించవలసినవారు మువ్వురు. మొదటివాడు సంధుభూపాలుడు. 'సంధు' అను పేరు గల దేశ మన్యత్ర యెచటను జేర్కొనబడియుండలేదు. పొరబాటుచే 'సింధు' అను మాట కిది బదులుగ జెక్కబడిన దని రాష్ట్రకూటచరిత్రకారులగు డాక్టరు అల్టెకా రభిప్రాయపడియున్నారు. 16 సింధుదేశమును తాజికు లీకాలమున నాక్రమించుకొని యుండిరి. అపుడపుడు పశ్చిమసముద్రతీరదేశములపై నెత్తిచ్చి దేవాలయములను నాశము గావించి గ్రామములను, పట్టణములను దోచుకొని పోవువారు. కావున దంతిదుర్గుడు వారిపై దండెత్తి పోయి జయించి యుండవచ్చును. రెండవవాడు టంకనృపతి. టంకదేశ మెచ్చట నుండెనో యెవ్వరును గుర్తించలేదు; ఇది ప్రస్తుత రాజపుత్రస్థానములోని 'టొంకు' కావచ్చును. మూడవవాడు మాలవాధిపతి. ఆకాలమున మాలవదేశము గూర్జరప్రతీహారుల యధికారముక్రింద నుండెను. గూర్జరులు హిమాలయపర్వతములోని పశ్చిమోత్తరకనుమలగుండ హిందూదేశమున జొచ్చి యచట స్థిరనివాసముల నేర్పఱచుకొనిన యన్యదేశీయు లని కొందఱి యభిప్రాయము. పంజాబున కొంతకాల ముండి తరువాత రాజపుత్రస్థానముగుండ పశ్చిమసముద్రతీరమునందలి సురాష్ట్రము నాక్రమించుకొనిరి. మాళవదేశము నెప్పుడు గూర్జరప్రతీహారులు జయించి స్వాధీనము జేసికొనిరో తెలియదు. క్రీ. శ. ౭౫౮ లోనో, మరుసటి సంవత్సరముననో మృతినందిన దంతిదుర్గుడా దేశముపై నెత్తిపోవునప్పటికే గూర్జరు లుజ్జయినియందు రాజ్యము సల్పుచుండినందుచే వా రాప్రాంతము నంతకుముందే స్వాధీనపఱచుకొనిరని తెల్లమగుచున్నది. ప్రతీహారులలో నాల్గవ రాజైన ప్రథమనాగభటుడే మాళవమును సాధించి యచట గూర్జరుల యధికారమును మొదట నెలకొల్పె నని తోచుచున్నది. ఇతడు పరాక్రమశాలి. సింధుదేశము నాక్రమించుకొని యచటి

15. ఆర్కి. స. ఆ. వెస్టరన్ ఇండియా. సం. ౫, పుట ౮౭.

16. రాష్ట్రకూటులు-వారికాలము. పుట ౩౫, అధోజ్ఞాపిక. ౧౩.

నుండి మాటిమాటికిని పశ్చిమసముద్రతీరదేశములపై దండు వెడలుచు మిక్కిలియు నలజడిపెట్టుచుండిన అరబ్బులను యుద్ధమున నోడించి వారి సంరంభమును జాలవఱకు దగ్గించెను. 17 ఇతని స్థిరరాజధాని రాజపుత్రస్థానములోని మేడన్తపురమైనను 18 దక్షిణమున నితని యధికారము భృగుకచ్ఛదేశమువఱకు వ్యాపించియుండెను. ఈ నాగభటుని, లేక నాగావలోకుని ప్రవర్ధమానవిజయరాజ్యమునందు విక్రమకాలము ౮౧౩ న కు సరియైన క్రీ. శ. ౭౫౬ న వ్రాయించిన హాన్సోట్ శాసనమున భృగుకచ్ఛాధిపుడును, చాహమానవంశజుడైన భ్రాతృవృద్ధుడు దా నీతనికి సామంతుడ నని చెప్పకొని యున్నాడు.19 దంతిదుర్గుడు మాళవదేశముపై నేల యెత్తిపోయెనో తెలియదు. సామ్రాజ్యకాంక్షయే దీనికి బ్రధానకారణమై యుండవచ్చును. కాని దశావతార దేవాలయశాసనమునుబట్టిచూడగా శత్రుపీడితుడైన రా జెవ్వరో దన్నాశ్రయింపగా నాతని కాపాడుటకు దంతిదుర్గుడీ దండయాత్రనుసాగించె నని తోచుచున్నది.

దేవం......నవరపరికరం
భీమసేనానుయాతం
ప్రహ్వై రూర్జ్యైర్నరేన్ద్రైర్వృందైః పరివృత మభయై
రుగ్రసేనో జితారిః
వ్యాప ద్యుద్ధర్తు మేకం ప్రసభపరకరి
ధ్వంసనసంస్కారదక్షో
బీభత్సు ర్దుష్టనాగో జయినమిక పరం
శ్రీమహారాజశర్వః.
దత్తా యే నోజ్జయిన్యా మపి నృపతిమహా
దానమాశ్చర్యభూతం
న్యాయ్యం సంచిన్త్య దీప్తద్యుతిబహుకనకం
రత్నముక్తావతంసం,

మాణిక్యాకీర్ణ మన్యం దివస మవిరత
తృప్తదీనార్థిసార్థం
కర్తుం క్రీడా మపూర్వా మపరనృపతిభిః
స్వప్నకాలే ప్యనాయ్యామ్.

* * *

య స్యాఖణ్డితవిక్రమస్య కటకే
నాక్రమ్య తీరక్షితిం
సాధేఽస్మిన్ కృతగూర్జరేన్ద్రరుచితే
రమ్యే...తై ర్ప్రస్తుమః,
స్నాన్తీభి...తాఙ్గరాగసురభి
ప్రోత్కంపపద్మాకరం
ధారిత్ర్యమపి పుష్కరే ష్వపి......
...నాభి శ్చిరం. 20

పై శాసనశ్లోకములు మూడునుసంపూర్ణములు గాక గ్రంథపాతములవలన యతిగోలుగ నుండుటచేత వాని యర్థము చక్కగ బోధపడుటలేదు; కాని వాని యందలి భావము స్పష్టముగనే తెలియవచ్చుచున్నది. మొదటి శ్లోకమునందు ఉగ్రమైన సేన గలవాడును, జితారియు, ప్రసభపరకరిధ్వంసనసంస్కారదక్షుడును, బీభత్సుడును, దుష్టనాగుడును నైన శ్రీమహారాజశర్వుడు (దంతిదుర్గుడు) అభయులును, భక్తియుక్తులును నైన రాజేన్ద్రబృందముచే జుట్టబడినవానిని, శ్రేష్ఠమైన పరివారజనులతో గూడినవానిని, భీమసైన్యానుయాతుని, దేవుని, మఱియొక యుధిష్ఠిరుని (జయుని) బోలి యాపదనుండి యుద్ధరించుటకు యేమో చేసె నని (క్రియాపదముమాసిపోయినది) చెప్పియున్నది. రెండవ దానియందు ఈ రాజు (దంతిదుర్గుడు) ఉజ్జయిని యందేదో యాశ్చర్యభూతమైన మహాదానము నొకదాని జేసెనని యున్నది. ఈ దానవిషయమైన ప్రస్తావన మొదటి యమోఘవర్షుని సంజన్ తామ్రపట్టికలయందును గలదు.

హిరణ్యగర్భం రాజన్యై
రుజ్జయిన్యాం య దాసితమ్
ప్రతీహారీకృతం యేన
గూర్జరేశాదిరాజకమ్. 21

---

17. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౧౦౭, ౧౧౦-౧౧.
18. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౯౫.
19. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౧౯౭.
20. ఆ. స. వె. ఇం. సం. ౫, పుట ౮౭.
21. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౨౪౩.

దీనివలన దంతిదుర్గుడు ఉజ్జయినియందు 'హిరణ్యగర్భ' దానమును జేసె ననియు, నప్పు డతనిచే గూర్జరేశాదిరాజులు ప్రతీహారులుగ సేయబడి రనియు దెలియుచున్నది. మఱియు మూడవశ్లోకమునందు ఇతడు స్వసైన్యముచే (సముద్ర)తీరక్షితి నాక్రమించుకొని యచట గూర్జరేంద్రునిచే నిర్మితమైన సౌధమునం దొక కొలనియందు స్నాన మాడె నని చెప్పియున్నది.

మొదటిశ్లోకమున బేర్కొనబడిన దేవు డెవ్వడో, యతనికి వచ్చిన యాపద యెట్టిదో, దంతిదుర్గు డాతని నుద్ధరించుట కేల పూనుకొనెనో నిర్ధారించుటకు సాధ్యము గాదు. ఈ శ్లోకము నాధారపఱచుకొనియే కాబోలు డాక్టరు ఆల్టెకారుగారు దమ రాష్ట్రకూటుల చరిత్రయం దిట్లు వ్రాసియున్నారు: "(చాళుక్య) కీర్తివర్మను మొదటి తడవ యోడించినపిమ్మట గొంత కాలమునకు, దంతిదుర్గు డుజ్జయినీపాలకుడైన గూర్జర ప్రతీహారవంశజుడైన దేవరాజునకు సహాయమొనర్చుటకో, లేక యాతని (దేవరాజు) ప్రతిస్పర్ధి శాఖాంతరదాయాదియగు భిన్మాలు ప్రభువగు సిలూకనిచే నతడందిన పరాజయమువల్ల లాభమునంద దలచియో యుజ్జయిని మీద దండువెట్టిన ట్లున్నది".[22] దంతిదుర్గుని మాళవదండయాత్రయపు డచట నొక దేవుడు లేక దేవరా జనునతడు రాజ్యము సేయుచుండినది నిశ్చయము. కాని యతడు గూర్జరప్రతీహారవంశజు డనుట సంశయాస్పదము. గూర్జర ప్రతిహారవంశమున శాఖాంతరమునకు జెందిన భిన్మాలుప్రభువగు సిలూకనిచే నోడింపబడిన దేవరాజితడే యనుట యొప్పదగని విషయము. ఆల్టెకారుచే బేర్కొనబడిన దేవరాజు కన్నోజిగూర్జర ప్రతీహారవంశమునకు మూలపురుషుడైన ప్రథమనాగభటుని యన్నకు రెండవ కుమారుడు. క్రీ.శ. ౭౮౩-౪ ప్రాంతమున నవంతి (ఉజ్జయిని) యందు రాజ్యము సేయుచుండిన వత్సరాజుయొక్క తండ్రి.[23] ప్రథమనాగభటుని విజయరాజ్యము విక్రమకాలము ౮౧౩ అనగా క్రీ.శ. ౭౫౬ నం దింకను బ్రవర్ధమానముగ సాగుచుండెను. కావున దేవరాజుయొక్క ప్రభుత్వము క్రీ.శ. ౭౫౬-౭౮౩ల మధ్య నెప్పుడో ప్రారంభమై యుండవలయును. ఇకదంతిదుర్గుడు క్రీ.శ. ౭౫౬ లోనో, యా మరుసటిసంవత్సరముననో మృతి నందెననుట నిశ్చయము. అతని మరణానంతరము అతని పినతండ్రియైన మొదటి యకాలవర్షకృష్ణరాజు సామ్రాజ్యపీఠము నధిష్ఠించె నని క్రీ.శ. ౭౫౭ నాటి యతని భారత ఇతిహాససంశోధకమండలిపట్టికలయందు చెప్పియుండుటచే నత డంతకుపూర్వమే కాలగతి నందె ననుటకు సంశయము లేదు.[24] కావున దంతిదుర్గుని మాళవదండయాత్రయు, గూర్జరవిజయమును క్రీ.శ. ౭౫౬ నకు బూర్వమే నడచియుండవలయును. కావున నాగభటుని యన్నకొడుకగు దేవరాజే దశావతారదేవాలయశాసనమందలి 'దేవుడు' కాజాలడు; కాని ప్రథమనాగభటుడు రాజ్యము సేయుచుండగనే యతని యన్నకొడుకగు దే:రాజు మాళవదేశముపై నేలుచుండి పినతండ్రిపై దిగుగుబాటు చేసియుండవచ్చును; అతనిచే నిర్జితుడై దేవరాజు దంతిదుర్గుని సహాయ మపేక్షించగా దంతిదుర్గుడు మాళవదేశముపై నెత్తిపోయి యుండవచ్చును అను వాద మొకటి బయలుదెడలవచ్చును. ఇం దసంగత మేమియు లేదు. కాని, ఇది కేవలము ఊహయే. దీని నిరూపించుటకు దగిన యాధారము లేదు. అట్టి యాధారములభించువఱకును నీ దేవరాజును, యెల్లూర దశావతారదేవాలయశిలాశాసనమున బేర్కొనబడిన 'దేవు'డును భిన్నపురుషు లని తలచుట యుక్తము.

రెండవ శ్లోకమువలన దంతిదుర్గునికి విజయము చేకూడె ననియు, మాళవరాజధానియగు నుజ్జయిని యతనికి హస్తగత మాయె ననియు స్పష్టమగుచున్నది. మొదటి యమోఘవర్షుని సంజకాపట్టికల సాక్ష్య మంగీకార్యమేని, దంతిదుర్గుని ప్రతిపక్షులలో ప్రముఖుడు గూర్జరేశ్వరు డనియు, నతని నిర్జించుటవల్లనే మాళవదేశము రాష్ట్రకూటులకు వశమాయె ననియు దోచుచున్నది. మూడవ శ్లోకమువల్ల దంతిదుర్గుడు మాళవ

22. రాష్ట్రకూటులు-వారికాలము, పుటలు, ౩౯-౪౦.

23. ఎపి. ఇండి. సం. ౬, పు. ౧౯౫ త.

24. భారత ఇతిహాస సంశోధకమండలి. సం. ౭, పుట ౧౬౫.

మును సాధించిన పిమ్మట దండుతో గదలిపోయి తీర క్షితిని స్వాధీనపఱచుకొనె నని తెలియుచున్నది. తీరక్షితి యన సముద్రతీరదేశము. ఈ తీరదేశము గూర్జరేశుని యాధిపత్యముక్రింద నుండెను. "సాధి ఒస్మిన్ కృతగూర్జరేన్ద్రిరచితే" యను శాసనవాక్యము రుజువుసేయుచున్నది. మఱియు సౌరాష్ట్రిమందలి భృగుకచ్ఛ మప్పుడు గూర్జరప్రతీహారప్రథమనాగ భటుని యధికారముక్రింద నుండుటచేత దానికి పైభాగ మందలి తీరదేశమును,మాళవదేశమును గూడ నతని యేలు బడిక్రిందనే యుండె నను తలంపు గలుగుచున్నది.

పై చర్చవలన తేలిన సారాంశ మిది: వేముల వాడ చాళుక్యులకు మూలపురుషుడైన వినయాదిత్య-యుద్ధమల్లునకు సమకాలికులును,ప్రాయశః అధిపతులును ననదగిన రాష్ట్రకూట చక్రవర్తులగు దంతిదుర్గ ప్రథమ కృష్ణులలో రెండవవాడగు ప్రథమకృష్ణు డుత్తరదేశ ముపై దండెత్తిపోలేదు. కావున వినయాదిత్య యుద్ధ మల్లు డితనితో గలసి పోయి సపాదలక్షదేశమును జయించి యేలినా డనుట కవకాశము లేదు. మొదటి వాడైన దంతిదుర్గుడు దేవుడు, లేక దేవరా జనువానిని గాపాడుటకై గూర్జరప్రతీహారవంశజుడైన ప్రథమనాగ భటుని యుద్ధమున నోడించి యతని యాధిపత్యముక్రింద నుండిన మాళవమును,సౌరాష్ట్రిదితీరదేశము నాక్రమించు కొనియెను. ఈ నాగభటుని స్థిరరాజధాని రాజపుత్ర స్థానములోని మేడన్తకపురమని ప్రతీహారబావుకుని జోధపురశాసనమువల్ల దెలియుచున్నది. 25 ఈ మేడ న్తకపురము అజమీరునకు గించిత్పశ్చిమోత్తరమున నిరు వదియైదు మైళ్ళ దూరమునను, శాకంభరికి (సాంభరునకు) పశ్చిమమున నేబదిమైళ్ళ దూరమునను నుండు ఇప్పటి మెర్తాయే యని పరిశోధకులు గుర్తించియున్నారు.26 అజమీరు, శాకంభరులు రెండును ప్రాచీనసపాదలక్షకు జెందిన స్థలములు. తత్సమీపస్థమైన మేడన్తకపురము గూడ నా సపాదలక్షలోనిదే కావలయును. మేడన్తక పురము నాగభటుని రాజధాని యగుటచేత తత్పరిసరమున నుండిన సపాదలక్షదేశ మతని యేలుబడియందే యుండె నని తోచుచున్నది. క్రీ. శ. ౯౭౩ నాటి తన హర్ష శాసనమున శాకంభరీపాలకుడైన చాహమానవంశజుడగు రెండవ విగ్రహరాజు తన కారు తరములకు ముందటి వాడగు మొదటి గూవకుడు నాగావలోకుని సభయందు వీరప్రతిష్ఠను పొందె నని చెప్పియున్నాడు.

> ఆద్యః శ్రీగూవకాఖ్యః ప్రథితనరపతి
> శ్చాహమానాన్వయోఒభూత్
> శ్రీమన్నాగావలోకప్రవరనృపసభా
> లబ్ధవీరప్రతిష్ఠః. 27

దీనివలన నీ ప్రథమగూవకుడు నాగావలోకుని సామంతుడని తేలుచున్నది. ఇందు పేర్కొనబడిన నాగావలోకుడు క్రీ. శ. ౮౦౦ మొదలు ౮౩౩ వఱకును రాజ్యము చేసిన గూర్జర ప్రతీహారరెండవనాగభటు డని శాసనవిమర్శకు లభిప్రాయపడియున్నారు. మొదటి నాగభటుడైనను కావచ్చును. ఇది యెట్లున్నను సపాద లక్షపాలకులైన శాకంభరీచాహమానప్రభువులు గూర్జర ప్రతీహారచక్రవర్తులకు సామంతులై యుండిరని నిశ్చయ మగుచున్నది.శాసనాద్యాధార మెద్దియు లేకపోయినను, నాగభటుని యధికారముక్రింద నుండిన మాళవసౌరా ష్ట్రాది దేశములను దంతిదుర్గుడుజయించియుండుటచేతను, సపాదలక్షయొక్క దక్షిణపు సరిహద్దునం దుండిన టంక దేశాధీశుని బరాజితుని గావించి యుండుటచేతను, సపాదలక్షాంతర్గతమైన నాగభటుని స్థిరరాజధాని యైన మేడన్తకపురముపై దండెత్తిపోయియుండినను నుండ వచ్చును. కావున, వేములవాడచాళుక్యుల శాసనముల లోను, పంపని విక్రమార్జునవిజయమునందును జెప్పినట్లు వినయాదిత్యయుద్ధమల్లు డనన్యశాస్యమైన సపాదలక్ష దేశమును పాలించినది దంతిదుర్గుడా దేశమును జయిం చిన పిమ్మటనై యుండవలయును. వీరుడును, సమర్థు డును నగుటచే నితని దంతిదుర్గుడా దేశమునకు పాల కునిగ నియమించి యుండు నని తోచుచున్నది.

వినయాదిత్యయుద్ధమల్లుడు సపాదలక్షదేశమున నెంతకాల ముండెనో తెలియదు; అత డొనర్చిన రెండవ

---

25. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౮౩ త.

26. డిట్టో

27. ఎపి. ఇండి. సం. ౨, పుటలు ౧౨౧, ౧౨౬; ఇండి. ఆంటి. ౧౯౧౧, పుటలు ౨౩౯-౪౦.

ఘనకార్యము పోదనపురమున జరిగినది. ఇది యతని రాజధాని గాబోలు. పోదనపుర మిప్పటి హైదరాబాదు రాజ్యములోని నిజామాబాదుజిల్లాయందలి బోధను గ్రామమే కాని యన్యముగాదు .27 ఇసపాదలక్షను విడిచి యుత్తరాంధ్రదేశమందలి బోదనపురమున కితని యాగమనమునకు దంతిదుర్గుని మరణానంతరము రాష్ట్రకూట సామ్రాజ్యమున సంభవించిన రాజ్యవిప్లవమే కారణమని తోచెడిని. దంతిదుర్గుడు చాళుక్యులతో సైనయుద్ధమున క్రీ.శ. ౭౫౬ నందో, లేక మరుసటి సంవత్సరముననో నిహతుడైయుండవలయునని ఇంతకుముందు సూచింపబడియున్నది. క్రీ.శ. ౭౫౮లో నతని పినతండ్రియైన ప్రథమ కృష్ణభూపాలుడు రాజ్యాభిషిక్తుడైన ట్లతని భారత ఇతిహాసంశోధకమండలి తామ్రపట్టికలవలన దెలియవచ్చుచున్నను దరువాత యేడేండ్ల అతను నొక్కటియైన నతని శాసన మెచ్చటను గానరాకపోవుటచే రాజ్యారంభదశయందితని యధికారము నిర్వక్రముగ సాగలే దని తోచుచున్నది. 28 ఒకప్రక్క రాహప్పయాధిపత్యము క్రింద చాళుక్యులు విజృంభించి సామ్రాజ్యము నాక్రమించుకొనదొడగిరి. మఱియొకప్రక్క మొదటిగుజరాతు [రాష్ట్రకూటవంశ] శాఖను జెందిన దాయాద ఇమ్మడి కక్కరాజు తానే పరమభట్టారక రాజాధిరాజపరమేశ్వరుడనని ప్రకటించుకొనెను. 29 పథారీ స్తంభశాసనమునందు కర్ణాటకులను జయించి లాటదేశము నాక్రమించిన పరబలునియొక్క పితామహుడగు జేజ్జని యన్న ఈ యిమ్మడి కరకరాజే నని తలచెదను. 30 వీరు దెలియనిశత్రులు మరెందరుండిరో ! వీరిమధ్య రాష్ట్రకూట సామ్రాజ్యము బంధక తామ్రపట్టికల

జిత్వావికటకరిఘటా
ప్రభుతరకర్ణాటభటసహస్రాణి
[పృథు] లాటాఖ్యం రాష్ట్రం
లబ్ధం యస్యాగ్రజే నాజౌ.

జేజ్జని మనమడైన పరబలుడు క్రీ.శ. ౮౬౧ లో పథారీశిలాస్తంభశాసనమును నిల్పియుండుటచే, జేజ్జని యన్నయు, గుజరాతుశాఖవాడైన ఇమ్మడి కక్కరాజును నొక్కకాలమువారగుదు రేమో విచారించవలసియున్నది. పరబలుని తండ్రియైన కక్కరాజు నాగావలోకుని...లవన యను స్థలమున రణమున నోడించి వెనుకకు మరల్చి యతని దేశమును పాడుగావించెనట !

దుర్వారారాతిమత్త ద్విరద ఘటా
టోపసంఘట్టచణ్డే
సంగ్రామే హ్యాప్తయోధే తురగఖురరజ
శ్ఛన్నదిక్చక్రవాలే,
వల్గత్ప్రోలిధ్వజాళా క్షతరుధిరసరి
త్ప్రాజ్యసామన్తచక్రే
చక్రే నాగావలోకం ఝటితి
...లవనే యఃపరావృత్తమూర్తిమ్.
దుర్వారవైరివరవారణకుంభముక్త
ముక్తాఫలప్రకరనిర్మలదన్తమాలా,

---

27 a. "ఇది యొక తాలూకాకు ముఖ్యస్థలమైనను మిక్కిలి చిన్న పట్టణము; నిజామాబాదునకు పదునాల్గుమైళ్ళ దూరమున పశ్చిమమున నున్నది. రెంటికిని మధ్య చక్కని రోడ్డొకటి కలదు. కాని యిందెచట చూచిన ప్రాచీనజైన హిందూశిలాప్రతిమలు గానవచ్చుచున్నవి. ఉత్తరమునను, పూర్వదక్షిణదిశల యందును మూడు పెద్ద కొలకులు గలవు; పట్టణముచుట్టును ఘనమైన గోడలు గల పుట్టకోట యున్నది". హైదరాబాదు ఆర్కియలాజికల్ సీరీస్, నెం. ౭ పుట ౧. మఱియు శకాబ్దము ౯౭౮ నాటి యాహవమల్ల సోమేశ్వరుని శిలాశాసనమున "రాష్ట్రకూటాన్వయచక్రేశ్వరక ఇన్ద్రవల్లభం రాజధాని బోదనదోళ్ మాడిసిద ఇన్ద్రనారాయణదేవర దేవాయతనం" (పైదే. పుట ౮.) అని యుండుటచే నిది రాష్ట్రకూటయుగమున ప్రఖ్యాతినందిన స్థల మని తెల్లమగుచున్నది.

28. భార. ఇ. సం. మం. పత్రిక. సం. ౮. పుట ౧౬౫; ఎపి. ఇండి. సం. ౬. పుటలు ౧౬౦-౨.

29. రా. ఏ. సొ. ప. (బొంబాయి శాఖ) సం. ౧౬. పుటలు ౧౦౫ త.

30. ఎపి. ఇండి. సం. ౯, పు. ౨౫౨.

నాగావలోకనృపవేశ్మని విప్రకీర్ణ
యస్యోద్ధతం ప్రహసతీవ కృపాణపాలీ.

ఇందు పేర్కొనబడిన నాగావలోకుడు గూర్జర ప్రతిహారచక్రవర్తియగు నిమ్మడి నాగభటు డని శాసన విమర్శకుల యభిప్రాయము. ఇమ్మడి నాగభటుని యేలుబడి క్రీ.శ. ౮౩౩ తో సమాప్తి యగుటచే గక్కరాజతని నోడించి యాతని దేశమును పాడుగావించినది తత్పూర్వమై యుండవలయును. ఈ కక్కరాజునకు నాగావలోకుని జయించుటయేగాక యతని దేశమును పాడుచేయునంతటి బల మెట్లు కలిగెనో తెలియదు. ఈ సందర్భమున కనోజి చరిత్రకారులైన రామ శంకరత్రిపాఠిగారి యభిప్రాయము స్మరణీయము. "అతడు (పరబలుడు) చిరకాలము రాజ్యము జేసె నని తలంచితి మేని, యతని తండ్రియగు కక్కరాజు ముమ్మడి గోవిందునికి సమకాలీనుడును, సామంతుడును ననియు, తత్కారణమున నతనికి నాగభటునితోడి యుద్ధమున సాయ మొనర్చె ననియు జెప్పవచ్చును." (హిస్టరీ ఆఫ్ కనౌజ్, పుట ౨౩౧). త్రిపాఠిగారి యభిప్రాయము సమంజస మని తోచుచున్నది. ఇది యంగీకార్య మేని పరబలుని తండ్రియగు కక్కరాజు ముమ్మడి గోవిందరాజునకు కనోజిదండయాత్రయందు దోడ్పడె ననెడి యూహా కవకాశము గలుగుచున్నది. ముమ్మడి గోవిందరాజు కనోజిదండయాత్రకాల మాతని శాసనముల సాక్ష్యమువల్ల నిర్ధారించవచ్చును. క్రీ.శ. ౮౦౨ నాటి మణ్ణెతామ్రపట్టికలలో గూర్జరప్రతీహారులపైని విజయప్రస్తావన కలదు. (ఎపి. కర్ణా. సం. ౯. నెం ౬౧.)

'సర్వక్షేత్ర ముదీక్ష్య యం శరదృతుం
పర్జన్యవ ద్గూర్జరో
నష్టః క్వాపి భయాత్ తథాప సమరం
స్వప్నేపి పశ్యన్యథా.'

ఈ శాసనము కృత్రిమ మని కొందఱు. సత్యార్థకమైనను దీని నిచ్చినది శకము ౭౨౮ న కాదనియు, ౭౩౦ లోనో, ౭౩౧ లోనో యిచ్చియుండవలయుననియు మఱికొందఱు. (ఎపి. ఇండి. సం ౨౩. పుటలు ౨౯౩-౮). దానశాసనకాలము శకము ౭౨౮ గే ననియు క్తము (ఎపి. ఇండి. సం. ౨౬. పుట ౨౧౫). శాసనకాల విమర్శ కిక్కడ తావు లేదు. కాని శాసనోక్త దానకాలము శకము ౭౨౮ వాస్తవమైనదే. కృత్రిమ మని త్రోసివేయుటకు వీలులేదు. ఇందు విపులముగ వర్ణింపబడిన ముమ్మడి గోవిందరాజు విజయములన్నియును క్రీ. శ. ౮౦౪-౫ నాటి యతని నేసారి తామ్రశాసనమున సంగ్రహముగ సూచింపబడి యున్నవి. (సోర్సెస్ ఆఫ్ ది మిడీవల్ హిస్టరీ ఆఫ్ ఇండియా. సం. ౧. పుటలు ౧౫-౨౬.)

పాణ్డ్యదేశాధిపా న్మత్స్యం
వృషభం పల్లవేశ్వరాత్,
చోలా ద్వ్యాఘ్రం గజం గంగా
చ్చాపయష్టిం చ కేరళాత్.
ఆంధ్రచాలుక్యమార్యేభ్యో
వరాహం గూర్జరేశ్వరాత్,
.................
వృషభం పల్లవేశ్వరాత్ (?).
కోసలావన్తినాథాభ్యాం
సింహాలాదపి నా..........
ఇత్థ మేతా న్యథాఽన్యాని
చిహ్నాన్యాదాయ భూభుజాం.
గరుడాంకం జగత్తుంగా
ఖ్యాతతంసక.........

కావున మణ్ణెతామ్రశాసనమున జెప్పినట్లు శకము ౭౨౮, అనగా క్రీ. శ. ౮౦౭ నకు ముందే ముమ్మడి గోవిందరాజు గూర్జరయిమ్మడినాగభటుని జయించినా డనుటకు సంశయింప బనిలేదు. పరబలుని తండ్రియైన కక్కరాజును నాగభటు నోడించి యతని దేశమును పాడుగావించినది కూడ యప్పటిదై యుండవలయును.

ఇక పరబలుని తాతయగు బెజ్జుడును, నతని పేరు తెలియని యన్నయు దత్పూర్వమువారు కావలయును. ధ్రువనిరుపము డుత్తరదేశములపై దండెత్తిపోయినను అత డెచ్చటను పరాజయము నందడ నని తలచుట కే

యందు జెప్పినట్లు కలిజలధియందు ధరిత్రివలె మునిగి పోయెను 31. సామ్రాజ్యమున నిట్లు విప్లవము జనింపగా దూరమున నుత్తరాపథమున సామ్రాజ్యభారము వహించుచుండిన రాష్ట్రపాలకులెల్ల నిస్సహాయులై తాము పాలించుచుండిన స్థానములను వదలిపెట్టి స్వదేశమునకు దిరిగి రావలసినవారైరి. వినయాదిత్యయుద్ధమల్లుడును సపాద లక్షకు వీడికోలొసగి నిజస్థానమైన బోదనపురమునకు వచ్చిచేరెను.

వినయాదిత్యయుద్ధమల్లుని సాహసకార్యములలో నిక మిగిలి యుండునది చిత్రకూటదుర్గగ్రహణము. ఈ చిత్రకూట మెచ్చటిదో నిశ్చయించి చెప్పుటకు వీలు లేదు. ఈ పేరిటి సుప్రసిద్ధదుర్గములు రెండు మూడు గలవు. సపాదలక్షదేశమునం దొక చిత్రకూటదుర్గము గానవచ్చుచున్నది. మహమ్మదీయయుగరాజపుత్రస్థాన చరిత్రయందు ప్రఖ్యాతి నందిన చితోడ్గడ మిదియే. సపాదలక్షదేశమును వినయాదిత్యయుద్ధమల్లుడు పాలించి యుండుటచేత నతడు లగ్గలుపట్టిన చిత్రకూట మిదియే కావచ్చు ననునూహ కలుగవచ్చును. కాని శాసనగ్రంథమున నిది కడపట చేర్కొనబడియుండుటచే నిది దక్షిణాపథమునందలి దుర్గమే యని తోచుచున్నది. బుందేలు ఖండమున మఱియొక చిత్రకూటదుర్గము కలదు. ఇదియును బలిష్ఠమైన దుర్గమే. తరువాతి రాష్ట్రకూట ప్రభువు లీ దుర్గమునకై పలుమారు పోరి సాధించిరట్లు శాసనసాక్ష్యమువల్ల దెలియుచున్నది. వినయాదిత్యయుద్ధమల్లుడు సాధించినది ప్రాయశః ఈ చిత్రకూటమే కావచ్చును. అగునేని యత డీ దుర్గమును బ్రథమకృష్ణరాజు కాలమున జయించియుండవలయును.

౫

## మొదటి యరికేసరి

వినయాదిత్యయుద్ధమల్లు డెంతకాలము బ్రదికియుండెనో నిర్ధరించి చెప్పుటకు వీలులేదు. ఇతని యనంతర మితని పుత్త్రు డరికేసరి రాజ్యాభిషిక్తుడాయెను. ఇత డెప్పుడు సింహాసనాధిష్ఠుడైనదియు, నెంత కాలము రాజ్య మొనర్చినదియు, నెన్నడు గతించినదియు దెలియదు. ఒక సంగతిమాత్రము నిశ్చయముగ జెప్పవచ్చును. క్రీ.శ. ౭౮౦ మొదలు ౭౯౩ పర్యంతము సామ్రాజ్యపాలన మొనర్చిన రాష్ట్రకూట చక్రవర్తి ధ్రువనిరుపమదేవుని కితడు సామంతుడు. ఇతని గూర్చిన చరిత్రాంశ మొక్కటియే శాసనాదులవలన దెలియుచున్నది. వేములవాడ శిలాశాసనమున 'గృహీతాఖిలవేంగిదేశః పాలిస్మ' యనియు, పరభణి తామ్రశాసనమున 'సకలింగత్రయాం వేంగీం యో౽వతిస్మ పరాక్రమాత్' అనియు, విక్రమార్జునవిజయపీఠికయందు—

"నిరుపమదేవన రాజ్యదొ
ళరికేసరి వెంగివిషయమంత్రికళింగం
బెరసా త్తికొండు గవడాద
బరెయిసిదం పెసర నఖిళదిక్ప్రా త్తిగళోళ్."

అనియు జెప్పియుండుటచేత నీ యరికేసరి నిరుపమదేవుని రాజ్యమున వెంగిత్రికళింగదేశములను జయించె నని విశదపడుచున్నది. మఱియు విక్రమార్జున

---

కాశము లేదు. ఇమ్మడి గోవిందరాజు రాజ్యముచేసిన యల్పకాలమును నతనికి తమ్ముడైన ధ్రువునితోటి పోరాటమున సరిపోయినది. మొదటి కృష్ణభూపాలుడు స్వవంశ్యునితో (ఇండి. ఆంటి. సం. ౧౨, పుట ౧౫౯) యుద్ధముచేసి రాజ్యమునుగైకొనినట్లు శాసనములయందు జెప్పియుండుటచేత, కర్ణాటకసైన్యమును జయించి లాటదేశమును స్వాధీనపఱచుకొనిన శేజ్జని యన్నరే యతని ప్రత్యర్థియై యుండవలయును. శేజ్జని కుమారుడగు కరకుడు పై జెప్పినట్లు క్రీ. శ. ౮౧౨ ప్రాంతమున నుండియుండుటచేత శేజ్జడును, నతని యన్నయు క్రీ. శ. ౭౭౦ ప్రాంతముల నుండియుందు రనుటకు శంకింప బనిలేదు. మఱియు నీకాలముననే యాంత్రోలి చారోలిశాసనమువలన రాష్ట్రకూటవంశజుడగు నొక యిమ్మడి కరకరాజు పరమభట్టారక మహారాజాధిరాజ పరమేశ్వరబిరుదములతో లాటదేశము నేలుచుండుటచేతను ఆ పేరు లేని శేజ్జని యన్నరే యిమ్మడి కక్కరాజై యుండవచ్చు నన్న యూహ పొడముచున్నది.

31. ఎపి. ఇండి. సం. ౧౪, పుటలు ౧౫౧-౨౦.

విజయములోని 'వెంగివిషయమంత్రికళింగం' అను దానికి బదులు పరభణితామ్రశాసనమున "సకళింగత్రయాం వేంగీం" అనియు, వేములవాడ శిలాశాసనమున 'గృహీతాఖిలవేంగిదేశః' అనియు నుండుటచేత గొందఱు వితండించునట్లు 'త్రికలింగ' మొక యఖండ జనపదము గాదనియు, 'కలింగ' నామాంకితదేశత్రయ సమూహ మనియు, మఱియు వెంగియు కలింగత్రయమును జేరి యేకరాజ్యమై యుండెననియు దెల్లమగుచున్నది.

'నిరుపమదేవన రాజ్యదొళ్' అను పంపని వాక్యమువలన నరికేసరి నిరుపమదేవుని పక్షమున వెంగికళింగత్రయములను జయించె నని ద్యోతమగుచున్నది. నిరుపముడు వెంగికళింగములపై నరికేసరియాధిపత్యము క్రింద దండయాత్ర నంపుటకు గారణము లేకపోలేదు. వెంగికళింగముల కధిపతి పూర్వచాళుక్యుడు. రాష్ట్రకూటులకును, పూర్వచాళుక్యులకును ప్రథమకృష్ణరాజు కాలమునుండియు వైరము గలదు. ఇమ్మడి గోవిందరాజు యువరాజుగ నుండినపు డతడు వెంగిమండలమును జయించి వేంగీశ్వరుని సర్వస్వమును గొన్న విషయ మింతకుముందే స్మరింపబడినది. ఈ పూర్వవైరమునకు దోడు రాజ్యమునకై నిరుపమునకును, నతని యన్నయైన ఇమ్మడి గోవిందరాజునకును నైన కలహములో వేంగీశ్వరుడు గోవిందరాజుపక్షము వహించి నిరుపమునితో యుద్ధమొనర్చెను. ఈ యంశము ముమ్మడి గోవిందరాజు పైఠానుశాసనములో నిట్లు చెప్పియున్నది :

శ్రీకాంచీపతిగంగవేంగికయుతా
  యే మాలవేశాదయః
ప్రాజ్యా నానయతి స్మ తాన్ క్షితిభృతో
  యః ప్రాతిరాజ్యానపి
మాణిక్యాభరణాని హేమనిచయం
  యస్య ప్రపద్యోపరి
స్వం ( ? యే) న ప్రతితం తథాపి న కృతం
  చేతోఽన్యథా భ్రాతరం. 32

కావున ఇమ్మడి గోవిందరాజును రాజ్యభ్రష్టుని గావించి స్వయము సింహాసనము నధిష్ఠించిన పిమ్మట ధ్రువనిరుపముడు వేంగీశ్వరుని శిక్షించుటకై ప్రథమ అరికేసరినాయకత్వముక్రింద నొక గొప్పసైన్యమును వేంగిపై కంపెను. వెంగికళింగముల నప్పుడు పాలించుచుండిన రాజు పూర్వచాళుక్యచతుర్థవిష్ణువర్ధనుడు. రాష్ట్రకూటుల యుపద్రవమునుండి నిజరాజ్యమును గాపాడుట కిత డెట్టి యేర్పాటులను గావించెనో తెలియదు; కాని యవి యెట్టివైనను విఫలము లాయె ననుట నిశ్చయము. వేములవాడ చాళుక్యుల శాసనములందును, విక్రమార్జునవిజయమునందును మొదటి యరికేసరి వేంగిత్రికళింగములను సాధించె నని స్పష్టముగ జెప్పియుండుటచేత రాష్ట్రకూటదండయాత్ర జయప్రదముగ ముగిసె ననుట తెల్లము; దీని యాథార్థ్యమును క్రీ. శ. ౭౮౬ నాటి జెథ్వైతామ్రశాసనము రుజువు సేయుచున్నది.

"తస్య పరమభట్టారక మహారాజాధిరాజపరమేశ్వర శ్రీమదకాలవర్షపాదానుధ్యాత పరమభట్టారక రాజాధిరాజపరమేశ్వర ధారావర్ష శ్రీ ధ్రువరాజదేవస్య మహాదేవీ సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనవిట్టరసరాజదుహితా పరమేశ్వరీ పరమభట్టారికా శ్రీశీలమహాదేవీ". 33 ఇందువల్ల విష్ణువర్ధనవిట్టరసరాజు అనగా ముమ్మడి విష్ణువర్ధనుని మనమడైన నాల్మడి విష్ణువర్ధనుని కుమారితయగు శీలమహాదేవి ధ్రువనిరుపమదేవుని మహాదేవి యని తెలియుచున్నది. ధ్రువనిరుపముడు వేములవాడ చాళుక్యాధిపతియగు మొదటి యరికేసరిని నాల్గవ విష్ణువర్ధనుని పాలనయందుండిన వెంగిత్రికలింగములపై దండుతో బంపుటచేతను, నా యరికేసరి యా రెండు జనపదములను జయించుటచేతను, నాల్మడి విష్ణువర్ధనుడు దన కూతురగు శీలమహాదేవిని ధ్రువనిరుపమున కిచ్చి వివాహము గావించి సంధి చేసుకొనె నని తోచుచున్నది.

(సశేషము)

---

౩౨. ఎపి. ఇండి. సం 3. పుట ౧౦౫.

౩౩. ఎపి. ఇండి. సం. ౨౨. పుటలు ౯౮-౧౦౯ శాసనగ్రంథపంక్తులు ౩౬-౩౯.



ఒకప్పుడు కాకతీయ రాజధానిగా వెలసిన అనుమకొండలో పద్మాక్షి దేవాలయమున కుత్తరముగా కొండపై మలచిన జినదేవవిగ్రహము.

# ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము

## ప్రథమ ద్వితీయ సంపుటములు

ప్రథమ సంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౪౦౦ పుటలు గలవు. ఇందు 'అ' నుండి "అధ్వర్య" వరకును గల విషయము గలదు. త్రివర్ణ పటములు ౭, యితరపటములు ౧౩౫, వివిధ విషయములు ౮౦౦ కలవు.

రెండవ సంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౪౦౦ లకు మించిన పుటలు కలవు. "అన్" మొదలుకొని "అశ్విని" వరకు గల విషయము గలదు. త్రివర్ణపటములు ౧౦. వానిలో ౩ అమరావతీ స్తూపమునకును ౩ అనాహతమునకును చెందినవియు, ౪ దేశచిత్రపటములును గలవు. ఇవిగాక మరి ౫ సాదా దేశపటములు కలవు. ప్రాచీనాంధ్రుల కళాసంపదను వ్యక్తముచేయు అమరావతీ స్తూపమును గురించిన గొప్ప వ్యాసమునందు అమరావతీ శిల్పమునకు సంబంధించిన హాఫ్‌టోన్ బొమ్మలు రమారమి ౧౦౦ ను, వేషభూషాదుల వెల్లడించు బొమ్మలు ౫౦ వఱకును గలవు. మరియు అభినయమను వ్యాసమున భరతశాస్త్రమునందలి వేఱువేఱు హస్తములను సూచించు బొమ్మలు ౫౭ ను, 'అనాహతము' నందు షట్చక్రాదుల చిత్రములును గలవు. ఇట్లు ఆ యా వ్యాసములకు చెందిన చిత్రములు మొత్తముమీద ౩౫౦ కి పైగా నున్నవి. వివిధవిషయముల సంఖ్య ౮౦౦ వరకు నుండును. సంపుటము చక్కని స్వదేశీచర్మముతోడను బంగారు రేఖలతోడను సంపుటీకృతము. ప్రతిసంపుటమున ౪౦౦ పుట లుండును.

### సంపుటము 1-కి వెల రూ. ౧౦.

ప్యాకింగు, పోస్టేజి వగైరా ప్రత్యేకము.

మేనేజరు,

ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెం. 7, తంబుశెట్టివీధి, మదరాసు.

# మళ్ళీ ఎప్పటిలాగే...

[కథానిక]

●

**శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి**

రామారావు రమణమ్మలది అనుకూలదాంపత్య మనే చెప్పాలి. ఏవో దూరదేశాలనుండి తెచ్చిన రెండు ముక్కలను అంటుకట్టినట్లు కనిపిస్తుంది వాళ్ళ దాంపత్యం. ఇద్దరూ చిన్నతనంలో ఎవరో దూరపు బంధువులదగ్గర పెరిగినవారే—పెళ్ళికావడంతో ఇద్దరికీ అదివరకుండే బంధాలు సడలిపోయినాయి.

పెళ్ళయిన కొత్తలో "కాస్త స్థిరమయిన ఉద్యోగమూ, ఒకమాదిరి వాసయోగ్యమైన ఇల్లూ దొరికితే చాలు—నిర్విచారంగా బ్రతకగలం" మనుకొన్నారిద్దరున్నూ.

ఆ రెండూ ఒక రెండేళ్ళలోనే లభించేయి. 'అమ్మయ్య!' అనిపించింది భార్యాభర్త లిద్దరికీని. "ఇప్పుడరవై ఇస్తున్నారా, క్రమేపీ అదే నూటఇరవై అవుతుంది—ఆపై కెక్కడికి? చాలదూ, మనిద్దరికీ?" అన్నాడు రామారావు.

"ఓ, చాలకేం? మనకే కాదు మరిద్దరికికూడా చాలు" అంది—అతను 'మనిద్దరికీ' అన్న మాటకు లోలోపల కించపడిన రమణమ్మ. కాని రామారావుకు మాత్రం ఆమె మాటలోని సారస్యం అర్థంకాలేదు—నిబ్బరమైన ఉద్యోగం సంపాదించగలిగానన్న అప్పటి ధీమాలో.

తరువాత అట్టేకాలం రమణమ్మ తన కోరికను మనస్సులో దాచుకోలేకపోయింది. ప్రతినెలా జీతం అందగానే ఏదో ఒక కొత్త వస్తువు తెచ్చి, కొంతసేపు చూపకుండా దాచి, నెమ్మదిగా బైటికి తియ్యడం అతని కలవాటు. మొదట్లో రమణమ్మ ఎంతెంతో ఆనందించేది అటువంటి బహుమతుల మూలంగా. కాని క్రమంగా "ఎందుకండీ ఇలా డబ్బు తగలేస్తారు? ఇప్పుడు నాకేం చీరలూ, జాకెట్లూ లేవుగనకనా?" అనేది.

"ఉంటేమాత్రం, మరికొం దుంటకూడదేమిటిలే" అనేవాడు రామారావు.

"బట్టల కేమిటి, ఎన్ని ఉన్నా వద్దనవు. మనమే కాస్త చూసుకోవాలి ముందుముందు ఎటువంటి అవసరాలు వస్తాయో" అనేది రమణమ్మ.

"ఇప్పటి సరదాలు మానుకొని ఎప్పటికో దాచేదేమిటి లెద్దూ? నేను తెచ్చేది మన అవసరాలకు చాలకపోదు. ఇక కూడబెట్టడంమాటా? వాళ్ళే ఏదో ఇంత ప్రావిడెంటుఫండుకింద ఏర్పాటుచేస్తున్నారు. అది మనకు చాలదంటావా?" అని ఎదురుచెప్పలేనంత కట్టుదిట్టంగా తన అభిప్రాయాన్ని వెలార్చినట్లు తృప్తిపడేవాడు రామారావు. కాని రమణమ్మకుమాత్రం అతని ధోరణికి ఆధారమే లేనట్లు రూపించేది.

"ఏమిటండీ అలా మాట్లాడతారు, రేపొద్దున్న మనకుమాత్రం పిల్లలూ పాపలూ కలగరా, వాళ్ళకు చదువులూసంధ్యలూ చెప్పించి పెళ్ళిళ్ళూ పేరంటాలూ చెయ్యక్కర్లేదుటండీ? పొరుగుప్లీడరుగారిని చూడండి. ఆయ నెంత తెచ్చినా వాళ్ళ ఖర్చులకు కటాకటిగానే ఉంటున్నది. అంచేతండే, మనం ఇప్పుడే కాస్త జాగ్రత్తపడకపోతే తర్వాతతర్వాత మళ్ళీ ఇబ్బందులు పడతామేమోనని"—ఇదీ ఆవిడవాదన.

ఆవిడలోపలిలోపలి అభిప్రాయం కాస్తా బైటపడిపోయింది.

మొదట్లో రామారావు "పోనిద్దూ, పిల్లలేమిటి, నానాగోలాను, ఇంట్లో శాంతన్నది ఉండదు" అన్నాడు.

తరవాత కొన్నాళ్లకు, "పిల్లలు కలిగితే నేనేం వద్దనను. కాని లేరనే విచారం నాకేం లేదు. పిల్లలుండడంలో ఎలాగయితే కొన్ని సదుపాయా లున్నాయో లేకపోవడంలోనూ కొన్ని సదుపాయాలు లేకపోలేదు" అనసాగాడు.

మరికొన్నాళ్ళకు—"పిల్ల లుంటే బాగానే ఉంటుంది. అలాగని డజన్లకొద్దీ కాకుండా, ఒకళ్లిద్దరు ఉండడం అదీ ఒకవిధమయిన అనుభవమే. అయితే ప్రపంచంలో అందరూ అన్నిరకాల అనుభవాలూ అనుభవించడానికి వీలుంటుందా!" అనేవాడు విరక్తిగా.

ఇటీవల "పోనిద్దూ, మనకు కలిగితే కలుగుతారు, లేకపోనే లేదు. కాని, దేశాలు తిరిగి కొంత లెక్క దిగినంతలో లాభిస్తుందని నాకేం నమ్మకంలేదు సుమా" అంటున్నాడు.

ఇప్పుడిప్పుడు అతని సంకోచమల్లా యాత్రల కోసమని సెలవుపెట్టి వెళ్తే నలుగురూ తనను మూఢ విశ్వాసాలు కలిగిన పూర్వాచారపరాయణు డనుకొంటారేమోనని. కాని మరి తప్పేటట్లు తోచలేదు.

తనకంటే సర్వీసులో ఎంతో జూనియర్లయిన గుమాస్తాలు ఇద్దరుముగ్గురు పిల్లలతో పెద్ద ముసలివాళ్ళలాగ కబుర్లు చెప్పడమూ, కాస్త ఎక్కువసేపు పనిచేద్దామన్నా, ఆదివారం ఆఫీసుకు వద్దామన్నా "ఎలాగండీ, వారానికంతటికీ ఉన్నది ఒక్కరోజు సెలవు. ఆ ఒక్క రోజయినా బజారుపని చూసుకొని, పిల్లలతో కాస్త హాయిగా కాలక్షేపం చెయ్యకపోతే?" అనేవారు బాగా తనకు తగలాలనే. అంతేకాదు, బజారుదారిని తానింటికి వస్తూంటే ఎవడో స్నేహితుడు కనిపించి, "భాయీ, పర్సు ఇంటిదగ్గర కోటుజేబులో ఉండిపోయింది. నీదగ్గర ఒక రూపాయుంటే ఇద్దూ, ఇంటికి వచ్చేసరికి ఏదైనా తేకపోతే పిల్లలు చిన్నబోతారు" అనేవాడు. ఇంతేకాదు. ఎవళ్ళ సంభాషణలో ఎక్కడెక్కడ పిల్లల ప్రసక్తి వచ్చినా, చాలాకాలానికి కలిసిన పూర్వస్నేహితులు 'పిల్లలెందరని' అడిగినా, అదంతా తనను అవమానం చెయ్యడానికే అన్నట్లుండేది రామారావుకు. వీటికి తోడు తన భార్యకూడా ఇరుగుపొరుగువాళ్ళ పిల్లలను ఎంతో ఆప్యాయంగా ముద్దులాడటం, తననుకూడా ఎత్తుకోమనీ, ఆడించమనీ బలవంతం చెయ్యడం లోలోపల ఏదో చెప్పలేని బాధగా ఉండేది రామారావుకు.

"ఇప్పుడు ఆ యాత్రాస్థలాలన్నీ తిరిగివచ్చినందువల్ల పిల్లలు కలిగితీరుతారని కాదుగాని, పాపం ఆవిడకు అంత ఆశగా, పట్టుదలగా ఉన్నప్పుడెందుకు కాదనాలి? ఏలాభం ఉన్నా లేకపోయినా, అక్కడి శిల్పసౌందర్యమూ, ప్రకృతిరామణీయకమూ దర్శించడానికేమీ అభ్యంతరం లేదుకదా?" అని తన యాత్రాప్రయత్నాన్ని సమర్థించుకొందుకు చూసేడు రామారావు.

కాని లోపల్లోపల అతనిలోనూ ఆశాలేశం లేకపోలేదు. ఏమో లాభించకూడదా, ఏ మహత్తూ లేకపోతే ఇన్నిలక్షలమంది ఎన్నో శ్రమదమాదులుపడి ఎందుకు వెళ్ళివస్తూంటారని.

మద్రాసులో ఉన్న ఎవరో దూరపుబంధువులను చూడడంకోసమని అతను ఆఫీసులో తనకంటే తక్కువవాళ్ళతోకూడా చెప్పిచెప్పి బయల్దేరేడు.

రమణమ్మమాత్రం తన స్నేహితురాళ్ళతో "ముందు తిరుపతి వెళ్తాం, తరవాత మాఆయనబంధువు లెవళ్ళో ఉన్నారట, వెళితే చెన్నపట్నంకూడా వెళ్తాం"అని చెప్పింది.

మొత్తంమీద ఆఫీసులో అదరికీ రామారావు ప్రయాణ కారణం త్వరలోనే తెలిసిపోయింది.

"నడుం మునిగేవరకూ చలి, నలుగురికీ తెలిసేవరకూ సిగ్గు"అన్నట్లు, తరవాత తరవాత రామారావు యాత్రలకని బయలుదేరడంలో ఏమీ మొగమాట పడడం లేదు. అయితే ఇప్పటికీ తన కేమీ నమ్మకం లేకపోయినా, భార్యను తృప్తిపరచడంకోసమూ, వాతావరణంమార్పుకోసమూమాత్రమే యాత్రలు చేస్తూ

ట్లుగా చెప్పుతుంటాడు. కాని అతని మాటలధోరణిలో బలం లేదన్న సంగతి చిన్నపిల్లలకుకూడా తెలిసిపోతుంది.

ప్రతినెలా పదిహేనుఇరవై చొప్పున వేరే ఉంచడమూ, ఏడాదికి ఒక ఇరవైరోజులు శెలవు పుచ్చుకొని ఏదో ఒక యాత్ర చేసుకొని తిరిగిరావడమూ ఇది ఒక పరిపాటి అయిపోయింది రామారావు రమణమ్మల జీవితంలో.

ఆ ప్రాంతంలో ఎవ రెవరికి ఎన్నెన్ని సంవత్సరాల అనంతరం పిల్లలు కలిగేరో ఆ వైనం రమణమ్మకు కరతలామలకం. సుమారు ఇరవై సంవత్సరాలతరవాత పిల్లలు కలిగినవాళ్ళుకూడా ఉన్నారు. అటువంటిది, ఏదీ, ఇంకా పదకొండేళ్ళకంటే ఎక్కువ కాలేదు. అంచేత లేకపోలేదు ఆశాలేశం.

అయినప్పటికీ రమణమ్మలో మునపటి ఆ ధైర్యమూ, పట్టుదలా లేవు.

“ఒకమారు వెళ్ళేం కదుటండీ, మళ్ళీ ఎందుకు సింహాచలం వెళ్ళడం ?” అంది ఆమె నిరుత్సాహంగా.

“ఎందుకేమిటి, నే నన్నిఏర్పాట్లూ చేసేను. ఇప్పుడు మరొకదానికోసం కాదు. అలా తిరిగివస్తాం. పాలు మున్నూటఅరవై రోజులూ ఒకలా నెగవఆఫీసూ, కాగితాలూ—తలనొప్పిగా ఉంది. కొంచెం దేశం తిరిగివస్తే, జనసమూహాన్ని చూస్తే కొత్త హుషారు కలుగుతుంది” అన్నాడు రామారావు.

కాని ఆమెకు అట్టే తృప్తిగా లేదు. అతని ప్రోద్బలమే లేకపోతే ఆ సంవత్సరం ప్రయాణం జరగకనేపోవును.

భగవంతుడి అగ్రహానుగ్రహాలు ఏరూపంలో వస్తాయో ఎవరు చెప్పగలరు ?

దంపతులు చక్కటి మూడేళ్ళ పిల్లవాడితో సహా తిరిగివచ్చేరు.

ఇద్దరూ కూడబలుక్కొని, నలుగురితోనూ “మావాళ్ళే—బంధువులు; అక్కడ కలిసేరు. ఇంకా పదినిమిదేళ్ళయినా లేవు, ఆ అమ్మాయిభర్త పోయేడు. మళ్ళీపెళ్ళి చేసుకొందుకు ఈ పిల్లవాడొకడు... పోనీ, మేం పెంచుకొంటా మన్నాము” అని చెప్పేవారు.

కాని దంపతులిద్దరికీ ఒక అర్నెల్లపాటు బితుకుగానే ఉండేది—ఎక్కడ అసలువాళ్లు వెతుక్కుంటూ వస్తారో అని. అయితే తామూ అంత అన్యాయం చెయ్యలేదు. అక్కడ కొంతమందితో చెప్పేరు. ఏవో నలుగురూ చూడని పత్రికల్లో అనూ పానూ దొరక్కుండా అరంగుళం ప్రకటనలు చేసేరు. ఇంతకంటే ఏంకావాలి, తమ విధి తాము నిర్వహించినట్లు ఋజువుకు. కాని ఎవళ్ళూ వెతుక్కుంటూ రాలేదు. పిల్లవాడు పూర్తిగా తమ హక్కన్న విశ్వాసం భార్యాభర్తల్లో కలిగింది.

పిల్లవాడికి ‘వెంకటనరసింహం’ అని తిరుపతి సింహాచలందేవుళ్ళిద్దరిపేళ్లూ జోడించి పెట్టేరు. ముద్దుగా ‘సింహం’ అనేవారు.

ఆ చుట్టుపక్కల ఎవరి పిల్లలకూ జరగనంత ముద్దూ మురిపెమూ జరిగేది నరసింహానికి.

“వాళ్ళకంటే ఒక్క పిల్లడుగనక ఏంచేసినా చెయ్యగలరు. నలుగురు పిల్లలున్నవాళ్ళకు అలా ఎలా కుదురుతుంది ?” అంది జానకమ్మ.

“అహా, ఒక్క పిల్లడుంటేమాత్రం మరి తక్కిన ప్రపంచమే లేకుండా వెర్రెత్తిపోతారేమిటి ? వాళ్ళకంటే సుమారు పదిపదిహేనేళ్ళపాటు లేకలేక కలిగేడుగనక—”అంది సరస్వతి.

“నీకు బాగానే తెలుసును. ఆ పిల్లడు వాళ్ళ పిల్లడనుకున్నావేమిటి ? నిరుడు సింహాచలం వెళ్ళినప్పుడు అక్కడ దత్తత చేసుకున్నారట—” అంది ఇందిర.

“నీ కంతకంటే తెలీదు. అక్కడ పిల్లవాడు వీళ్ళకు దొరికేడట. ఎప్పటికయినా అసలు తల్లిదండ్రులంటూ వస్తే ఇచ్చెయ్యవలసిందే” అంది సత్యవతి.

“ఎవళ్ళో కిట్టనివాళ్ళలా అంటారు ; కాని ఆరక్షంగా తెచ్చుకొని పెంచుకోగలరుటయ్యా ! మనం

చూడని సరగతులు మన కెందుకు" అంది సద్దుబాటుగా శాంతమ్మ.

"ఏమయితేనేం? నొప్పులబాధ పడక్కర్లేకుండా పిల్లవాడి ముద్దుముచ్చటలు తీర్చుకోగలుగుతున్న" దంది కొత్తగా గాజులు తొడిగించుకొన్న సుశీల.

"మన సుశీల ఇప్పణ్ణించే నొప్పులబాధ పడుతున్నదర్రా!—" అంది సీతారత్నం. అందరూ గొల్లుమని నవ్వేరు.

"నే ననేది అది కాదర్రా. నామాటే కాదు, లోకంలో ఎవళ్ళకూ నొప్పులబాధ పడకుండా పిల్లలు కలగరుకదా ఎవళ్ళో రమణమ్మలాంటి అదృష్టవంతులకు తప్ప—"అని తననే సమర్థించుకోజూసింది సుశీల. కాని ఆ నవ్వులహడావిడిలో ఆమె సమర్థింపును వినేవాళ్ళెవళ్లు?

కాని, సుశీలఈర్ష్య ఫలించిందన్నట్టు రమణమ్మకుకూడా మరొక ఏడాదిలో ప్రసవవేదన పడవలసిన పరిస్థితి ఏర్పడింది.

భార్యాభర్తల ఆనందానికి మితి లేదు. ఈ అదృష్టానికి తమ ఇలవేల్పుల దయ కలిసిరావడంమీద ఎంతయితే నమ్మకం ఉందో, అంత నమ్మకం వెంకట నరసింహం తమకు లభించిన వేళావిశేషంమీద కూడా ఉండేది ఇద్దరికీని.

ఆసంవత్సరం అనుకోకుండా రామారావుకు జీతం పదిరూపాయలు ఎక్కువయింది. అన్నిటికీ సింహమే కారణం. వాడి ముఖంలో అటువంటి కళ ఉంది!

"అయితే సింహాల్రా, నీకు తమ్ముడా, చెల్లెమ్మ ఎవళ్ళు కావాలమ్మా?" అని అడిగేది రమణమ్మ.

ఒకమారు తమ్ముడనీ, ఒకమారు చెల్లెలనీ, వేరొక మారు ఇద్దరూ కావాలనీ భార్యాభర్తలిద్దరినీ సంతృప్తి పరిచేవాడు నరసింహం.

"ఎలాగూ మనకు సింహాలుబాబు ఉన్నాడు కదా, ఈ పుట్టేది ఆడపిల్లయితే ఆ సరదాకూడా తీరుతుం" దనేవాడు రామారావు.

"మొగపిల్లడయితేమాత్రం, ఇద్దరూ ఉంటారు. మీకేం ఇద్దరు పిల్లలంటే ఎక్కువగా కనిపిస్తున్నారు కాబోలు" లనేది రమణమ్మ.

"ఎక్కువని కాదుగాని, ఆడపిల్లయితే, చూడూ, దానికి తగిన చదువూ, సంగీతం చెప్పించడం, పెళ్ళి చెయ్యడం అదంతా అదొకరకమయిన అనుభవం. ఇద్దరూ మగపిల్లలయితే అదంతా ఏం తెలుస్తుంది" ఇది రామారావువాదన.

"మీ కేమన్నా అనండి, మొదట మొగపిల్లవాడు కలిగితేనే ముచ్చట. తరవాత మనకు అదృష్టం ఉంటే ఆడపిల్ల కలిగినా కాదనేదేమిటి?" ఇది రమణమ్మకోరిక.

చివరకు ఆవిడకోరికే ఫలించింది. మగపిల్లవాడే కలిగాడు.

రెండు వస్తువులుగాని, ఇద్దరు పిల్లలుగాని ఒకే దగ్గర ఉండేసరికి అప్రయత్నంగా తారతమ్యదృష్టి వచ్చేస్తుంది.

పుట్టిన పిల్లవాడు దుర్బలంగా ఉంటేనేం, చాలా తెల్లగా ఉంటాడు. కొందరు "పెద్ద కళ్లూ, విశాలమయిన నుదురూ—ఒకింత చాయ తక్కువయితే నేం?" అని పెద్దపిల్లవాడే బాగుంటా డన్నారు. మరికొందరు రెండవపిల్లవాణ్ణి పసందుచేశారు.

రామారావు రమణమ్మల కంటికి ఇద్దరూ రెండు రత్నాల్లాగ కనిపించేవారు. అందులో ఏమీ సందేహం లేదు. ఇంకా ఆమాటకు వస్తే రామారావుకు సింహాలంటేనే ఎక్కువముద్దు. వాడు తాను ఇంటికి వచ్చేసరికల్లా ఎదురుగా వస్తాడు. "ఏమైనా తెచ్చేవా నాన్నా" అంటాడు. ఎన్నెన్నో ముద్దుకబుర్లు చెప్తాడు. ఏవేవో కథలు చెప్పమంటాడు. వాడితో తానూ ఒకటయిపోగలడు రామారావు. ఆ మాటలురాని, మాటిమాటికీ ఏడుస్తూఉండే పిల్లవాడితో భార్య అంతలా కాలక్షేపం చెయ్యగలగడం అతనికి ఆశ్చర్యంగానే ఉండేది మొదట్లో. రమణమ్మకూడా అంటూ ఉండేది—"ప్రకాశం కొంచెం తెలుపు అన్నమాటేగాని, సింహాలే ఎంతో ఇదిగా ఉంటాడు. వాడి కళ్ళేమిటి, వాడి

మొగంలో ఎంతవాడయినా అవడానికి తగిన కళ ఉంది" అనేది. అలాఅలా ఏవో వాడినిగురించిన కబుర్లు చెప్పు కొని, ప్రపంచాన్నీ, తమనీకూడా మరిచిపోగలిగేవారు దంపతు లిద్దరూను.

అటువంటివారిలో స్వపరభేదము కలిగిం చవ డానికి కాదు. మానవస్వభావంలో ఉండే ఒక ప్రత్యేకలక్షణం అది. ఇద్దరు చిన్నపిల్లలు ఒకేదగ్గర ఉండేసరికల్లా, వాళ్ళల్లో మిక్కిలి చిన్నవాళ్ళను బాగా చేరదీసి, అన్నింటికీ సమర్థించడమూ, పెద్ద వాళ్లను చీటికీమాటికీ తప్పులెంచి కూకలెయ్యడమూ మామూలు. తల్లిదండ్రులేకాదు, పెద్ద అన్నదమ్ములో, అక్కచెల్లెలో, లేక ఎవరో సంరక్షకుడో కాని య్యండి—ఎవరికైనా సరే, ఇద్దరు చిన్నపిల్లల్లో మరీ చిన్నవాళ్లు అన్నివిషయాల్లోనూ సరిగా ఉంటున్నట్టూ, పెద్దవాళ్లు అన్నీ తెలివితక్కువ పనులే చేస్తున్నట్టూ రూపిస్తుంది.

పాపం, రామారావు రమణమ్మలుకూడా మానవ మాత్రులే.

నరసింహంది బలవంతంగా చదువుకోమనీ, బుద్ధిగా ఉండమనీ ఆజ్ఞాపనలను పొందుతున్నవయస్సు. సూర్యప్రకాశంది ముద్దుముద్దుగా నవకమాటలు నేర్చు కొంటున్న వయస్సు.

తానేమో అమ్మ పనితొందరలో ఉన్నప్పుడు తమ్ముణ్ణి ఆడించాలి. కాని, అదొక మిషకింద పెట్టు కొని తన చదువు అశ్రద్ధచెయ్యకూడదు.

తమ్ముడు ముద్దుముద్దుగా మాట్లాడుతూ, తప్ప టడుగులు వేసి, ఏదయినా వస్తువు పగలగొట్టినా, పాడుచేసినా ఎంతో ప్రతాపంకిందనే లెక్కకువస్తుంది. తాను ఆటల్లో బట్టలు మురికిచేసుకొన్నా, ప్రమా దాన్న పలక పగలగొట్టుకొన్నా, చివరకు పలకపుల్ల పారేసుకొన్నా, బ్రహ్మాండమైన నేరమే. "ఇప్పు డా వస్తువుఖరీదు ఏని కాదుగాని, ఇలా మతిభ్రష్టగా తెలివితక్కువగా తయారయితే రేప్పొద్దున్న పెయ్యలు కాయడానికితప్ప మరెందుకూ పనికిరాడుకదా" అని తల్లిదండ్రుల ఘోష.

తమ్ముడికి ఎన్నో బట్ట లుంటూఉండగానే, ఒకటే చిరగకమునుపే, మళ్ళీమళ్ళీ బట్టలు కొంటూ ఉండడం, తను ఎప్పటి పాతచొక్కాలూ, నిక్కర్లూ తొడుక్కుంటూఉండడం సింహాలుకు ఎంతో కష్టంగా ఉండేది.

"నే నా చింకినిక్కరు తొడుక్కొని బడికి వెళ్ళితే నమ్మా?" అన్నాడు ధైర్యం తెచ్చుకొని.

"చిం కెక్కడ్రా, నిన్న సాయంత్రమల్లా పని మానుకొని కూర్చొని కుట్టేనుకదా!" అంది రమణమ్మ.

"కుడితేమాత్రం" అన్నాడు సింహాలు. బడిలో తక్కిన కుఱ్ఱవాళ్ళవద్ద ఆ రంగువెలిసిపోయి, బైటికి స్ఫుటంగా ఖేతికుట్లు కనబడుతున్న ఆ నిక్కరు తొడుక్కొని వెళ్ళడం ఎంత పరువుతక్కువో ఆమె ఊహించలేకపోయింది.

"ఏదీ, ఎక్కడా చింకి కనబడలేదు. దిట్టంగా రాయిలా నుంది. మీ నాన్నే ఆఫీసుకు నేను కుట్టిన చొక్కాలూ అవీ తొడుక్కొని వెళ్తూంటేను" అంది రమణమ్మ.

"ఏమి టంటూ డేమిటి?" అంటూ కళ్ళజోడు తుడుచుకొంటూ వచ్చేడు రామారావు.

"ఈ నిక్కరు బాగులేదట బాబుగారికి—చూడండి, ఇంత దిట్టంగా ఉండగా పారేసుకొంటామా?" అని ఫిర్యాదు.

"అసలు బడి మానేయడానికి ఇదొక ఎత్తు" అని తండ్రి.

"రేప్పొద్దున్న నువ్వు నీకొడుకులకు ఎన్నేసి బట్టలు కొంటావో చూద్దాంలే" అంది తల్లి కొంత ఉల్లాసంగా.

ఏడుపుమొగంతోనే ఇంటినుండి బయలుదేరేడు. ఇంటినుండయితే బయలుదేరేడుగాని, బడికిమాత్రం వెళ్ళలే దా నాడు నరసింహం.

మర్నాడు మరేదో కారణం బడికి వెళ్ళక పోవడానికి.

ఆ మర్నాడు బడిల్లో నిన్నా మొన్నా ఎందుకు రాలేదని ఉపాధ్యాయులవారి దండన. దాంతో ఏమయితే అవనీ అని ఆమర్నాడు తోటలలోనే గడిపేడు— బడివేళ అయిపోయేవరకూను.

బడి మానివెయ్యడం అన్నది ఒకసారు జరిగిందా, ఇక కుఱ్ఱవాడు ఆ అభ్యాసాన్ని మరి విడిచిపెట్టలేడు. అందులోనూ చిన్నతనంలో తమను గురించి తాము ఆలోచించుకోనే అలవాటున్న కుఱ్ఱవాళ్ళకు బడిలోని నీరసజీవితానికి ఇంట్లోని నిరాదృతి ఏమాత్రం తోడ్పడినా మరి వాళ్ళ పని అంతే. అవతల బడికీ వెళ్ళలేరు—ఇవతల ఇంట్లోనూ ఉండలేరు. విజనస్థలాలలోని ఒంటరితనమే వాళ్ళకు శరణ్యం.

అటువంటివాళ్ళను సామోపాయంచేత మళ్ళీ మార్గంలో పెట్టేటంతటి ఓపిక సామాన్యంగా తల్లిదండ్రులకూ, ఉపాధ్యాయులకుకూడా ఉండదు. ఇష్టంగానో అయిష్టంగానో దండోపాయాన్నే అవలంబిస్తారు.

సరిగ్గా నరసింహంవిషయంలోనూ ఇంతే జరిగింది. బడికి సరిగా వెళ్ళనందుకే ఆ సంవత్సరం అనేకపర్యాయములు తండ్రిచేత దెబ్బలూ, తల్లిచేత చీవాట్లూ తిన్నాడు నరసింహం. పరీక్ష పోయిందనడంతో తండ్రి కోపానికి మేర లేకపోయింది. అంతేకాదు. "చదివితే మంచి తెలివయినవాడేనండి, ఇదివరలో చూసేరు కదూ, అన్ని ఫస్టుమార్కులూ వీడివే; అయితే ఇప్పుడిప్పుడు బడిదొంగ అయిపోయేడు. చెడు సహవాసాలు కూడా చేస్తున్నాడేమోనని అనుమానం—" అని చెప్పిన మాస్టరుమాటలు అతని ఆగ్రహాగ్నికి ఆజ్యధారలయినాయి.

మొదట్లో తానూ భర్తతో కలిసివచ్చినా, రమణమ్మగుండె నీరయిపోయింది భర్త శిక్షించే విధానంతో, మధ్యను అడ్డుకొన్నందుకు ఆమెకు గట్టిగా నాలుగు చీవాట్లు తగిలేయి.

రోజల్లా గదిలో పెట్టి తాళం వేసిఉంచాలనీ, రెండు మార్లు భోజనంతప్ప చిరుతిండి ఏదీ ఇవ్వడానికి వీల్లేదనీ, ఒక అభ్యాసంలెక్కలు పూర్తిచేసి, ఇంగ్లీషు పుస్తకంలోని పాఠం రోజు కొకటి చొప్పున తాను సాయంత్రం ఇంటికి వచ్చేసరికల్లా అప్పజెప్పాలనీ రామారావు సుగ్రీవాజ్ఞ.

అన్నీ బాగానే ఉన్నాయి. అన్నింటిలోనూ తన తెలివితక్కువను కడిగివేసే ప్రయత్నమే గర్భితమయి ఉందనుకోగలిగేడు నరసింహం.

కాని ఒక్కటే అతన్ని లోపల్లోపలనుంచి క్రుంగదీసిన సంగతి—తానెందుకూ పనికిమాలినవాడుగా తయారవడమే కాక, తమ్ముడు లోకాతీతమయిన తెలివితేటలు కలవాడనీ, వాడి ప్రతిచేష్టలోనూ ముందుముందు ఎంతవాడయినా కాగల సూచన ఉందనీ, ఇంకా ఏవేవో ఇటువంటి అర్థం వచ్చే తల్లిదండ్రుల మాటలు ఆ కుఱ్ఱవాడి చెవుల్లోనే కాదు, గుండెల్లో కూడా గ్రుచ్చుకొన్నాయి.

తమ్ముడే అంత తెలివయినవాడయి, వాడే అన్నిటికీ పనికివచ్చేవాడయి, తన బడిజీతమూ, బట్టలూ అన్నీ వృథాఅయినట్లుగా ఉంటూంటే మరి తానెందుకు ఉండడం ?

తెల్లవారుజామున రమణమ్మ లేచి చూసేసరికల్లా వీధి తలుపు గడియతీసి ఉంది. ఇంట్లో దొంగలుపడ్డారేమో నని గాభరాపడ్డారు. అటువంటి జాడ ఏమీ లేదు. కాని నరసింహంమాత్రం పక్కమీద లేడు.

తండ్రికోపం మరీ ఎక్కువయింది. "చెప్పేను కాదూ, వెధవకు పూచీ పేచీ లేదని. ఇంటికిరానీ, చెమ్డా లెక్కగొడతాను. తెలివితక్కువకు తోడు ఏమయినా అంటే పౌరుషంకూడాను! ఈ పౌరుషం చదువులో ఉంటే బాగుండేది" అన్నాడు ధాటీగా.

తల్లికిమాత్రం బితుకుగానే ఉంది. వాడేగాని తిరిగి వస్తే, తిరుపతికొండ ఎక్కించి జుత్తు తీయిస్తానని మొక్కి ముడుపు కట్టింది.

తల్లికి ముడుపుచెల్లించవలసిన అవసరమూ, తండ్రికి శిక్షించవలసిన అవసరమూ మరి కలగలేదు. తర్వాత

తర్వాత మరి ఎంత ప్రయత్నించినా, వెంకటనరసింహం జాడ దొరకనేలేదు.

"వాడు ఎలా వచ్చేడో, అలాగే వెళ్ళిపోయేడు. అక్కడికి మన కంతే ఋణానుబంధం—చిన్నప్పుడే ఆ తల్లిదండ్రు లెవళ్ళో వచ్చి తీసుకుపోయే రనుకొందాం. మన ప్రకాశం బతికుంటే మన కంతే చాలు." అని భార్యను ఓదార్చాలని చూసేడు రామారావు.

కాని, తరువాత రెణ్ణాళ్ళకే, ఒకళ్ళనొకళ్లు ఓదార్చుకోలేని దుర్భరఘటన జరిగింది—అన్నయ్య అలాగ ఎటు వెళ్ళేడో అయిపు లేకుండా. కాని, మానవప్రయత్నా లన్నిటికీ అతీతంగా, తల్లిదండ్రులు చూస్తూఉండగానే ప్రకాశం దాటిపోయేడీ మృణ్మయ జగత్తును.

తర్వాత ప్రతిసంవత్సరం మళ్ళీ ఎప్పటిలాగే యాత్రలు చేసుకొని వస్తున్నారు దంపతు లిద్దరూను. అయితే, ఆ వెనకటి ఆశా, ఉత్సాహమూ, పట్టుదలా ఏవీ లేవు. ఏమో విధి అన్నట్లుగా, నిస్పృహగా ఉండేవి వారి తీర్థయాత్రలే కాదు, జీవితయాత్రలుకూడా.

---

# ఏకాంతాలు

●

శ్రీ నండూరి వెంకటసుబ్బారావు

౧

ఈ సందె కీ యంద మెవ్వ రిడిరోయీ?
ఆకాశమున విల్లు
అంకాన ఎంకి!

౨

రేయి ముచ్చటల చెల రేగి రెవరోయీ?
నెలవంకదరి చుక్క
చిలిపి నాపక్క!

౩

పగలు రే లెడబా పెరుగ రెవ్వరోయీ?
శంకరుడు, సతి అచట
ఇం కెవ్వ రిచట?

---

# గోవర్ధన సుభాషితములు

●

శ్రీ పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు

స్నేహాభంగంబు విజిగీష జీవితంబు
మాటుపడుదాఁకఁ దెగని పోరాటఁ బెంచి
గంధగజములకే కీడు గలుగనీదు
కుంభినీ ! నీదు యౌవనారంభ మవుర !

* * * *

ఎన్నిసుగుణంబు లుండిన నేమి ఫలము ?
రాక్షసాక్రాంత మైతివో వృక్షరాజ !
ఉత్తమజనంబులకు నుపయోగపడవు
నీదు నీడయు నీపూలు నీదు పండ్లు.

* * * *

ఉన్నతచ్ఛాయ బహుళజనోపజీవ్య
వర్తనము ఫలవృద్ధి గావలసినంత;
సత్పురుషునకువలె మరుక్ష్మారుహంబ !
వాంఛనీయము నీకు జీవన మొకండె.

* * * *

కుటిలతటినిరో ! యలల లాఁగుకొనిపోయి
ఎద నిడక చక్రముల భ్రమియింపఁ జేసి
ఫలసుమపలాశవల్కలభ్రష్టు సలిపి
నడుమనే చెట్టు విడిచిపో న్యాయ మెట్టు ?

* * * *

కరము క్షుద్రోద్భవం బయి కటుత వెల్ల
డించి యున్మాదముం బ్రకటించుకతన
తేనె లఘుమానసుఁడును సమాను లైన
నొకటి యోజంట గురువు వేఱొకటి లఘువు.

# 'నాదే తప్పు'

[కథానిక]

●

'అమరేంద్ర'

అప్పటి జానకిరామయ్యని గుర్తుకు తెచ్చుకుంటే ఎంత రాతిగుండె అయినా కరిగిపోతుంది. అది అతని భార్య జానకి పోయిన కొత్తరోజులు. అప్పుడు నిజంగా అతను లోకంలో వున్న విషాదానికంతకీ మూర్తీభావంగా కనిపించేవాడు. అతనితో క్షణంసేపు మాట్లాడితే చాలు, ఇతరులక్కూడా అతని నిస్పృహలో సగం తల కెక్కేది. ఆ రోజుల్లో అతని శోకం, అతని నిరాశా అంటువ్యాధిలాగా అతనిదగ్గరికి వచ్చినవాళ్లందరికీ అంటుకునేది. ఇందులో లేశంకూడా అతిశయోక్తి లేదని నా అనుభవంమీద చెబుతున్నాను.

ఒకరోజున పరామర్శచేద్దామని వెళ్లిన నేను పుట్టెడు బరువుతో ఇంటికి తిరిగివచ్చాను. టైఫాయిడ్ తో తన భార్య మంచంపట్టింది మొదలు, ప్రాణం వొదిలేదాకా జరిగిన సంగతులన్నీ పూసగుచ్చినట్టు చెబుతుంటే నామనస్సు కరిగిపోయింది. నిజంగా జానకిరామయ్య ఎంత ఆదర్శప్రాయమైన భర్త! ఇటువంటి మగవాళ్లు ఈ కలికాలంలో ఎందరు దొరుకుతారు! ఇంకో మగవాడైతే మొదటి పెళ్లాం అంత్యక్రియలు ముగిసీముగియకముందే రెండో పెళ్లికోసం తహతహలాడేవాడు. కాని జానకిరామయ్యమాత్రం అటువంటి నీచజాతికి చెందడు. అతని భార్య జానకి పోతూపోతూ నాలుగేళ్ల లలితనీ, రెండేళ్ల రాముణ్ణీ భర్తచేతుల్లో వొదిలి వెళ్లింది. "ఇంక వీళ్లకి మీరే తల్లీ తండ్రీ" అన్నదిట. ఆ మాటలు చెబుతుంటే జానకిరామయ్యకళ్లలోంచి జడివానలాగా కన్నీరు రాలింది. అప్రయత్నంగా నా కళ్లుకూడా తడిసిపోయినై. అవును. ఇకనుంచీ తండ్రిఅయినా అతనే, తల్లి అయినా అతనే. వాళ్లిద్దరినీ పెంచి పెద్దవాళ్లని చేసి చదువు సంధ్యలు చెప్పించి ఒక ఇంటివాళ్లని చేసేదాకా జానకిరామయ్యకి జీవితంలో ఇంకో ఆలోచనకి తావు లేదు. అహర్నిశలూ పిల్లల యోగక్షేమాలని కనుక్కుంటూ కంటికి రెప్పగా సాకుతూ కాలం గడపడంకంటె అతని కింకేం కావాలి? ఈమాటలే అతని నోటివెంట వింటుంటే జలదరించిపోయాను. జీవితంలో ఒక ప్రస్ఫుటమైన ఆదర్శాన్ని ఏర్పరచుకుని దానికోసం బతుకంతా నివేదించటానికి సంసిద్ధంగా వున్న తపస్విలాగా నాకు కనిపించాడు. వజ్రసంకల్పం, దృఢనిశ్చయం అతని కంఠంలో నాకు వినిపించినై. మాసిన గడ్డంతో, రేగిన జుట్టుతో, దుమ్ముకొట్టుకున్న గుడ్డలతో దీనంగా నాముందు కూచున్న జానకిరామయ్యని చూస్తుంటే, అతని మాటలు వింటుంటే నాకడుపు చెరువైపోతోంది.

అంతటితో ఊరుకోకుండా, అవసానదశలో తన భార్యచేతిలో చెయ్యి వేసి "జానకీ, పిల్లలవిషయంలో నువ్వేమీ దిగులు పెట్టుకోకు. వాళ్లని సాకటంకంటే నా కింకేం కావాలి! నేనీ జన్మలో ఇక పెళ్లిమాట తలపెట్టను" అని మాటఇచ్చాడుట. భార్య ఏదో అనబోయిందిటకాని మాట పెగిలిరాలేదుట. ఇంతలో మృత్యువు ముంచుకొచ్చిందట!

ఈ శపథంసంగతి వింటుంటే నా మనస్సు ఆశ్చర్యంతో నిండిపోయింది. కథల్లోగాని కనిపించని పాత్రలు వాస్తవజీవితంలోకూడా మనకి ఎదురుపడతయ్యేమో ననిపించింది. ఎన్నాళ్లకిందటో చూసిన డాక్టర్ చిత్రం మళ్ళీ ఒక్కసారి మొదటినుంచి చివరిదాకా మనసులో మెదిలింది. చూస్తుండగా జీవితంలోని కష్టానుభవాలవల్ల మా జానకిరామయ్యకూడా ఒక్కసారి మారిపోతాడేమో ననిపిం

చింది. డాక్టర్ ఫిలింలోని కథానాయకుడితో పోటీ చెయ్యగలిగిన త్యాగం, దీక్ష మా జానకిరామయ్య లోనూ పెంపొంది అతనుకూడా ఒక ఆదర్శపురుషుడుగా తయారవుతాడనీ, నాకంటే గొప్ప కథకులెందరో అతని జీవితాన్ని వస్తువుగా స్వీకరించి రచనలు సాగించే అవకాశం వస్తుందనీ ఎంతో ఉప్పొంగిపోయాను.

అవసానకాలంలో ఇచ్చిన మాట అవసరాన్ని బట్టి జారవిడిచేది కాదని నా గట్టి నమ్మకం. అందులో జానకిరామయ్యలాంటి ఆదర్శభర్త అటువంటి నీచమైన పనికి పూనుకోడని నా దృఢనిశ్చయం. నాకు అంత గట్టి నమ్మకం కలగటానికి మరొక ప్రబలమైన కారణం వుంది. అప్పటికే జానకిరామయ్య నలభయ్యో పడిలో పడ్డాడు.

ఇంటికి వెళ్ళడానికి లేస్తూ "వెళ్ళొస్తాను బాబూ" అన్నాను. "మంచిది నాయనా. ఈ దీనుణ్ణి పూర్తిగా మరచిపోకు. కాస్త అప్పుడప్పుడూ వొచ్చి చూసి పోతూవుండు" అన్నాడు.

౩

జానకిరామయ్య జానకిని కోల్పోయిన దుఃఖాతిరేకంలో నా వొక్కడితోనూ ఇల్లా మాట్లాడాడేమో ననుకున్నాను. కొన్నాళ్ళకి ఆయన్ని కలుసుకున్న ప్రతివాళ్ళతోనూ ఇవే మాటలు అన్నాడని విని లోపల చాలా సంతోషించాను. ఈ మాదిరిగానే సాధారణ మానవులు పరిస్థితుల ప్రభావంవల్ల మహాపురుషులుగా పరిణతి పొందుతారని అనుకున్నాను.

క్రమేపీ నా అభిప్రాయంలో జానకిరామయ్య హీరో అయిపోతున్నాడు. వూళ్ళో ఆయనమనోనిగ్రహాన్నిగురించిన వార్త లెన్నో వ్యాపిస్తున్నాయ్. తనకి పిల్లనిస్తామని వచ్చిన పెద్దమనుషు లెందరినో చివ్వబుచ్చి ఇంటికి దారిపట్టించాడుట. ఊళ్లోని అమ్మలక్కలంతా అదే పనిగా ఇంటిచుట్టూ తిరుగుతూ "నాయనా, నువ్వొక ఇంటివాడివి అయితే కాని మాకు మనసు కుదుటపడదు. నీకేం, నడివయసులో మనిషివి! నాలుగు కాలాలపాటు సుఖపడాల్సినవాడివి. నువ్వు కోరిన సంబంధం తీసుకొస్తాం. ముక్కాకలూ తీరిన ముసలి రాముడయ్యే మూడో పెళ్లికి తగుదునమ్మా అని తయారైతే మావాళ్ల పడుచువాడివి నీకేం నాయనా! నువ్వు ఊఁ అంటే చాలు, నీకాళ్ళముందుకే సంబంధాలు వచ్చి పడతా" అంటూ ఒత్తిడి చెయ్యటం మొదలు పెట్టారు. జానకిరామయ్య నిబ్బరంగా వీళ్ళందరి ఒత్తిడికి తట్టుకుని పీసమైనా సడలని నిశ్చయంతో "రెండో పెళ్లి మాట నా చెవిని పడకూడదు. ఆ మాట ఎత్తేవాళ్లు నా గడప తొక్కొద్దు" అని ఖచ్చితంగా చెప్పాడట. ఈ మాటలకే నొచ్చుకున్న అమ్మలక్కలను అంతటితో విడిచిపెట్టక "జానకి ప్రాణంపోదికి వొచ్చి ఇంట్లో ఒంటరిగాణ్ణి నానాయాతనా పడుతుంటే ఒక్కళ్లయినా గడపలోకి వచ్చిన పాపాన పోయారూ! అటువంటివాళ్లు చుట్టరికాలు తిరగేసుకుంటూ ఇవాళ ఏముఖం పెట్టుకుని నాఇంటి కొచ్చారు!" అని ముఖాన్నే అడిగేసరికి ఒక్కరి ముఖానా కత్తివేసినా నెత్తురు చుక్క లేదుట. చెంపలు వేసుకుంటూ చుట్టాలు కాలి కొద్దీ దూసుకున్నారట.

ఒకరోజున నేను పొద్దున్నే జానకిరామయ్య గారింటికి వెళ్లి అద్భుతమైన ఆ దృశ్యాన్ని చూసి పులకించిపోయాను. భార్యఫోటో ఒకటి ఎన్లార్జిచేయించి గదిలో పెట్టారు. ప్రొద్దున్నే తోటలో పూసిన పూలన్నీ కోసుకొచ్చి దండ గుచ్చి పిల్లలూ, ఆయనా ఫోటోని అలంకరిస్తున్నారు. ఆ దృశ్యం చూసి ముగ్ధుణ్ణయిపోయి ఎంతో సేపు మౌనంగా నిలబడిపోయాను. జననమరణాల అవధిని దాటిన పవిత్రప్రేమని జానకిరామయ్యగారిలో చూస్తున్నా ననిపించింది. ప్రేమపూరితమైన ఆయనహృదయంలో, భార్య మరణించినా చిరంజీవిగా వుండిపోగలదని తలపోశాను.

నిజంగా కష్టానుభవాలవల్లనే మనిషిలో అంతవరకూ మరుగుపడివున్న ఉదాత్తగుణాలు ఒక్కసారిగా కళ్లని మిరుమిట్లు గొలుపుతూ ప్రకాశిస్తయ్. ఆ నిమిషంలో నేను చూచిన జానకిరామయ్యకీ, చిన్నప్పటి నుంచీ నేను ఎరుగున్న జానకిరామయ్యకీ పోలికే లేదు!

"బాబుగారూ! శలవుతీసుకుంటాను" అన్నాను.

"మంచిది. మళ్ళీ ఎన్నాళ్లకి కనిపిస్తావోగదా!" అన్నాడు.

"ఏమో, చెప్పలేనండి. ఇవాళే ఊరికి వెళ్తున్నాను. నన్ను ఎక్కడో దూరప్రదేశానికి బదిలీచేస్తారని తెలిసింది" అన్నాను.

"నువ్వు ఎక్కడున్నాసరే, కాస్త నీ బాగోగ క్షేమాలు రాస్తూవుండు నాయనా" అన్నాడు.

"అవంటమనిషిని పెటారా కి?" అన్నాడు.

"లేదోయ్. పెట్టదలుచుకోలేదు. నేనే పిల్లలకి వొండిపెట్టాలనుకుంటాను. నా చేత్తో వొండిపెడితే కాని వాళ్లు కడుపునిండా తినరు; నాకు తృప్తిగానూ వుండదు." అని బదులుచెప్పటం వినేసరికి నాకు మేరలేని ఆశ్చర్యం వేసింది.

"నిజంగా తండ్రి అంటే అల్లా వుండాలి! నిజమైన భర్త అంటే అల్లా వుండాలి!" అని మాటిమాటికీ మనసులో జానకిరామయ్యగారిని కొనియాడుతూ కలవుపుచ్చుకున్నాను.

ఆ రోజే ఆ వూరు వదిలి వెళ్లిపోయాను.

## 3

ఆ వూరు వదిలి వెళ్లాక జానకిరామయ్యగారిని గురించిన సంగతులేమీ నాకు తెలియలేదు. ఉత్తరం రాస్తానని ఎందరికో మాట ఇచ్చాను. ఆ మాట అందరి విషయంలో లాగే ఆయనవిషయంలోకూడా నీటిమూట అయిపోయింది. చాలా విషయాల్లో మనిషి మనస్సుకంటే బద్ధకానికే ఎక్కువ బలం వుంది!

ఏవేవో పనులమీద ఎన్నెన్నో ఊళ్లు తిరిగాను. కాని మళ్లీ ఆవూరు వెళ్లటం పడలేదు. జానకిరామయ్యగారిని మాత్రం ఎప్పుడూ మనసులో తలుచుకుంటూనే వుంటాను. ఆయనపిల్లలు పెద్దవాళ్లయి వుంటారు. ఆయనభారం తీరే రోజు ఆనాటికానాడు దగ్గరకి వస్తూ వుంటుంది. తన బిడ్డల సుఖంకోసం తన సుఖాన్ని తృణప్రాయంగా తోసిపారేసిన తండ్రి త్యాగాన్ని ఎన్నిసార్లో మనసులో కొనియాడుతూ వుంటాను.

ఆరేళ్లతరవాత మొన్న నొకసారి అవసరమైన పనిమీద జానకిరామయ్యగారి వూరు వెళ్లాల్సొచ్చింది. ఒంటరిగాడు కదా, ఆయనఇంట్లో దిగి ఇబ్బంది పెట్టటం ఎందుకని ఆ వూళ్లో వున్న దూరపు చుట్టాలింట్లో దిగాను. నా పని చూసుకుని తీరుబాటుగా వున్న సమయంలో ఒకసారి చూసివొద్దామని జానకిరామయ్యగారింటికి బయలుదేరాను.

వాకిట్లో అడుగుపెట్టేసరికి నా కళ్లని నేను నమ్మలేకపోయాను. ఇదివరకు పాతకాలపు పెంకుటిల్లు వుండే చోట చక్కటి సిమెంట్ కాంక్రీట్ మేడ వెలిసింది. ఇంటిచుట్టూ చెట్లూ, పశువులూ, మనుషులూ ఇల్లంతా కలకలలాడుతోంది. ఆరేళ్లకిందట నేను చూసిన పరిసరంలో కనిపించిన విషాదానికీ ఈనాటి కలకలానికీ ఎక్కడా పోలిక లేదు. పొరబాటున ఇంకెవరి ఇంట్లోనైనా అడుగు పెట్టానేమోనని వెనక్కి తిరగబోతున్నాను. నన్ను దూరంనుంచే ఎవరో ఇద్దరు పిల్లలు చూసి ఇంట్లోకి పరిగెత్తారు. వాళ్లు లలితా, రామదాసూ కావచ్చు ననుకున్నాను. ఒక్క నిమిషంలో ఇంట్లోంచి వాళ్లు తమతో ఒక పద్దెనిమిదేళ్ల స్త్రీని వెంటపెట్టుకొచ్చి, ఆమెకి నన్ను చూపించారు. ఆ స్త్రీ క్షణంసేపు కళ్లు తిప్పుతూ నాకేసి చూసి మెరుపులాగా మళ్లీ లోపలికి వెళ్లిపోయింది. జానకిరామయ్యగారున్నారా అని అడుగుదా మనుకుంటుంటేనే పిల్లలుకూడా లోపలికి వెళ్లిపోయారు. తిరుగుముఖం పడుతుంటే వెనకనుంచి "ఎవరూ?" అని పిలవటం వినబడింది. ఆ పరిచితమైన స్వరం జానకిరామయ్యగారి దని పోల్చుకుని ధైర్యం తెచ్చుకుని "నేనేనండీ, మరిచిపోయారా?" అన్నాను.

"రా, లోపలికి రా. ఇదేనా రావటం? ఎన్నేళ్లయిందీ? పద, లోపలికి పదా" అని చెయ్యిపుచ్చుకుని ఇంట్లోకి తీసికెళ్లారు.

జానకిరామయ్యగారిని నేను వెంటనే గుర్తుపట్టలేకపోవటానికి ఆయనవేషమే కారణము. సన్నటి గ్లాస్గోపంచా, నిగనిగలాడే సిల్కులాల్చీ, గజందూరంనుంచే ఘుమాయించే తలనూనె, ఆయనరూపానికి విశిష్టతను తెచ్చిపెట్టిన రోల్డుగోల్డు ఫ్రేంకళ్లజోడూ చూసి నేను బిత్తరపోయాను. ఇప్పుడాయనముఖంలో ఒక్క విషాదమేఘంకూడా పొడగట్టటం లేదు. ఏదో అసాధారణమైన మార్పు ఆయనజీవితంలో వచ్చివుంటుం దని ఊహించసాగాను. మనస్సు ఎందుకో తత్తరపడుతోంది. ఇంట్లోకి తీసుకెళ్ళి తన గదిలో కుర్చీమీద కూచోబెట్టి "లలితా! పిన్ని నడిగి కాఫీ తీసుకురా" అని కేకవేశాడు. నాది ఇతరులని వెంటనే శంకించే స్వభావం కాదు. అందుకని పిన్ని అంటే ఎవరైనా చుట్టాలేమో అనుకున్నాను. ఇంతలో జానకిరామయ్య అందుకున్నాడు—"నీ ఎడ్రసు తెలియలేదు. ఎవర్ని పిలిచినా ఎవర్ని పిలవకపోయినా నిన్ను తప్పకుండా పిలుద్దా మనుకున్నాను."

ఈ మాట నాకు చురుక్కున తగిలింది. ఇందాకటినుంచీ నేను దూరంగా పెట్టివేసిన అనుమానాలన్నీ ఒక్కసారిగా మనసులో ముసురుకుంటున్నాయ్. ఇన్నేళ్ళనుంచీ జానకిరామయ్యగారిని గురించి నాకున

సులో చిత్రించుకున్న ఊహాచిత్రం ఒక్కసారిగా రంగులన్నీ మాయమైపోయి వికృతంగా వెలవెలబోతున్నట్లు అనిపించింది.

కాఫీ వొచ్చింది. తెచ్చింది లలిత కాదు. ఇందాకా నేను గుమ్మంలో చూసిన యువతి తెచ్చింది. ఎంత ప్రయత్నించినా కాఫీకప్పు ఖాళీ చెయ్యలేకపోయాను. ఎంతో పరాభవానికీ, మోసానికీ గురిఅయినట్లుగా నా మనస్సు "పద, ఇక్కడినుంచి పదా" అని తొందరచేస్తోంది. కూచున్నంతసేపూ ముళ్ళమీద కూచున్నట్లుంది. జానకిరామయ్యమాత్రం గ్రామఫోను రికార్డులాగా ఈ ఆరేళ్ళ సంగతులూ ఏకరువు పెడుతున్నాడు.

ఈమె పేరుకూడా జానకేనట. ఈమె కళ్ళలో తన మొదటిభార్యపోలిక వుందట. ఈమెని పెళ్ళాడమని తన మొదటిభార్యే బతిమాలినట్లనిపించిందట. ఈమె పిల్లలని తన పిల్లల్లాగ చూస్తానందట. తను పిల్లల కోసమేనట ఈ పెళ్ళికి వొప్పుకుంది.

ఇంకా ఇదే ధోరణిలో తన రెండో పెళ్ళిని సమర్థించుకుంటూ చెప్పుకుపోతున్నాడు. ఎందుకీ వృథా ప్రయాస! తను చేసిన పని తప్పని ఎవరైనా అంటే కదా కాదని తను సమర్థించుకోటానికి. అందులో ఇటువంటి కుంటి సమర్థనలు ఎందరిదగ్గిరో వినివుండటంవల్ల నాకు మరీ చిరాకుగా వుంది. ఇక ఆయనమాటల జడివానకి అంతు కనబడేట్లు లేదని మధ్యలో లేచి "వెళ్ళొస్తా" అని నిలబడ్డాను.

"అయ్యో, అదేమిటీ! రాకరాక ఆరేళ్ళకి వచ్చి అప్పుడే వెళ్తా నంటమేమిటి? వీల్లేదు; వీల్లేదు" అని బలవంతాన మళ్ళీ నన్ను కుర్చీలో కూచోబెట్టాడు.

ఎలెక్ట్రిక్ ఫాన్ లేని సినిమాహాల్లో మాటినీ చూస్తున్న ప్రేక్షకుడిలా గుంది నా అవస్థ. మళ్ళీ లేచి "నేను ఇంకా చూసుకోవలసిన పను లున్నయ్. సాయంత్రం రైలుకి ప్రయాణం. వ్యవధి లేదు. వెళ్ళొస్తా" అన్నాను.

"అయితే వెళ్ళటమేనా? మాయింట్లో ఒకపూటైనా భోజనం చెయ్యవా?"

"ఆఁ, భోజనాని కేం లెండి. ఈసారి వొచ్చినప్పుడు చెయ్యనా?...మరి శెలవిస్తారా!"

"సరే, అంత కాదుకూడ దంటే బలవంతాన ఆపుతానా? వెళ్ళి రా నాయనా. మరి అంతా విన్నావు కాని నీ అభిప్రాయ మేమిటో చెప్పావు కావు." అన్నాడు ఎంతో కుతూహలంతో.

నాకు అరికాలిమంట నెత్తి కెక్కింది. "ఇది వ్యక్తిగతమైన విషయం. ఇందులో ఇతరుల అభిప్రాయాల ప్రసక్తి ఏముంది? మీకు తోచిన పని మీరు చేశారు. అది మంచో, చెడో నిర్ణయించటానికి నా కేం అధికార ముంది? శెలవిస్తారా!" అని రెండడుగులు వేశాను.

"మంచిది. వెళ్ళి రా నాయనా. ఈసారి మావూరొస్తే మాత్రం మాయింట్లోనే దిగాలి, తెలిసిందా!" అన్నాడు.

సమాధానంగా తల వూపి ముందుకి నడిచాను. వెనకనుంచి ఆయన మళ్ళీ కేకేసి "నాయనా, చెప్పటం మరిచాను. నేను నా సొంతకథని నవలగా రాశాను. దానికి జానకి పేరే పెట్టాను. అచ్చు పూర్తికాగానే నీకో కాపీ పంపిస్తాను" అన్నాడు.

"సరే, మంచిది" అని గబగబా వెళ్ళిపోయాను. దారిపొడుగునా తల తిరిగిపోయింది. మరణసమయంలో పెళ్ళానికి చేతిలో చెయ్యి వేసి రెండో పెళ్ళి చేసుకోనని శపథం చేసిన పెద్దమనిషేనా ఈయన? అనవసరంగా ఈయన్నిగురించి ఎన్ని ఊహించాను, ఎంత పొగుడుకున్నాను! చివరికి జీవితంలో అమాంతం ఎంత పల్టీ కొట్టాడు! అందుకోలేని ఆదర్శాలకోసం పాకులాడటం ఎందుకూ? బోల్తా కొట్టటం ఎందుకూ?

అయినా నాదే తప్పు. మానవమాత్రుడైన జానకిరామయ్య మానవాతీతుడై త్యాగమూర్తిగా, ఆదర్శప్రాయుడుగా మారిపోతా డని ఆశపడటం నాదే తప్పు. ముమ్మాటికీ నాదే తప్పు.

---

# విరాగి

## శ్రీ నాళము కృష్ణరావు

"సంయమివరేణ్యా! ఓ దీనజనశరణ్యా!
ఘోరవనముల గాఢాంధకారమందు
తెన్ను దెలియక యొంటిగాఁ దిరుగుచుంటి,
కావుమా నన్ను దరిచేర్చి కరుణతోడ.

ఏమి చిత్రమొ కాని—ద వ్వేఁగుకొలఁది
ఘోరభీకరరవముల గోండ్రు మనుచు
బొబ్బరింతలు వెట్టు బెబ్బులులె కాని,
కానరా రొక్కరు యిట్లైన కానలోన.

అడుగు తడబడు, మై గడగడ వడంకు,
ఒక్క యడుగైన నడవంగ నోప నింక;
దవ్వుగా వెల్గుచున్నది దివ్వె యదిగో!
నన్ను గొనిపొమ్ము ఆ దివ్వె యున్నయెడకు."

"ఈశ్వరుఁడు నీకు శుభముల నిచ్చుఁగాక!
రాత్రివేళల భీకరారణ్యములను
సంచరింపకు పాంథుఁడా, సాహసమున
క్రూరమృగములు స్వేచ్ఛగాఁ గ్రుమ్మరిల్లు.

దారుణంబగు హృదయవేదనలఁ దూలి
సదనముల వీడి కానల సంచరించు
నఖిలజనులకు నేవేళ నైనఁ గాని
ఆశ్రయం బగు నా పేద యాశ్రమంబు.

బడలికలు వాయ నేఁడు నా గుడిసెలోన
మేను వాలిచి ప్రీతితో నే నొసంగు
నామెతల నెల్ల కడుపార నారగించి
విశ్రమింపుము నాదు దీవెనల నంది.

కొండయడుగున పొలములనుండి తెత్తు
పాలు కూరలు పండ్లు దుంపలు భుజింప;
పాన మొనరింప శుద్ధమౌ స్వాదుజలము,
పండుకొనుటకు పచ్చని పరుపు నిత్తు.

తెరువరీ! నీదు వెత లెల్ల మఱచిపొమ్ము;
ఐహికం బగు కోరిక లస్థిరములు;
జనుల వాంఛలు స్వల్పముల్ జగతియందు,
వాని నెల్లను సమకూర్ప వనమె చాలు."

చల్లనగు మంచుబిందులు చదలనుండి
రాలఁగుకరణిని సంయమివరుని మధుర
భాషణంబులు తొలుకాడ, బాటసారి
మాఱు పలుకక వెడలె నా మౌనివెంట.

దట్టమైనట్టి యా కాననట్టనడుమ
కొండచెంగట నా పూరిగుడిసె యలరె,
పతితజనముల పాలిటి పట్టుగొమ్మ
పేదవారల పాలిటి పెన్నిధి యయి.

ఎపుడు జలజల ప్రవహించు నేటిదరిని
అల్లిబిల్లిగ పూఁదీగ లల్లుకొనిన
ఆ కుటీరముచెంతకు నరిగి వారు
గడప దాఁటిరి కాంతులు కడలుకొనఁగ.

లోన నడుగిడినంతనే మౌనివరుఁడు
గూటిలో నున్న దీపంబు కొడిని రాల్చి,
పొయ్యిలోపలి నిప్పుల బుగులుకొల్పి
పీటమీఁదను కూర్చుండఁబెట్టె నతని.

అరఁటియాకున వివిధభక్ష్యముల నునిచి
కోరికలు మీఱ వడ్డించి కొసరి కొసరి,
వాని చెంగటఁ గూర్చుండె మౌనివరుఁడు
చిఱునగవు నెమ్మొగమ్మున చెంగలింప.

మలయపవనుండు మెలమెల్ల మలయుచుండె,
కమ్మతావులఁ గుసుమముల్ గుమ్మరించె,
కొదమకోయిల కో యని కూయసాగె,
నింగిపైనుండి జాబిల్లి తొంగిచూచె.

వీని యన్నిట పథికుని మానసంబు
లోని నెవ్వగ లుపశమిల్లుటకు మాఱు
అంతకంతకు పెల్లుగా నతిశయిల్లి
కనులవెంబడి బాష్పముల్ కాల్వగట్టె.

అతని పరితాపమును గాంచి యతివరుండు
జాలి గొని తాను వానితోఁ బాలుగొనుచు,
పలికె నీ రీతి కూరిమి మొలక లెత్త:
"ఏల యీలీల నేడ్చెదు బేలవోలె?

గెంటిరే నిన్ను తలిదండ్రు లింటినుండి?
పఱచితివె వైరివరులకు వెఱచి నీవు?
ఆదరింపదె ప్రియురాలు నీదు వలపు?
డెందమున నిట్లు కొందల మొంద నేల?

జగతియందలి సౌఖ్యసంచయము లెల్ల
శాశ్వతంబులు గా వవి నశ్వరములు,
అల్పమగు వాని నాసించి యఖిలజనులు
భంగపడెదరు వానిని బడయలేక.

ప్రేమ యనునది యక్కటా! వెఱ్ఱి కాదె!
పై మెఱుంగులఁ గాంచి విభ్రాంతి జెంది
రమణిఁ బ్రేమింప, నామె నిరాకరించు,
ఎండమావుల వంటిది యింతివలపు."

అంచు నా యోగి యింక వచించుచుండ,
పెదవు లదరంగ, మానస మదవద వడ,
ఉస్సురుసు రని వేడి నిట్టూర్పు పుచ్చి,
ఏమి పలుకక బాలుండు మోము త్రిప్పె.

ఔర! ఎటనుండి వచ్చెనో యతని కంత
బెళుకు చూపులు, నునుసిగ్గు, కులుకు నడలు!
ఉన్నయటులుండి యా బాలుఁ డొక్కసారి
సుదతిగా మాఱె తద్దయు చోద్య మొప్ప.

చరణముల నేల వ్రాయుచు, శిరము వంచి,
గద్గదిక తొట్రుపాటును గడలుకొనఁగ
పలికె నా బాల సన్నని యెలుఁగుతోడ
పలుకు పలుకునఁ దేనియ లొలుకుచుండ:

"దిక్కు మాలినయట్టి యీ దీనురాలి
నేరముల నెల్ల నీవు మన్నింపు మయ్య!
ఈవు, దేవుఁడు వసియించు నీ కుటీర
సీమ నపవిత్రపరచితి చేరి నేను.

నాదు జనకుండు 'శుచిమతీ'నగర నేత
రమ్యవిభవుండు, తేజోవిరాజితుండు;
అతని యేకైకపుత్రిక నైనకతన
అతని సంపద కెల్ల నే నర్హురాల.

నాదు ధనమును నన్నును నాచికొనఁగ
వగుస నెందరో యువకులు వచ్చి, నన్ను
స్తుతు లొనర్చిరి చక్కని చుక్క యనుచు;
ఒక్కఁడును నాదు మనసున కెక్కఁ డయ్యె.

అరిగి రెల్లరు వారు హతాశు లగుచు;
ఒకఁడుమాత్రము నను వీడ నొల్లఁడయ్యె,
శివి పదవియు నతనికి లేవు కాని,
సుగుణ మాతని పెట్టని సొమ్ము సుమ్ము.

చెలువు గలవాఁడు, చిఱునవ్వు గులుకువాఁడు,
హొయలు గలవాఁడు, మవ్వంపు వయసువాఁడు,
ఇవ్వి యన్నియు నటు లుండ నిచ్చి—నాదు
చిత్తమును చాల రంజిల్లఁ జేయువాఁడు.

పూవుబొదరింటఁ గమ్మని తావు లొలయ,
ప్రేమగీతము లతఁ డాలపించుచుండు;
వాని తీయని చల్లని గానసుధలు
విందు లొలికించు హాయిగా వీనుగవకు.

వాని వలపులగాలి నా వాంఛ లనెడి
యలల నుఱ్ఱూత లూగించె, నైనఁ గాని
త్రోసిపుచ్చితి నక్కటా! బైసిమాలి
వాని నిర్వ్యాజనిర్మలమైన ప్రేమ.

క్రించుదనమున నేను గావించినట్టి
చేతలకు వాఁడు బ్రదుకుపై రోత జెంది
నన్ను నా గర్వమును వీడి ఖిన్నుఁ డగుచు
వనములకు నేఁగి, యచ్చట తనువు దొరఁగె.

క్రూరమగు నాదు ఘోరాపచారమునకు
ప్రతిఫలంబును ననుభవింపంగఁ దలఁచి
అతఁడు చూపిన మార్గంబు ననుసరింప
ద్రిమ్మరలుచుంటి ఘోరవనమ్ములందు.

అతఁడు నాకయి గావించినట్టి రీతి
అతనికొఱకయి నేనును నాచరింప
ఒంటిగా కాననంబుల వెంటఁ దిరిగి
ఎటులొ గ్రుక్కెడు ప్రాణంబు లీగుదాన.

"పాపము శమించుఁగాక! నా 'ప్రమదరాణి'!
ఎట్టి సాహసమున కొడిగట్టినావు?"
అనుచు నామెను బిగికౌఁగిటను గదించి
ఇట్టు లనె యోగి యనురాగ ముట్టిపడఁగ:
"రమణిమిన్నరో! నీదు సర్వస్వ మెల్ల
నెవనికొఱకయి త్యజియింప నెంచినావొ,
అమ్మహాభాగ్యరాశి 'సుధాకరుండు'
నిల్చియున్నాఁడు జీవమ్ము దాల్చి యిదిగో!

నేఁడు మొదలుగ గడెయైన వీడకుండ
అరమరలు లేని కూర్మిల ననఁగిపెనఁగి,
కొదలు దీరని కోర్కులఁ గూడి మాడి
వలపు లిగురొత్త నుందము కలసి మెలసి."

పొమ్ము దుఃఖమ! సౌఖ్యమా, రమ్ము వేగ!
ఎవతె యందని ఫల మని యిన్నినాళ్ళు
తలఁచియుంటినో, అట్టి యా లలన నేఁడు
దక్కె నది నాకు నవలీలఁ దనకుఁ దానె.

[అనువాదము]

గాంధీమహాత్ముని

# ఆత్మకథ

ప్రథమ ద్వితీయ సంపుటములు

[చతుర్థ ముద్రణము]

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారి అనువాదము

ఖద్దరు బైండు

సంపుటము 1-కి వెల రూ. 5-0-0 లు;

తపాలఛార్జి రూ. 0-9-0 లు.

ఆంధ్రగ్రంథమాల,

పోస్టుబాక్సు 212, మదరాసు 1.




## శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

బర్లిన్ నగరమునకును, పాశ్చాత్య దేశములకును మధ్య రాకపోకల నన్నిటిని ఆరువారముల క్రిందట రషియావారు బంధించుటచేత ఏర్పడిన ప్రతిష్టంభన ఇప్పటివరకు పరిష్కారము కాలేదు. రాజీమూలమునను, రాయబారములమూలమునను దానిని పరిష్కరించుటకు చేయబడిన ప్రయత్నములు ఇంకను సఫలములు కాక పోవుటయేకాక, సఫలములు కావను సందేహముకూడ ప్రబలమగుచున్నది. అందుచేతనే జూలై ౨౯ వ తేదీన బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్ పార్లమెంటులో మాట్లాడుచు బలప్రయోగము అవసరమగు పరిస్థితులు ఏర్పడనున్నవని చెప్పెను. యుద్ధముద్వారాగాక శాంతిమార్గమున బర్లిన్ సమస్యను పరిష్కారముచేయ నుద్దేశించి రషియా విదేశాంగమంత్రితోడను, రషియానియంతయగు స్టాలిన్‌తోడను ముఖాముఖి సంప్రతింపులు జరుపుటకై బ్రిటిష్ అమెరికా ఫ్రాన్సురాయబారులు ముగ్గురు మాస్కోకు వెళ్లిరిగాని కాకతాళీయన్యాయముగ రషియావిదేశాంగమంత్రి మాస్కోనుండి ఎచ్చటికో వెళ్లిపోయినట్లు తెలియుచున్నది. అతడు తిరిగి ఎప్పుడు వచ్చునో, వచ్చినను సంప్రతింపులు జరుపుటకు ఇష్టపడునో పడడో తెలియకున్నది. ఇట్టి బిగింపు మూలమున ఏర్పడబోవు ప్రమాదము ఇంతింత కాదు.

### పాశ్చాత్యరాజ్యముల వాదము

ఈ ప్రతిష్టంభనవిషయమై బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా రాజ్యములవారు జూలై ౬ వ తేదీన రషియా విదేశాంగమంత్రికి ఒక ఉత్తరమును పంపిరి. అందు వారు కొన్ని ముఖ్యవిషయములను వివరించిరి: (౧) బర్లిన్ నగరములో ఉండుటకు రషియాకు ఎంతటి హక్కు ఉన్నదో అంతటి హక్కు తమకుగూడ కలదు. (౨) రషియావారి బెదరింపులకు భయపడి వారు బర్లిన్ నగరమును ఖాళీచేయుదు రని అనుకొనుట వట్టి భ్రమ. ఆవిధముగ ఖాళీచేయ వా రెన్నడును ఇష్టపడరు. (౩) బర్లిన్ పట్టణమును నాలుగు రాజ్యములవారును కలిసి పాలించవలసిన దని ౧౯౪౫ లో ఒడంబడిక జరిగెను. దాని ననుసరించియే వారు ఈ మూడు సంవత్సరములుగ ఆ పట్టణములో నున్నారు. రషియావా రిప్పుడు కల్పించిన దిగ్బంధనము ఆ ఒడంబడికకు విరుద్ధము. రషియావా రొక్కరే బర్లిన్ పట్టణమును పాలింప నెంచుట ఆ ఒడంబడికకు విరుద్ధముగ ప్రవర్తించుటయే. (౪) ఈ విరుద్ధచర్యవలన ప్రమాదకరమగు ప్రపంచపరిస్థితులు సంభవించినవి. (౫) కనుక దిగ్బంధనమును వారు వెంటనే రద్దుగావించవలెను. (౬) అది రద్దయిన తర్వాత ఇతర విషయములనుగురించి సంప్రతింపులు గావించుటకు పాశ్చాత్యరాజ్యములవారు సంసిద్ధులై ఉన్నారు.

### రషియా జవాబు

ఈ ఉత్తరములోని విషయములనుగురించి రషియాప్రభుత్వమువారు సమగ్రముగ ఆలోచించి ౧౪ వ తేదీన వారి జవాబును పాశ్చాత్యరాజ్యములకు

పంపిరి. ఆ జవాబుయొక్క సారాంశము ఒకటియే. మూడుసంవత్సరములక్రిందట జరిగిన ఒడంబడికకును, ఇప్పటి పరిస్థితులకును ఎట్టి సంబంధము లేదు. ఆ ఒడంబడికకు విరుద్ధముగ ఈ మూడు సంవత్సరములలో పాశ్చాత్యరాజ్యములవారు ఎన్నో పనులను గావించిరి. అందులోని సూత్రములను వారు ఏమాత్రము అనుసరించి యుండలేదు. జర్మనీకంతకు ఒకే ప్రభుత్వము ఏర్పడవలె ననియు, అది ఏర్పడునంతవరకు నాలుగురాజ్యములవారు కలిసి జర్మనీని పాలించవలె ననియు ఆ ఒడంబడికలో స్పష్టముగ ఉండినను దానికి విరుద్ధముగ పాశ్చాత్యరాజ్యములవారు జర్మనీని విభజించి, పశ్చిమ జర్మనీలో ప్రత్యేకప్రభుత్వము నొకదానిని నిర్మాణము చేయుటకు ఈ మధ్యనే లండనులో జరిగిన సమావేశములో తీర్మానించుకొనిరి. ఈ సమావేశమునకు వారు రష్యాను ఆహ్వానించియుండలేదు. దీనిమూలమున ఏర్పడు ప్రత్యేకప్రభుత్వమందు రష్యావారికి ఎట్టి స్థానము లేదు. ఒకే పరిపాలనముక్రిందట ఉండవలసినట్టియు, నాలుగు రాజ్యములు కలిసి పరిపాలింపదగినట్టియు జర్మనీని ఈవిధముగ రెండు ముక్కలు జేసి, పాశ్చాత్యభాగమును రష్యావారి ప్రసక్తి లేక తక్కిన ముగ్గురు రాజ్యములవారుమాత్రమే పాలించుటకు సంసిద్ధపడుటచేతనే, రష్యావారి ఆక్రమణభాగములో నున్న బర్లిన్ పట్టణమును పరిపాలించు హక్కును పాశ్చాత్యరాజ్యములవారు కోల్పోయిరి. కనుక బర్లిన్‌లో ఉండుటకు తమకు హక్కు గల దని అనుట ఒడంబడికకు విరుద్ధము. ఇదిగాక, రష్యావారి అనుమతిని పొందక పశ్చిమజర్మనీయందేకాక బర్లిన్‌నగరములోగూడ పాశ్చాత్యరాజ్యములవారు క్రొత్త చెలామణిని ప్రవేశపెట్టుటకూడ ౧౯౪౫ లో గావించుకొన్న ఒడంబడికకు విరుద్ధము. ఈవిధముగ ఒడంబడికకు విరుద్ధముగ ప్రవర్తించి, పశ్చిమజర్మనీపరిపాలనమందు రష్యాకు ఎట్టి స్థానము లేకుండ జేసిన పశ్చిమ రాజ్యములవారు బర్లిన్‌నగరములో స్థిరముగ నుండవలె నని వాదించుట హాస్యాస్పదము. ఆ హక్కును వారెన్నడో కోల్పోయిరి. కనుక సంప్రతింపులు జరుగవలసియున్నయెడల ఒక బర్లిన్‌విషయమునుగురించియే కాక, రష్యాకును పాశ్చాత్యరాజ్యములకును మధ్య ఏర్పడిన వివాదాంశము లన్నిటినిగురించి జరుగవలెను. బర్లిన్‌ప్రతిష్టంభన పరిష్కారమైనగాని ఈ సంప్రతింపులు ప్రారంభము కాగూడ దను పాశ్చాత్యరాజ్యములవారి వాదము ఏమాత్రము చెల్లజాలదు.

## ముఖాముఖప్రసంగము

ఇట్టి ఉత్తరప్రత్యుత్తరములమూలమున కాలయాపన జరుగుటయు, బర్లిన్‌నగరములోని ౨౫ లక్షల జనమునకు కావలసిన ఆహారపదార్థముల సరఫరా మరింత కష్టమగుటయు తప్ప వేరు ఫలిత మేదియు ఉండదు. ఏదో ఒకటి వెంటనే తేలిపోవుట మంచిది. ఇదిగాక, యుద్ధములో ఇప్పుడిప్పుడే దిగుటకు ఎవరికిగాని అంత ఉత్సాహము లేదు. అన్ని దేశములలోని సామాన్యప్రజలు యుద్ధమందు విముఖత్వమును చూపుచున్నారు. ఇట్టి స్థితిలో యుద్ధము రాకుండుటకై చేయదగిన ప్రయత్నముల నన్నిటిని—ఒకదానినికూడ వదలివేయక—చేయుట ధర్మము. ఈలాటి భావము కలవారై రష్యావిదేశాంగమంత్రియగు మాలటావును స్వయముగ కలిసికొని, అతనితో సమస్తవిషయములను సంప్రతించి, వీలైనయెడల స్టాలిన్‌తోకూడ ప్రసంగించుటకు ఉద్దేశించి పాశ్చాత్యరాజ్యముల రాయబారులు నాలుగురోజులక్రిందట మాస్కో చేరిరి. కాని మాలటోవు అచ్చట లేనందున ఈ ముఖాముఖి ప్రసంగములు జరుగునో, జరగవో సందేహముగ నున్నది.

## యుద్ధసన్నాహము

యుద్ధములో దిగుటకు ఎవరికిని ఇష్టము లేకున్నను ఉభయపక్షములవారు రెండు సంవత్సరములుగ యుద్ధసన్నాహమును చేయుచునేఉన్నారు. సుమారు పండ్రెండులక్షల సైన్యమును రష్యావారు తూర్పు జర్మనీయందు సమకూర్చియున్నట్లు తెలియుచున్నది. దీనికి తగిన విమానములు, ఇతరపరికరములు వారు చేర్చియున్నారు. పాశ్చాత్యరాజ్యములవారి బలమునకంటె తమ బలమే అధికమైన దను అభిప్రాయము జర్మనీప్రజలలోను, ఇతరదేశములవారిలోను వ్యాపింప జేయు ఉద్దేశముతో వారు గత నాలుగువారముల

మధ్య సైనికవిన్యాసములను, విమానవిన్యాసములను ఎన్నిటినో గావించిరి. ఇదిగాక, గత అయిదారు మాసములమధ్య తూర్పు యూరపుఖండములోని పోలెండు, జెకోస్లొవేకియా, హంగేరి, బల్గేరియా, రుమేనియా, ఆల్బేనియా మొదలగు దేశములకును, రషియాకును గల పరస్పరఆర్థికరాజకీయసంబంధములను బలపరచుకొనిరి. ఇతరదేశములపై ఆధారపడవలసిన అవసరము లేక యుద్ధకాలమందు కావలసిన వస్తుసామగ్రినంతను సులభముగ సమకూర్చుకొనుటకు కావలసిన సదుపాయముల నన్నిటిని రషియావారు చేసుకొనుచున్నారు.

పాశ్చాత్యరాజ్యములవారుకూడ ఇట్టి సన్నాహమందు నిమగ్నులైఉన్నారు. యూరపుఖండములో ౧౬ రాజ్యములకు కావలసిన ఆర్థికసహాయము చేయు ఉద్దేశముతో అమెరికావారు ఏర్పరచుకొన్న మార్షల్ పథకము ఈ సన్నాహములో ఒక ప్రధానాంగము. ఇప్పటికి కొంతవరకు ఇట్టి సహాయమును వారు చేసి తద్వారా యూరపుఖండములోని పశ్చిమదేశములలో తమ ప్రాబల్యమును స్థాపించుకొనియున్నారు. ఇదిగాక ఇంగ్లండు, ఫ్రాన్సు, బెల్జియం, హాలెండు, లక్సంబర్గు దేశముల మధ్య ఏర్పడిన సమాఖ్య జూలై నెలలో మరింత బలపడినది. ఈ అయిదుదేశముల విదేశాంగ మంత్రులు హేగునగరమున సమావేశమై యుద్ధము సంభవించినయెడల వారేలాటి సైనికచర్యలు ఏర్పరచుకొనవలెనో నిర్ణయించుకొనిరి. ఈ సంప్రతింపులలో ఇంకొక విశేషముకూడ స్పష్టమయ్యెను. ఈ దేశముల ప్రభుత్వములు అమెరికాకనడాదేశములతో సైనికసహాయమునకు సంబంధించిన ఒడంబడికలు చేసుకొన తీర్మానించుకొనినవి. ఇది మిక్కిలి ప్రధానమైన విషయము. పశ్చిమయూరపుదేశములకు తాము చేయదలచుకొన్న సహాయము ఆర్థికరూపమునేగాక సైనికరక్షణరూపము ధరించుట అగత్యమని అమెరికావారు నిశ్చయించుకొనిరి. ఇందునిమిత్తమై వారు కనడాప్రభుత్వముతో కూడ సమాలోచనలు జరిపిరి. ఈ సమాలోచనలకు ఫలితముగ పశ్చిమయూరపుసంరక్షణలో అమెరికా కనడాదేశములు రెండును కలిసి పనిచేయుటకు తీర్మానము జరిగెను. కనుక ఎప్పుడైనను రషియాకును, అమెరికాకును యుద్ధము ప్రారంభమైనయెడల పశ్చిమయూరపుదేశములు కనడా అమెరికాపక్షమును వహించి యుద్ధములోకి దిగుట సత్యము.

## ఫ్రాన్సు

కాని జూలై నెలలో కొన్ని రోజులవరకు ఫ్రాన్సుదేశము పశ్చిమయూరపు సమాఖ్యలో కలిసి ఉండునా అన్నవిషయమై గొప్పసందేహమేర్పడెను. ఆ దేశములో గత ఎనిమిదిమాసములుగ క్రిస్టియన్ డెమొక్రాటిక్ పార్టీ సోషలిస్టుపార్టీలు కలిసి మంత్రివర్గమును ఏర్పాటుచేసి, సహకారభావముతో ప్రవర్తించుచుండెను. కాని ఉన్నట్లుండి జూలైలో ఈ సహకారము అడుగంటెను. సోషలిస్టులు మంత్రివర్గముతో కలిసి పనిచేయుట మానుకొనిరి. మంత్రివర్గమునకు విరోధులైనవారి సంఖ్య పార్లమెంటులో అధికమయ్యెను. అందుచేత ఆ మంత్రివర్గము రాజీనామా ఇచ్చెను. ఇంకొక మంత్రివర్గము ఏర్పడుట సులభసాధ్యము కాకపోయెను. పార్లమెంటులో కమ్యూనిస్టుపక్షము ఎక్కువ ప్రాబల్యము కలది. ఇట్టి క్లిష్టపరిస్థితులలో కమ్యూనిస్టులు దేశశాంతికి ప్రమాదము కలిగించి విప్లవము లేవదీయుదురేమో అను భయముకూడ బయలుదేరెను. కాని అదృష్టవశాత్తు అట్టిదేదియు జరుగలేదు. వారము పదిరోజులు వివిధపార్టీల మధ్య బేరములు జరిగి తుదకు ఎట్లో ఒక నూతన మంత్రివర్గమేర్పడెను. విదేశాంగవ్యవహారములలో అమెరికా, ఇంగ్లండులతో సహకరించు ఉద్దేశము ఈ మంత్రివర్గమునకు కలదు. కనుక పశ్చిమయూరపు సమాఖ్యకు ప్రస్తుతము ప్రమాదమేదియు ఉండదని చెప్పవచ్చును.

## ఇటలీ

ఇటలీలోకూడ కొన్నిరోజులపర్యంతము ప్రమాదావస్థ ఏర్పడెను. అచ్చటి కమ్యూనిస్టుపక్షమునకు నాయకుడైన టోగ్లియట్టీని చంపుటకు పార్లమెంటులోనే ఒక యువకుడు ప్రయత్నించెను. గుండుదెబ్బ అతనికి తగిలినను అతడు మరణించలేదు. అయినప్పటి

కిని కమ్యూనిస్టుపక్షమునకు చెందిన సుమారు ౨౦ లక్షల కార్మికులు మరుసటిరోజున సమ్మెకట్టి కొన్ని ప్రదేశములలో అల్లరులను ప్రారంభించిరి. కాని ఈ సమ్మె రెండురోజులలో ముగిసెను. కార్మికులు యథాప్రకారము వారివారి పనులలో చేరిరి. ఇట్లుగాక, మరికొన్ని రోజులు వారు సమ్మెను జరిపియుండినయెడల కమ్యూనిస్టుపక్షమునకును, ఇతరపక్షములకును అంతర్యుద్ధము తప్పక జరిగియుండెడిది. దానిమూలమున పశ్చిమయూరపులో అమెరికావారి యుద్ధసన్నాహమునకు కూడ దెబ్బ తగిలి యుండెడిది. కాని ఈ ప్రమాదము కూడ ఇప్పటికి తప్పిపోయెను.

### యూ గో స్లా వి యా

రషియాకును, పాశ్చాత్యరాజ్యములకును మధ్య ప్రస్తుతము ఏర్పడిన విషమపరిస్థితులలో ఫ్రాన్సు ఇటలీ దేశములలోని రాజకీయవర్గముల పరస్పరకలహములు విపరీతములు కాకుండుట పాశ్చాత్యరాజ్యములవారు సంతోషింపదగిన విషయము. ఇంతకంటెను ఇంకొక విషయమును గురించి వీరు మరింత అధికముగ సంతోషించుచున్నారు. ఒక కమ్యూనిస్టుపార్టీకి చెందిన యూగోస్లావియానియంతయగు టిటోకును, రషియా నియంతయగు స్టాలినుకును మధ్య పరస్పరఅభిప్రాయభేదము ఉత్పన్నమగుటయు, అందుమూలమున అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీవారు టిటోను బహిష్కరించుటయు జూన్‌మాసములో జరిగెను. తూర్పుయూరపులోని దేశములన్నియు రషియావారిని ఆశ్రయించునవి అనియు, స్టాలిన్ శాసనములకు విరుద్ధముగ ప్రవర్తింపవనియు ఇదివరకొక అభిప్రాయ ముండెడిది. కాని టిటో బహిష్కరణముమూలమున కమ్యూనిస్టులలోనే ఒక చీలిక ఏర్పడినట్లు చెప్పవచ్చును. ఈ చీలికమూలమున తూర్పుయూరపులో రషియాకు గల ప్రాబల్యము కొంతవరకు తగ్గిపోవచ్చును.

### చీలికకు కారణములు

ఈవిధముగ టిటోకును, అంతర్జాతీయకమ్యూనిస్టుపార్టీకిని మధ్య ఏర్పడిన చీలికకు పూర్తికారణములివి యని ఇంకను స్పష్టము కాలేదు. అయినను కొన్ని కారణములను సూచించుటకు వీలున్నది. టిటో యూగోస్లావియా, బల్గేరియా, ఆల్బేనియా మొదలగు బాల్కన్ దేశముల నన్నిటిని కలిపి ఒక ప్రత్యేకసమాఖ్యను ఏర్పరిచి దానికి తాను నాయకుడు కావలెనని ఉద్దేశించియున్నాడు. ఇట్టి సమాఖ్య ఏర్పడినయెడల టిటోకు ఎక్కువ ప్రాధాన్యము లభించుటయు, దక్షిణయూరపులో రషియాకు గల ప్రాధాన్యము కొంత తగ్గుటయు సంభవించును. అందుచేత అట్టిది జరుగుట రషియాకు ఎంతమాత్రము ఇష్టము లేదు. ఇదిగాక, యూగోస్లావియాలోని పరిశ్రమలు వృద్ధిగాంచుటకు విదేశములనుండి యంత్రసామగ్రులు తెచ్చుకొనవలసిన అవసర మున్నది. అవి రషియాలో దొరకవు. అమెరికాలో అవి సులభముగ లభించును. అందుచేత టిటో అమెరికనులతో వ్యాపారసంబంధములను కల్పించుకొనదలచుచున్నాడు. అదికూడ రషియావారికి ఇష్టము కాదు. ఇదిగాక, కమ్యూనిస్టుసిద్ధాంతములనుగురించియు, వాటి వ్యాఖ్యానము గురించియు టిటోకును రషియావారికిని అభిప్రాయభేదము లెన్నో ఉన్నవి. టిటో నిజమైన కమ్యూనిస్టు కాదను ప్రచారము అతని విరోధులు చేయుటకిదియే కారణము. హిందూమతములో చేరినవారిలో స్మార్తవైష్ణవాదిభేదము లుత్పన్నమైనట్లు కమ్యూనిస్టులలోగూడ ఇట్టి తత్వభేదము లేర్పడుచున్నవి. టిటో బహిష్కారమున కిదికూడ ఒక కారణమే.

బర్లిన్‌లో ఏర్పడిన ప్రతిష్టంభన రాజీద్వారా పరిష్కారమగు సూచనలు లేవనియు, అందుచేత ఇరుపక్షములవారు యుద్ధసన్నాహములు చేయుచున్నారనియు దీనినిబట్టి తేలుచున్నది. (1-8-'48)

# మన ప్రాచీనసంఘతత్త్వ శాస్త్రంలో ఒక అధ్యాయము

•

# అగ్న్యాధానము-అగ్నిహోత్రము

శ్రీ నిర్వికల్పానందస్వామి

మన సమాజంపేరు హిందూసమాజం. కాని దీన్ని వైదికసమాజం అనటం ఉచితం. ఏమంటే, ఇది వేదానుశాసనాన్ని, వేదానుగత్వాన్నీ స్వీకరిస్తోంది. ఈ సమాజంయొక్క ప్రధానానుష్ఠానం యజ్ఞం. యజ్ఞంలోనే ఈ సమాజం ప్రతిష్ఠితమైంది. "యజ్ఞాద్ భవతి; యజ్ఞే ప్రతిష్ఠితమ్" మొదలైన పదాల్లో కూడా గీతాకారుడు ఈ రహస్యాన్ని ధ్వనింపజేశాడు. ఈ యజ్ఞానుష్ఠానంయొక్క తాత్పర్యాన్ని గ్రహింపక పోతే, ఈ సమాజేతిహాసంయొక్క వైశిష్ట్యం మనకు అర్థం కాదు. కనుక, ముఖ్యంగా బ్రాహ్మణ గ్రంథాల్ని అనుసరించిన్నీ, కీట్సు, మేక్డొనల్, రమేంద్ర సుందర త్రివేదిమున్నగు మహనీయుల రచనల ననుసరించిన్నీ తెలియజేస్తాను.

## వైదికసమాజం : ద్విజసమాజం

ఆరంభంలోనే ఒక విషయాన్ని ఒప్పుకోవలసి ఉంటుంది. ఈ సమాజానికి చాదస్తం ఎక్కువ. ఆర్యుల్లో ఒక శాఖ భారతవర్షంలో ప్రవేశించి, నూతనమున్నూ, విశిష్టమున్నూ అయిన సమాజతంత్రాన్నొకదాన్ని ఏర్పరచింది. ఈ సమాజతంత్రానికి చెందిన సారస్వతమే వేదము. ఈ సమాజంయొక్క ఆచారకాండ యావత్తూ వేదంయొక్క విధినిషేధాలమీద ఆధారపడి ఉంది. ఆర్యుల ప్రవేశానికి పూర్వం భారతదేశంలో ఉన్న ఆదిమవాసులీ సమాజంలో అంతర్భుక్తత్వాన్ని పొందలేకపోయారు. కొందరు అనుగత్వాన్ని స్వీకరించారు. పండితులు అనుమితివల్ల మనకు తెల్పిందేమంటే : కేవలం వైదికార్యులే తమ్ము ద్విజులని వ్యవహరించుకొనేవాళ్ళు. ఇంక వాళ్ళని ఆశ్రయించుకొని ఉన్న అనార్యులే శూద్రులు. ఆశ్రయించుకొని ఉన్నా శూద్రులకు సమాజంలో అన్ని అధికారాలూ లభింపలేదు. వైదికులైన ద్విజులంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులనే గమనించాలి. ఆచారభేదాన్ననుసరించిన్నీ, వృత్తిభేదాన్ననుసరించిన్నీ ఈ విభాగం. ఇది కేవలం 'థియరీ' యే. వాస్తవానికి ఈ మూడింటి మధ్యా నిర్దిష్టమైన సీమారేఖ ఉందంటానికి వీలులేదు. ఇప్పుడున్న మాదిరే ఉండి ఉండవచ్చు. కాని, థియరీ ప్రకారం ప్రతివాణ్ణీ ఏదో ఒక వర్ణశ్రేణిలో పడెయ్యటం జరిగేది. తర్వాత వచ్చిన ధర్మశాస్త్రాలు ఈ మూడు వర్ణాలతో అనులోమ విలోమ గుణకారాలు చేసి, సంకరవర్ణోత్పత్తిని తెల్పటానికి ప్రయత్నించాయి. కనుక త్రివర్ణ - విభజన థియరీ మాత్రమే అంటానికి ఇంకా వీలుపడుతోంది. వైదికసమాజానికి చెందిన ప్రతివాడున్నూ తన్ను ద్విజుడని వెల్లడించుకొని అనార్యమ్లేచ్ఛశూద్రుల నుండి తన స్వాతంత్ర్యాన్ని — పృథగ్భావాన్ని — రక్షించుకొంటానికి పాటుపడేవాడు. ఇదే వైదిక సమాజంయొక్క ఛాందసత్వం.

అన్యసమాజానికి చెందినవాళ్ళు ఓ పట్టాన్ని ఈ సమాజంలో ప్రవేశించటానికి వీలుపడేది కాదు. అసలే ప్రవేశించటానికి వీలుపడేదికాదు అంటానికి వీల్లేదు. చాలామంది అనార్యులు, ఇంకా చెప్పాల్సి వస్తే మ్లేచ్ఛులు కూడా ఈ సమాజంలో ప్రవేశించి,

ద్విజన్మల అధికారాల్ని సంపూర్ణంగా పొందారు[1]. ఇంకో వైపున చాలామంది ద్విజులు ఈ సమాజాన్ని స్వేచ్ఛాపూర్వకంగా పరిత్యజించి శూద్రు లయ్యారని చరిత్ర వెల్లడిస్తోంది. ఇప్పుడు వీళ్ళు ఈ కృత్యానికి పరితపిస్తూ, ద్విజత్వాన్ని పొందటానికి వ్యాకుల పడుతున్నారు. అయినప్పటికీకూడా, నేటివరకూ ఈ ద్విజసమాజం ఇతరసమాజాలనుండి తన పృథక్త్వాన్ని రక్షించుకొంటూనే వస్తోంది అని చెప్పాల్సి ఉంటుంది.

వేదాధికార్ని బట్టే ఈ పృథక్త్వం. ద్విజుడైనవాడు, ఏ వర్ణానికి చెందినా సరే, వేదాన్ని చదవటానికీ, తదుక్తకర్మలను ఆచరించటానికీ పరిపూర్ణాధికారం ఉంది. మొదట్నించీ శూద్రులుగా పరిగణింపబడినవాళ్ళకున్నూ, ద్విజత్వాన్ని త్యజించి శూద్రత్వాన్ని వరించినవాళ్ళకున్నూ — వాళ్లు ఈ సమాజాంతర్గతులే అయినా — వేదాధ్యయనానికిన్నీ, తదుక్తకర్మల్ని ఆచరించటానికిన్నీ సంపూర్ణాధికారం లేదు.

## ఈ ద్విజశబ్దానికి అర్థం ఏమిటి?

వర్తమానకాలంలో విద్యార్జన అంటే చదువుకొని డిగ్రీ పొందటం. దీనికోసం ఎంతగానో కాగితాలూ, సిరా ఉపయోగించి, ఎన్నో పుస్తకాల సాహాయ్యంతో చదువుకొని వ్రాసి విద్య నార్జించాలి. కాని, అప్పటికింకా లిపి అమల్లోకి రాలేదు. కనుక, అప్పుడు వ్రాయటం, చదవటం అనేవి ఉండేవికావు. కాని, విద్యోపార్జన ఉండేది. వ్రాయటం, చదవటం అనేవి లేకుండా విద్యోపార్జన ఎట్లాగ? అనే సందేహం ఈ కాలంలో మనకు కలుగవచ్చు. కాని, ఆ కాలంలో ఇవి లేకుండానే విద్యార్జన జరిగేది. వైదికసమాజం యొక్క ప్రాచీనవిద్యే వేదం. చారిత్రకదృష్టితో చూస్తే, ఈ దేశంలో ఉద్భవిల్లిన విద్యలన్నిటికీ మూలవిద్య వేదం అనే సంగతి చాలా తేలిగ్గానే తెలుస్తుంది. ప్రాచీనద్విజసమాజానికి చెందిన ప్రతిబాలుడికీ ఈ వేదవిద్యలో కొంత కాకపోతే కొంతైనా నేర్చుకోవల్సి ఉండేది. దీనికోసం ఆచార్యుడిదగ్గిరకు వెళ్ళాల్సివచ్చేది; ఉపనయనం అంటే ఇదే. ఇప్పటి భాషలో పాఠశాల్లో చేరటం. కొంతకాలం ఆచార్యుడిదగ్గర అంతేవాసిగా ఉండి, తత్ప్రదత్తమైన వేదవిద్యని గ్రహించి, ఆయనఅనుమతిని పొంది ఇంటికి వచ్చేవాళ్లు. ఈ తిరిగిరాటం పేరు సమావర్తన. ఇప్పుడు 'ప్యాస్-సర్టిఫికేట్' పొందటంలాంటిది. సమావర్తన కాకపోతే వివాహాధికారం కలుగదు. వేదవాక్యాలకు ఇంకో పేరు 'బ్రహ్మ'. ఆచార్యగృహంలో వేదవాక్యాల్ని అధ్యయనం చేసేవాడు బ్రహ్మచారి. ఇతడు పాలించవలసిన నియమాలే బ్రహ్మచర్యవ్రతం.

## నైష్ఠిక బ్రహ్మచారి : సన్న్యాసి

వేదాధ్యయనతృష్ణ చాలా తీవ్రంగా ఉన్నవాళ్లు యావజ్జీవం బ్రహ్మచార్లుగానే ఉండిపోయి, వేదాధ్యయనం చేసేవాళ్లు. వాళ్లు గృహస్థాశ్రమాన్ని స్వీకరించేవాళ్లే కాదు. మరికొందరు జ్ఞానకాండవల్ల ఆకర్షింపబడి, గార్హస్థ్యమంటే విరక్తిని పొందేవాళ్లు. వీళ్లు నివృత్తిపరులై సన్న్యాసాన్ని స్వీకరించేవాళ్లు. పైన చెప్పిన నైష్ఠికబ్రహ్మచారులకీ, ఈ సన్న్యాసులకూ వివాహంతో నిమిత్తం లేదు[3].

---

1. యన్నామధేయశ్రవణానుకీర్తనాద్
యత్ప్రహ్వణా ద్యత్స్మరణా దపి క్వచిత్,
శ్వాదోఽపి సద్యః సవనాయ కల్పతే,
కుతః పునస్తే భగవ న్ను దర్శనాత్.
— భాగ. 3-33-౬

2. (అ) స [సగరః] తద్గురువచన మభినంద్య తేషాం
[యవనాదీనాం] వేషాన్యత్వ మకారయత్.
— విష్ణు పు. ౪-3-౨౧

(ఆ) శూద్రో బ్రాహ్మణతా మేతి
బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్. — మను.

(ఇ) "న జాతిః కారణం తాత
గుణాః కల్యాణ కారణమ్,
వృత్తస్థ మపి చండాలం
తం దేవా బ్రాహ్మణం విదుః"

3. యదహరేవ విరజే త్తదహరేవ ప్రవ్రజేత్.
— జాబాల. ఉ. ౪.

## గృహస్థు

మిగిలినవాళ్లు ఇంటికి తిరిగివచ్చి, పెళ్లిచేసుకొని గృహస్థులయ్యేవాళ్లు. సమాజం అంటే ఈ గృహస్థుల సమష్టే. గార్హస్థ్యధర్మాన్ననుసరించకుండా, లోకానికి దూరంగా ఉండి, చిరకాలం విద్యోపార్జనలోనో, లేక జ్ఞానాన్వేషణలోనో మునిగి తేలేవాడు సమాజానికి పరాయివాడే. అట్లాంటివాళ్లని సమాజం పాలించినా, రక్షించినా, వాళ్లు సామాజికులు కారు.

సమావర్తనానంతరం వివాహం. వివాహం కాకపోతే గృహస్థుడు కాలేడు. గృహపతి కాడు. వివాహం చేసికోనివాడికి గృహం లేదు. 'గృహిణీ గృహముచ్యతే'. పాశ్చాత్యదేశాల్లో జనాభా పెరిగిందన్నప్పుడు పెళ్లిచేసుకోకూడదనిన్నీ, మళ్లీ తగ్గిపోయిందని తోచినప్పుడు ప్రతివాడూ పెళ్లిచేసికొనితీరాల్సిందే, చేసుకోకపోవడం నేరంకింద పరిగణించబడుతుందనిన్నీ చట్టాలు చెయ్యటానికి సంకోచింపరు. వాళ్లు పాటుపడేది రాష్ట్రకల్యాణార్థమే. ఈ రాష్ట్రకల్యాణాన్ని మనస్సులో ఉంచుకొనే ఎన్నో దేశాలు స్కూలుకు పెళ్లి చదువుకోటం నిర్బంధవ్యవస్థగా చేశారు. అయితే, వివాహవిషయంలోకూడా రాష్ట్రకల్యాణార్థమైనప్పుడు ఇంక సంకోచించాల్సిన పనేముంది? ఇప్పుడు సర్వత్రా అందరూ ఏమి చేసినా రాష్ట్రంనిమిత్తమే కదా? కాని, ప్రాచీనభారతవర్షంలో ప్రాచీనరాష్ట్రతంత్రానికి ఇంతటి ప్రభుత్వం లేదు. కాని, సమాజశుభాన్ని మనస్సులో ఉంచుకొనే ధర్మాధర్మనిరూపణ జరిగేది. చట్టాలవల్ల బాధ్యతను ప్రతిష్ఠించటం అనేది భారతవర్షంయొక్క ధాతువులోనే లేదు. (కనుకనే, ఇప్పుడు ఎన్నో చట్టాలు వచ్చినా, మనకు బాధ్యతను నేర్పలేకపోతున్నాయి.) సమాజంలో ఉన్న కొన్ని విషయాల్ని ఆశ్రయించుకొని ఈ బాధ్యత ప్రతిష్ఠితమై ఉండేది.

స్వేచ్ఛగా నైష్ఠికబ్రహ్మచర్యాన్నీ, సన్న్యాసాన్నీ స్వీకరించినవాళ్లు పెళ్లే చేసుకోరుకదా! వాళ్లని చట్టమూలంగా వివాహితుల్ని చెయ్యటం అనే సంగతిని ఈ దేశసమాజం స్వప్నంలోకూడా భావింపలేదు. కాని, గృహస్థు కాదలచినవాడు పెళ్లిచేసుకోటం ముఖ్యం. పెళ్లి కాకపోతే అతనికి పరిపూర్ణంగా సామాజికత్వం లభింపదు. వేదవిహితమైన కర్మల నన్నిట్నీ సపత్నీకంగా అనుష్ఠించాలి.

## వివాహితుడే గృహస్థు

అపత్నీకుడికి మర్త్యజీవననియామకులైన దేవతల్తో సంబంధం కలుగజాలదు. అదుగో, దేవతలు మనుష్యదత్తయజ్ఞభాగాలనిమిత్తం అఞ్జలు చాచి అపేక్షిస్తున్నారు. అపత్నీకుడు యజ్ఞభాగాల్ని దేవతలకు అర్పించలేడు. అంతే కాకుండా, పితృదేవతలతో కూడా ఎట్లాంటి సంపర్కమూ కలుగదు. ఈ పితృదేవతలు పురుషపరంపరాదత్తమైన4 పిండభోజననిమిత్తం కూర్చొని ఉన్నారు. అపత్నీకుడు వంశాన్ని రక్షింపలేడు. పితృదేవతలు పిండవిచ్ఛేదభయంతో కన్నీళ్లు కారుస్తున్నారు. అదిన్నీ కాక, పిండప్రదాతే పైతృకసంపత్తికి అధికారి. కనుక, అవివాహితుడికి సమాజంలో పరిపూర్ణమైన స్థానం లేదు. ఇతరసామాజికుల్తో సరియైన సంబంధబాంధవ్యాలు కలుగవు. ఈ పూర్ణత ఏర్పడటానికి వివాహం అవసరం. అంతే కాకుండా వివాహం షోడశసంస్కారాల్లో ఒక సంస్కారం.

'సమావర్తన' అవుతేగాని పెళ్లి కాదనే సంగతి చెప్పాం. ఇప్పుడు ప్యాసైనవాళ్లకి బజారులో ధర ఎక్కువ పలుకుతుంది. పూర్వం ప్యాసుకాకపోతే పెళ్లే లేదు. ఇప్పుడు ధర్మశాస్త్రాల నిర్బంధం కాకపోయినా, మెళ్ళో నూలుపోగు చూపించకపోతే పెళ్లి కాదు. ఈ నూలుపోగు, దాన్ని ధరించినవాడు ఎంత మూర్ఖుడైనా వేదసారమైన గాయత్రీమంత్రాన్ని అభ్యసించాడనే విషయాన్ని తెలియపరుస్తుంది. కాని, పూర్వం ఇంత తేలిగ్గా వివాహం అయేది కాదు అని అనుకొంటానికి అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి.

---

4. ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః.
—తై. ఉ. ౧-౧౧-౧.

వేదవిద్యలో కొంత కాకపోతే కొంతైనా అంటకపోతే, ఆచార్యుడు సమావర్తనకు అభ్యనుజ్ఞ ఇచ్చేవాడు కాదుట. కనుక, సమాజంలో సంపూర్ణంగా మూర్ఖులైనవాళ్లు ఉండేవాళ్లే కాదు. ఉంటే వివాహం అయేది కాదు. అంటే, సమాజంలో అల్లాంటివాళ్ళకు స్థానం లేదు. కనుక విద్యాలాభం, వివాహం అనేవి రెండున్నూ ముఖ్యనియమాలుగా పరిగణింపబడేవి. చదువులేనివాడికి పెళ్ళి నిషిద్ధం. అంతేగాని 'వివాహో విద్యానాశాయ' కాదు.

ఇప్పుడు అందర్నీ చదువుకొన్నవాళ్ళనుగా చెయ్యాలని ప్రయత్నం చేయబడుతోంది. దీనికోసం రాష్ట్రశక్తి శాసనాలసాయాన్ని గ్రహింపబోతోంది. ఒకప్పుడు శాస్త్రకారుల వ్యవస్థ ననుసరించే ఈ దేశములో విద్య 'కంపల్సరీ' అయింది. ఆకాలంలో ఉన్నతవిద్యగా పరిగణింపబడ్డ వేదవిద్య అందరికీ అబ్బేది. చదువు లేకపోతే పెళ్ళి కా దనే సూత్రాన్ని మళ్ళీ అవలంబించి, అందరికీ మళ్ళీ ఈకాలపు ఉన్నతవిద్యను ప్రసాదించటం సాధ్య మవుతుందేమో అనే విషయాన్ని మన విద్యామంత్రి ఆలోచించి చూడాల్సిన విషయం.

## ద్విజుల అధికారాలు

ఇంతకూ తేలింది: ప్రాచీనభారతవర్షీయసమాజంలో అశిక్షితుడైన వ్యక్తికి స్థానం లేదని, ఇల్లాంటివాడు గార్హస్థ్యధర్మకర్మవిహీనుడై, సమాజంలో పతితుడై ఉండేవాడు. ఈ నియమంతో కూడిన సమాజమే వైదికసమాజం, లేక ద్విజసమాజం. ఈ సమాజాంతర్గతుడైన ప్రతివ్యక్తిన్నీ ద్విజుడే—అతడు బ్రాహ్మణక్షత్రియవైశ్యవర్ణాల్లో ఏ వర్ణానికి చెందినాసరే, లేక ఏ మిశ్రవర్ణానికి చెందినా సరే. ఏ వ్యక్తి ఒకసారి నైసర్గికంగా మానవజన్మను పొంది, వేదవిద్యవల్ల సంస్కృతుడై విశుద్ధుడై పవిత్రమైన ద్వితీయజన్మను పొందాడో అతడే ద్విజుడు. ఇతరులకు చదువు చెప్పుతూ పౌరోహిత్యం చేసే బ్రాహ్మణుడు ద్విజుడు. రాజ్యకార్యాల్ని చూస్తూ, యుద్ధం చేసే క్షత్రియుడు ద్విజుడు. గోపాలనవ్యవసాయవాణిజ్యాల్ని చేసేవైశ్యుడు ద్విజుడు. 6 వీరందరికీ సమగ్రమైన వేదాధికారం ఉంది. కర్మకాండ, జ్ఞానకాండల్లో వీరికి కల అధికారాన్ని ఎవ్వరూ కాదనలేరు. 7

సమాజస్థితికోసం, లోకస్థితికోసం వీళ్ళకు కొన్ని విధుల్ని అంగీకరించి, కొన్ని అనుష్ఠానాల్ని నిర్వర్తింపవలసి ఉండేది. ఈ అనుష్ఠానం పేరు యజ్ఞం. ఈ యజ్ఞంయొక్క తాత్పర్యం తెలీకపోతే వైదిక సమాజంయొక్క రహస్యం, వీరి జ్ఞానకర్మల ఇతిహాసం నిగూఢంగానే ఉండిపోతుంది. భారతవర్షచరిత్రయొక్క వైశిష్ట్యం అవగతం కాదు. కనుక, ఓపికతో మనం ఈ విషయాన్ని, క్లిష్టమైనా, పరిశీలిద్దాం. 'యజ్ఞం చేసినంత పని అయింది' అనే సామెత మనకు ఉండనే ఉంది.

## సమాజం కృత్రిమనిర్మాణం

ఇంకో విషయాన్ని గమనించాలి. అన్ని దేశాల్లోనూ, సర్వకాలమూ మనుష్యసమాజం అనేది ఒక కృత్రిమయంత్రం—స్వాభావికంగా ఏర్పడ్డది కాదు. సర్వత్రా, కొన్ని కృత్రిమఅనుష్ఠానాలద్వారా సమాజాన్ని బంధించిఉంచటానికి ప్రయత్నించినట్లుగా తోస్తుంది. అందుకనే మన పూర్వీకులు 'లోకస్థితి', 'లోకసంగ్రహం' అనే పదాల్ని ఎక్కువగా వాడారు. కొన్ని దేశాల్లో ఈ అనుష్ఠానాల సంఖ్య తక్కువ. కొన్నిట్లో ఎక్కువ. ఇప్పుడు ఆలోచించి చూస్తే, ఈ క్రియాకర్మల తాత్పర్యం మనకు బోధపడదు. ఒకప్పుడు ఏదో ఒక అర్థం ఉండిఉండవచ్చు, కాని ఇప్పు డేమీ తేలదు. కాని, పండితులు 'వైజ్ఞానికప్రణాళి' ని అనుసరించి, వీటి తాత్పర్యాన్ని కనుక్కొంటానికి ప్రయత్నిస్తున్నారు. ఇప్పుడు '**Anthropology**' అనబడే పురాతనమానవ-విద్యకు ఉన్నతమైన స్థానం

5. ధర్మజిజ్ఞాసా మకృత్వా న నివర్తయే దితి—తై. ఉ. శం. భా.

6. గీత: ౧౮-౪౧, ౪౪.

7. ఈవిషయాన్నిగురించి ఇంకా సమగ్రంగా తెలిసికొందామనే కుతూహలం ఉన్నవాళ్లు ప్రమాది-ఫాల్గుణ భారతిలో వెలువడిన 'ఛాయాగ్రహణం-వర్ణాశ్రమధర్మాలు' అనే నా వ్యాసాన్ని చూడవచ్చు.

లభించింది. దీన్ని పండితులు విజ్ఞానవిద్యగానే పరిగణిస్తున్నారు. మానవతత్త్వవేత్తలైన పండితులు వైజ్ఞానికరీతి ననుసరించే, మానవసమాజంలోని ప్రతి అనుష్ఠానానికీ తాత్పర్యాన్ని అన్వేషిస్తున్నారు.

## అన్వేషణారీతి

వీళ్లు అవలంబించే మార్గాలు రెండు. ఒకటి సరిపోల్చిచూడటం. రెండోది చరిత్రపరిశీలన. మొదటి మార్గం విభిన్నదేశాల్లోనూ, వివిధసమాజాల్లోనూ ఉన్న ఆచారాల్ని గమనించి, సరిపోల్చిచూడటం. ఏయే విషయాల్లో ఐక్యం ఉందీ, ఏయే విషయాల్లో భేదం చేదీ ఇట్టే చులాగ్గా తెలిసిపోతుంది. దీనివల్ల చాలా విషయాల గుట్టు విడివడుతుంది. రెండోపథాన్ని అవలంబిస్తే, దేశంయొక్క పురావృత్తం సాహిత్యంలో ప్రతిఫలిస్తుంది. దాన్నిబట్టి ఏయే ఆచారాలు ఎల్లాంటి మార్పులను, లేక పరిణామాన్ని పొందిందీ తేలిగ్గా తెలుస్తుంది. అప్పుడు ఆదిలో ఉన్న అర్థాన్నికూడా గ్రహించవచ్చు. ఈ సమాలోచనలవల్ల, ఇప్పుడు మనకు అర్థవిహీనంగా కనిపించే ఆచారాలకు పూర్వం ఒకప్పుడు ఏదో ఒక తాత్పర్యం ఉందని తేలుతుంది.

## క్రిస్టమస్ : సంక్రాంతి

మామూలు ఉదాహరణ నొకదాన్ని తీసికొందాం : ఇంగ్లీషువాళ్లు క్రిస్టమస్ పర్వంనాడు తమ ఇళ్లను మిస్లేటో (Mistletoe) అనే లతతో అలంకరించుకుంటా రనే విషయం సుప్రసిద్ధం. వేరే ఇంకో లతతో కాకుండా, ఈ లతతోనే ఎందుకు అలంకరించుకోవాలి అనే విషయానికి ఇప్పు డేమీ అర్థం కనపడదు. కాని, ప్రాచీనచరిత్రను మథిస్తే దీని అర్థం లభిస్తుంది. ఇంగ్లీషువాళ్లు ఇంకా ఆ దేశంలో అడుగు పెట్టని అతీతకాలంలో బ్రిటన్ దేశీయులు ఓక్ చెట్టును పూజించేవాళ్లు. ఈ మిస్లేటోలతకూడా ఓక్ చెట్టును ఆశ్రయించుకొని పాకుతుంది. ఈ లతకు అలౌకికశక్తి ఉందని బ్రిటనులు అనుకొనేవాళ్లు. క్రిస్టమస్ పర్వకాలంలో సూర్యుడు ఉత్తరాభిముఖుడైనప్పుడు, నవవర్షోత్సవం జరిగేటప్పుడు డ్రూయిడ్ లు ఓక్ చెట్టునుండి ఈ లతను తీసికొనివచ్చి ముక్కలుముక్కలు చేసి, తమ యజమానులకు పంచిపెట్టేవాళ్లు. ఈ మిస్లేటోలత ఇంట్లో ఉంటే లక్ష్మి బంధింపబడ్డ దన్నమాట. ఇది సర్వవ్యాధివినాశకము. కనుక, దీన్ని ఇంట్లో జాగ్రత్త పెట్టుకొనేవాళ్లు. ఇప్పు డా డ్రూయిడ్లూ లేరు, ఆ బ్రిటనూ లేదు. మిస్లేటోమాహాత్మ్యన్నీ ఎవ్వరూ విశ్వసింపరు. కాని, ఎవరు బ్రిటనును జయించి తమ హక్కుభుక్తమొనర్చుకున్నారో, ఎవరు తమ ప్రాచీన ధర్మాన్ని పరిత్యజించి కిరస్తానీమతాన్ని అవలంబించారో, ఆ ఇంగ్లీషువాళ్లుకూడా ఇప్పుడున్నూ క్రిస్టమస్ పర్వకాలంలో, పరాజితులైన బ్రిటనుల ఆచారాన్ని త్యజించలేకుండా ఉన్నారు. ఇప్పు డీ అనుష్ఠానం అర్థరహితం. కాని, ఒకప్పుడు దీనికి చాలా గొప్ప అర్థం ఉండేది. దేశచరిత్రను పరిశీలించటంవల్ల మన కీ విషయం తెలుస్తోంది.

క్రిస్టమస్ పర్వమే తీసికొందాం. సరిపోల్చి చూస్తే, ఈ ఉత్సవం ప్రతిదేశంలోనూ ఏదో ఒక రూపంలో ఉన్నట్లే కనిపిస్తుంది. సూర్యుడు దక్షిణంగా వెడుతూవెడుతూ ఒకరోజున ఉత్తరాభిముఖుడవుతాడు. అతి అసభ్యమైన జాతికూడా ఈ విషయాన్ని గమనించేఉంది. ఆ రోజు శీతఋతువుకు అవసానము. సమస్తపృథివిన్నీ తనమూర్తిని మార్చుకోటానికి ప్రయత్నిస్తుంది. అల్లాంటి రోజు అందరికీ ఆనందోత్సవం. మనంకూడా ఉత్తరాయణసంక్రాంతి నాడు నానావిధాలైన పుణ్యకార్యాల్ని చేస్తాం. జీసస్ క్రైస్టు జన్మదినం క్రైస్తవుల కెవ్వరికీ తెలీదు. కాని, జీసస్ నూతనధర్మాన్ని ప్రచారంచేసి, మానవచరిత్రలో ఒక నూతనఅధ్యాయాన్ని సృష్టించాడు. ఏ పర్వసమయంలో పృథివి అంతా నవజీవనాన్ని పొందటానికి సమాకాంక్షిస్తుందో, ఆ సమయంలోనే క్రీస్తు జన్మించి ఉంటాడని క్రిస్టియన్లు కల్పనచేసుకొన్నారు. పుణ్యమూర్తిఅయిన క్రీస్తు పుట్టుటకు పూర్వంకూడా ఈ పర్వానుష్ఠానం ఉండేది. అయితే దాన్ని రూపాంతరితం చేసి, క్రైస్టు జన్మోత్సవంగా పరిణమింపజేశారు. ఉన్న అర్థాన్ని ఊడగొట్టి కొత్త అర్థాన్ని అంటగట్టటమయింది.

పురాతనమానవవిద్య అవలంబించే వైజ్ఞానికరీతి ఇది. ఈ విద్య సర్వత్రా చాలా సమ్మానాన్ని పొందుతోంది. కాని, ఇది ఎంతగా బడాయికొట్టోందో, అంతగా ఫలప్రదం కాలేదు. పదేపదే అభిప్రాయభేదాలున్నూ, సంశయాలున్నూ. ఏ ఇద్దరు పండితులకూ పొత్తు కలీదు. కనుక, ఏ సిద్ధాంతాన్నీ గట్టిగా పట్టుకుంటానికి వీల్లేదు. అందువల్ల కించపడాల్సింది ఏమీ లేదు. విజ్ఞానవిద్యకు ఉన్న దోషమైనా ఇదే, గుణమైనా ఇదే. జ్ఞానాభివృద్ధితోపాటు, ఏ సిద్ధాంతానైనా పూర్ణతరమూ, పరిణతతమమూ చెయ్యటమే ఈ విద్యయొక్క పని. ఇది సంశయాకులమైన మార్గం. అయితే, ఇదే ఆశ్రయణీయమైన పంథ.

మతాభినివేశ మున్న చాదస్తపు క్రిష్టియన్‌తో, 'అయ్యా! మీ క్రిస్ట్మస్ పర్వంతో క్రీస్తుజన్మకు ఎల్లాంటి సంపర్కమూ లేదు. ఈపర్వం మనుష్యసాధారణమైన పర్వం' అంటే ఆయన కోపగించుకోవచ్చు. క్రీస్తు పుట్టింది ఆరోజూనే అని ఆయన జన్మాదిగా నమ్ముతూవస్తున్న విషయం. ఈ విశ్వాసప్రాబల్యం వల్లే, ఆయన ఈ ఉత్సవానుష్ఠానాలికి తన కున్న శ్రద్ధానురాగాల్ని సమకూర్చి, అర్పణ చేసుకుంటున్నాడు. ఈ విశ్వాసమూలం శిథిలమైతే, అతని ధర్మజీవనగ్రంథే ఊడిపోతుంది. కనుక, వైజ్ఞానికులు శత సహస్రప్రమాణాల్ని చూపినా, ఆయన తన విశ్వాసాన్నే దృఢంగా పట్టుకొనిఉంటాడు.

## బుద్ధి : విశ్వాసం

కనుక, ఫలితాంశం ఏమిటంటే: మనుష్యుడి ప్రవర్తన, కర్మలమీద బుద్ధి (Reason) ప్రభావం చాలా తక్కువ. సంస్కారవిశ్వాసాలే మనుష్యజీవితాన్ని నియమిస్తున్నాయి. బుద్ధి తప్పొప్పుల్ని చూపిస్తూ, శాసించి నియమింపగోరుతుంది. కాని సర్వతోభావమైన జయాన్ని ఇది పొందలేకుండా ఉంది. కర్మపథాన్ని అవలంబించిన మానవుడు సహజంగానే బుద్ధియొక్క అనుశాసనాన్ని మన్నింపడు. విజ్ఞానవిద్యకూ, మతానికీ విరోధం ఉందని మనం వింటూ ఉంటాం. ఈ విరోధం ఎప్పటికీ తొలగదు. దానికి మూలం ఇక్కడే ఉంది. సమాజస్థుడైన మనుష్యుడు కర్మల తాత్పర్యాన్ని గ్రహించాలంటే మనం ఈ విషయాన్ని మరిచిపోకూడదు. విజ్ఞానవిద్య ఏమైనా చెప్పనీగాక! మనుష్యుడు తన సంస్కారవిశ్వాసాల్ని తన ప్రకృతితో మేళవించుకొని, తదనుసారం కర్మల్ని చేస్తూఉంటాడు. సామాజిక-అనుష్ఠానాల్లో చాలా వాటికి మనకు ఇతివృత్తం దొరకదు. సామాన్యమానవుడికి దీన్ని తెలిసికొందా మనే వ్యగ్రత లేదు. కాని, ప్రత్యేకానుష్ఠానానికీ కల్పితమైన తాత్పర్యాన్ని రచించుకొని, దాన్నే పట్టుకొని ఉంటాడు. కల్పనాశక్తి లేనివాడు ఇతరులు ఇచ్చిన అర్థాన్నే అంగీకరించి ఊరుకుంటాడు. కల్పనాశక్తి ఉన్నవాళ్ళు నానావిధాలైన తాత్పర్యాల్ని ఇవ్వటం, అది లేని సాధారణ జనం దాన్ని గ్రహించటం ఇంతవరకూ లోకంలో జరుగుతూవస్తోంది.

ఆర్యజాతిలోని ఏశాఖ భారతవర్షంలో ప్రవేశించి వైదిక (ద్విజ) సమాజాన్ని స్థాపించిందో, వాళ్ళ ప్రధానానుష్ఠానం యజ్ఞం. దీనికి మూలం ఇంకా ప్రాచీనకాలంలో దొరుకుతుంది. ప్రాచీన భారతీయగ్రంథాల్నీ, పారసీకగ్రంథాల్నీ జోడించి చూస్తే కొంత తేలుతుంది. ఆర్యేతరసమాజాల్లోకూడా ఈ యజ్ఞానుష్ఠానం ఏదో ఒక రూపంలో పూర్వం ఉండేది. ఇప్పుడూ కొంచెం నిల్చిఉంది.

భారతవర్షంలో వైదికాచార్యులు కాలక్రమంగా దీన్ని పెంచి, ఇప్పుడు మనం 'యజ్ఞం చేసినంత పని అయిం'దని అనుకొనేట్టు చేశారు. చాలా అనుష్ఠానాల మూలతాత్పర్యం జనుల విస్మృతిలో పడ్డది. కాని, తాత్పర్యాన్ని ఆరోపించే కల్పనాశక్తిమంతులు తక్కువ కాలేదు. ఈ శక్తి భారతీయుల కున్నంతగా మరెవ్వరికీ లేదేమోకూడా!

బ్రాహ్మణగ్రంథాలు ముఖ్యంగా యజ్ఞవివరణికలు. ఏయే యజ్ఞాల్లో ఏమేమి చెయ్యాల్సిందీ చెప్పటమే వాటి పని. ఈ గ్రంథాల్ని ప్రచారంచేసినవాళ్ళ పేర్లు బ్రహ్మవాదులు. వీరి కల్పనాశక్తికి అంతు లేదు. వీళ్ళు మాటలు చెప్తూ ఒక్క అడుగు వెనక్కి వేసింది లేదు. బ్రాహ్మణగ్రంథాల్ని అధ్యయనం చేస్తే, వీళ్ల

ఒక్కొక్క అనుష్ఠానాన్ని వర్ణించుకోపోతూ, ఏ అనుష్ఠానానికి ఏ అర్థం ఉందీ, ఏ క్రియకు ఏం తాత్పర్యమో నిర్దేశిస్తూ ఉండటం కనిపిస్తుంది. ఏవిధమైన సంకోచమూ ద్విధా వీరి వాక్కుకు లేదు. అత్యంత సరళభావంతో తమతమ అభిప్రాయాల్ని వర్ణించుకోపోతున్నారు. వారి వదనసీమలనుంచి వాక్యాలు వెలువడుతున్నాయి—అంతే. వీటినిమిత్తం వాళ్ళకు ఏవిధమైన బాధ్యతా లేదు. అవి యుక్తియుక్తాలా, విచారసహాలా అని ఆలోచించే సమయమే వాళ్ళకు ఉన్నట్టు తోచదు. ఎవరి ప్రేరణవల్లో లోపలినించి వాక్యాలు వెలువడుతున్నాయి. వాళ్ళు చెప్పుకోపోతున్నారు. అక్కడక్కడ ఇద్దరు బ్రహ్మవాదులు రెండువిధాలైన అర్థాల్ని చెప్పుతూ, పరస్పరఖండన మండనాలు చేస్తూ ఉండటంకూడా కనిపిస్తుంది. కాని, ఇద్దరికీ ఎల్లాంటి సంకోచమూ ఉన్నట్టు తట్టదు. ఉభయ పక్షాలవారూ తమ మాటల్ని సమానతీవ్రతతోనే చెప్తూఉండటం చూస్తాం. ఈ ఉభయవాక్యాలూ వేదవాక్యాలే.

## వేదం

వేదం అంటే ఏమిటి? అంటే, ప్రత్యుత్తరించటం కష్టం. దీనికి సరియైన జవాబు మన శాస్త్రకారులూ ఇచ్చినట్టు తోచదు. వాళ్ళు చెప్పింది ఈమటుకే: వేదం రెండు భాగాలు, మంత్రబ్రాహ్మణాత్మకం. 8 సామాజికులకి ఈ రెండున్నూ సమానమూల్యం కలవే. ఈ రెండూ వేదవాక్యాలే: నిత్యాలు, అపౌరుషేయాలు. ఇవి ఏ వ్యక్తినీ కల్పించి చెప్పినవి కావు. వ్యక్తులు ప్రచారం చేశారు. ఈ మంత్రబ్రాహ్మణ ప్రచారకులే ఋషులు 9. వేదమంత్రాలు ఋగ్, యజుః, సామా లని మూడు విధాలు. ఋక్‌మంత్రాలు ఛందోబద్ధాలు—అంటే పద్యాలు. యజుర్మంత్రాలు ఛందోబద్ధాలు కావు—గద్యమే. గద్యమంత్రాలు. సామమంత్రాలు వేరుగా లేవు. ఋక్-మంత్రాల్ని స్వరబద్ధమొనర్చి పాడితే సామమంత్రాలవుతాయి. ఛందోబద్ధరూపంలో పఠిస్తే ఋఙ్మంత్రం; స్వరబద్ధమొనర్చిపాడితే సామమంత్రం. 10 యాజ్ఞికులు నిగదమంత్రా లనిన్నీ, ప్రైషమంత్రాలనిన్నీ ఇంకో శ్రేణికి చెందిన మంత్రాల సంగతి చెప్తారు. కాని, ఇవిన్నీ గద్యాలేకాబట్టి యజుర్మంత్రభేదా లనుకోవచ్చు. ఋక్, యజుః, సామా లనే మూడువిధాల మంత్రాలే ఉన్నాయి. కనుకనే, మంత్రాత్మకమైన వేదవిద్యను 'త్రయీవిద్య' అన్నారు.

## వేదాలు మూడా? నాల్గా?

వేదాలు మూడా, లేక నాలుగా అనే వివాదం ఒకటి ఉంది. వేదాల పేర్లు చెప్పటంలో ఋక్, యజుః, సామ, అథర్వా లని నాల్గుగా వింటూంటాం. కొందరు పండితులు ప్రాచీనకాలంలో మొదటి మూడు వేదాలే ఉండేవి అనిన్నీ, తర్వాత నాల్గోదైన అథర్వాన్ని వేదాల్లో చేర్చారనీ చెప్తూఉంటారు. ఇది సరియైన మాట కాదు. వేదమంత్రాలు మూడు విధాలు అనిన్నీ, మంత్రసంహితలు నాల్గనిన్నీ గ్రహించాలి. అధికంగా ఋక్‌మంత్రాలతో సంకలితమైన గ్రంథం ఋగ్వేదం. ఇదేవిధంగా యజ్ఞోపయోగాలైన యజుర్మంత్రాలతో సంగ్రహితమైంది యజుస్సు. యజ్ఞానుష్ఠానసమయంలో పాడబడే ఋక్-మంత్రాల కూర్పుసామవేదం. ఇల్లాంటి విభజన కందనివిన్నీ, యజ్ఞంలో ఉపయోగింపనివిన్నీ అయిన కొన్నిమంత్రాలు మిగిలిపోయాయి. ఈ మంత్రాల ఏకీకరణమే అథర్వవేదసంహిత. ఈ మంత్రాలు శాంతిస్వస్త్యయానాదికర్మలకు పనికివస్తాయి. కనుక, మంత్రభేదాన్ననుసరించి వేదాలు మూడనిన్నీ; 11 సంహితాభేదా న్ననుసరించి నాల్గనిన్నీ గ్రహించాలి. ఈ విభజన వ్యాసులవారు చేశారు.

(సశేషము).

---

8. వేదో హి మంత్రబ్రాహ్మణభేదేన ద్వివిధః.
—సాయన.

9. "ఋషయో మంత్రద్రష్టారో నతు వేదస్య కర్తారః"

10. (అ) తేషాం ఋగ్ యత్రార్థవశేన పాదవ్యవస్థా, గీతిషు సామాఖ్యా, శేషే యజుః శబ్దః.
—జైమిని. ౨-౧-౩౫. ౩౭.

(ఆ) ఇంతకంటే వ్యాపకమైన అర్థం:
మంత్రా మననాత్, ఛందాంసి ఛాదనాత్,
స్తోమః స్తవనాత్, యజు ర్యజతే రితి.
—యాస్క. ౭-౧౨.

11. (అ) త్రైవిధ్యంతు వేదమంత్రగతాభిప్రాయేన.
—సాయన.

(ఆ) ఋగ్వేదం భగవో ఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థమ్.

# కలగ [illegible] గాంప

## కీ॥ శే॥ కో. పున్నయ్యగారు

చిన్నప్పటి ధైర్యము చేసి, దేశముకాని దేశమునకు వెళ్లి, స్వయంకృషివల్ల పైకి వచ్చి, ఆంధ్రుల ప్రతిభాసంపత్తిని ఆసేతుశీతాచలమూ చాటిన ఆంధ్ర మహాపురుషుల్లో శ్రీ కోటంరాజు పున్నయ్యగారొకరు. ఆరితేరిన సంపాదకులుగా వీరు పత్రికా ప్రపంచములో అజరామరమైన యశస్సు గడించిరి. తెలుగుసీమ ఎక్కడ, సింధుభూమి యెక్కడ? ఈ జాతి ఎట్టిది, ఆ జాతి ఎట్టిది? అట్టి చోటికిగూడ వెళ్లి, ఆ ప్రజల హృదయాలను చూరగొని, అఖండమైన కీర్తి సంపాదించి ఆ సింధురాష్ట్రమును ఎన్నో విధములుగా అభ్యుదయమార్గము పట్టించినవారు శ్రీ పున్నయ్యగారు.

భారతీయపత్రికాప్రపంచంలో వీరి నెరుగని వారు లేరు. ఈ పత్రికారచనవృత్తిని వీరు మొట్టమొదట ఆంధ్రపత్రికలోనే ప్రారంభించి, బొంబాయిలో కొన్నాళ్లును, అటుపిమ్మట అది మద్రాసు వచ్చిన పిమ్మటకూడ కొన్నాళ్లును అందులోనే సంపాదకవర్గంలో పనిచేసిరి. తర్వాత వీరికి ఆంగ్ల పత్రికారచనమీద వ్యామోహం కలిగింది. దాంతో వెళ్లివెళ్లి కరాచీ చేరుకొని 'సింధు అబ్జర్వర్' పత్రికా సంపాదకులుగా కుదురుకొనిరి. ౨౬ ఏండ్లపాటు అందులోనే ఉండి మొన్నమొన్ననే తమంతట తాము ఆ పదవినుంచి విరమించుకొనిరి. అన్నేండ్లు ఒకే పత్రికకు ప్రధానసంపాదకత్వం నిర్వహించినవారు చాలా అరుదు. అంతేకాదు. దేశముకాని దేశము, ఆ సింధు రాష్ట్రంలో అనితరసాధారణమైన పేరుప్రతిష్ఠలు సంపాదించుకొనిరి. కరాచీలో వీరి పేరట 'పున్నయ్య నగర్' అని ఒక పేటకు పేరు పెలిసిందంటే అక్కడి ప్రజల ఆదరాభిమానాలను వీరెంతగా చూరగొన్నారో ఊహించుకోవచ్చు.



వీరి జన్మస్థలం బాపట్ల. చిన్నతనంలోనే వీరు బొంబాయికి వెళ్లిపోయి అక్కడే కొద్దిగా ఉన్నత విద్య నభ్యసించి, నెమ్మదిగా అక్కడనే ఆంధ్రపత్రిక వారపత్రికలో సంపాదకవర్గాన కాలు పెట్టి, క్రమశః 'ఇంతింతై వటు డింతయై' అన్నట్లు పత్రికారచనలో అలాఅలా పైపైకి వచ్చివేసి సమర్థమైన సంపాదకత్వంలోనూ, పత్రికానిర్వహణంలోనూ ఆంధ్రుల ప్రతిభను భారతదేశమంతటా చాటి కీర్తికెక్కిరి.

ఈపత్రికారచనలో వీరు స్వయంకృషివల్లను, ఆత్మీయప్రతిభవల్లనే వృద్ధికి వచ్చిరి. పట్టభద్రుడు కాకున్నను ఇంగ్లీషురచనలో మంచి కృషిచేసిరి. గొప్ప వక్త అనికూడ పేరు సంపాదించుకొనిరి. ఉపద్రవము తెచ్చిపెట్టని, నేర్పయిన విమర్శలతో వీరు సంఘం లోనూ, రాజకీయాలలోనూ, ధనికవర్గాలలోనూ, కొన్ని ప్రత్యేక గురుకూటాల్లోనూ ఉన్న కుళ్లునంతా తమ పత్రికద్వారా కడిగిపారవేసేవారు. తమకు న్యాయ మని తోచినచో ఎందరెన్ని అడ్డంకులు చెప్పినా వెను కాడని స్వతంత్రచిత్తులు వీరు.

పున్నయ్యగారు సహజంగా సంస్కరణాభి లాషి. తాము ప్రేమించిన శ్రీమతి డా. తారాబాయిని వివాహమాడేందుకై తన సంఘాన్ని కూడ వదలి పోయిన సాహసుడు. వీరిది ప్రేమవివాహము. ఉభయుల ప్రేమా పరిపక్వమై పరస్పరహృదయాలు కలిసిపోయినవి. వివాహానంతరం తన భార్యతోపాటు వీరు బ్రహ్మ సమాజంలో చేరిపోయిరి.

ఈయన పదహారణాల ఆంధ్రుడు. దశాబ్దాల తరబడి పరరాష్ట్రాలలో ఉండిపోయి అక్కడివారిలో ఒకడుగానే మెలగుతూవున్నా వీరిలో ఆంధ్రాభిమానం మాత్రం నిరంతరమూ నిండి తొణికిసలాడుతూ ఉండేది. తెలుగువారంటేసరి, ఎక్కడ కనబడినను ఈయనకు ప్రాణం లేచివచ్చేది. ఎంతో ఆప్యాయతను ప్రదర్శించే వారు. తాను తెలుగువాడనని ఎప్పుడూ గర్వించేవారు.

ఈయన సహజధీరోదాత్తుడు. ఎన్ని ఇడుములు వచ్చినప్పటికిని చలించని మేరుధీరుడు. దేశవిభజన ఫలితముగా ఏర్పడిన పరిస్థితిని అనుసరించి, ఉన్న దున్నట్లుగా ఇల్లువాకిండ్లనూ, ఉద్యోగమునూ వదలు కొని రావలసిన స్థితి దాపురించింది. ఇది చాల దన్నట్లు వీరి కుటుంబంలో ఒకటి వెంట ఒకటిగా ఎన్నో అవాంతరాలుకూడ వచ్చినవి. అల్లుడూ, ఒక కుమారుడూ ఆమధ్యనే విమానప్రమాదంలో మరణించిరి. మరొక కుమారుడూ, మనమడూ కొద్దినెలలక్రితమే మైనూరులో జలగండానికి లోనైరి. ఇన్ని విషాదపరిస్థితులకు పాల్పడియు వీరు సహజమైన ఆధ్యాత్మికతత్వముతో, ధృతి కోల్పోక నిబ్బరముగా నిలువగలిగిరి.

దిగులుతో కుంగిపోయిన భార్యఆరోగ్యం కొరకని బెంగుళూరులో కాలక్షేపము చేయుచుండి, గత నెలలో బొంబాయిలో జరిగిన అ. భా. పత్రికా సంపాదకుల సభకు పూర్వమిత్రు లందరిని చూడ వచ్చునుకదా అన్న ఆశతో బొంబాయి వెళ్ళినవారు, విధివశాన అక్కడనే గత నెల ౨౩ వ తేదీనాడు విషాద మరణానికి పాలైరి.

కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారికి వీరంటే ఎంతో అభిమానం. వారు బొంబాయిలో ఆంధ్రపత్రికను స్థాపించి, నడుపుచుండగా పున్నయ్యగారు వెళ్లి వారిని చూచినప్పుడు పరాయి రాష్ట్రమునకు వెళ్లుటకు సాధారణముగా సంకోచించు ఆంధ్రయువకుడు అంత దూరము ధైర్యముచేసి వచ్చుటచూచి, ఈయనలో ఏదో అసాధారణశక్తి ఉన్న దని పంతులుగారు వెంటనే వీరిని దగ్గరచేర్చిరి. అక్కడ ఉన్నంతకాలము వీరు పంతులుగారిదగ్గర కేవలము ఒక ఉద్యోగివలెగాక పంతులుగారి యింటి యందే వారి కుటుంబములో ఒకరుగా ఉండిరి. తమను వదలిపెట్టి సింధురాష్ట్రానికి వీరు వెళ్లిపోయేటప్పుడు కూడ అన్యరాష్ట్రాల్లో ఆంధ్రులజండా నిలుపబోతూ ఉన్నాడుకదా అని పంతులుగారు సంతోషమే కన బరచి, ఎట్టి నిరోధమూ చెప్పక ఆశీర్వదించి పంపిరి.

ఇటువంటి మహనీయుడు ఇంత అకస్మాత్తుగా అకాలమున మరణించినందుకు మేము మిక్కిలి చింతిల్లుచున్నాము. పున్నయ్యగారి మరణము యావద్భారతపత్రికారంగమునకు తీరనిలోటు. ఈయన మరణవార్త విని దుఃఖింపని పత్రికా రచయిత— ముఖ్యముగా తెలుగుదేశములో ఉండడు. ఈయనను ఆంధ్రదేశములో అనేకయువకపత్రికా రచయితలు ఒకవిధమైన ఆదర్శప్రాయునిగా ఎంచుకొనుచుండినా రనుటలో అతిశయోక్తి లేదు.

వీరి ఆత్మకు భగవంతుడు శాంతి సమకూర్చుగాక.

---

## సింహం

బ్రిటిషువాళ్ల ధర్మమా అంటూ మన దేశంలో దట్టమైన అడవులన్నీ సమూలంగా నాశంఅయ్యేక,

వాటితోపాటు వాటికి జీవంమోస్తరు వుండి, రాజులు వేటలాడే కాలంలో వారికి మిక్కిలి ప్రోత్సాహజనకాలయిన సింహాలూ కేవలం మృగ్యాలైనాయి. కాని, ఆ 'సింహం' అనే పదం మట్టుకు మన వాఙ్మయంలో విశిష్టమైన స్థానాన్నే ఆక్రమించుకుంది. కేవలం స్వతంత్ర్యంగానో, లేక ఉపసర్గగానో మన అనుదినజీవితంలో నిత్యవ్యవహారంలో ప్రయోగింపబడుతూంటూంది.

మచ్చుకు మనకు పొద్దస్తమానం 'సింహద్వారం'తోనే పని. ఏరాజైనా పట్టాభిషేకం చేసుకుంటే విధిగా 'సింహాసనం' ఎక్కాల్సిందే. 'సింహం' ఏ విధంగా మృగరాజుగా వుండి అడివిలో వుండే మృగాలన్నిటినీ సమదృష్టితో నిష్పక్షపాతంగా పాలిస్తుందో రాజైనవాడు సింహాసనంమీద కూర్చున్నప్పుడు అలాగే ప్రజలందరినీ నిష్పాక్షికంగా చూస్తాడు కాబట్టి ఆ ఆసనానికా పేరు కలిగి వుంటుంది. దీన్నే సింహపీఠము, సింహపీఠి అనికూడా అంటారు.

ఇంక 'సింహావలోకనం' చేస్తాము. గతవిషయాలన్నిటినీ విమర్శించడమో, లేక సంక్షిప్తంగా నెమరు వేయడమో చేస్తే ఈ పదం వాడుతారు. సింహానికి మిక్కిలి ఆకలైనపుడు భీకరంగా 'నాదం' చేసి, గంభీరంగా కొన్ని గజాలపాటు ముందుకు సాగి, ఒక్కసారిగా నిలిచి వెనక్కు అవలోకిస్తుంది. ఇదివరకే ఆ 'సింహగర్జన'కు జడిసి మూలమూలలా వుండే మృగాలన్నీ దిక్కు తెలీకుండా తలదాచుకోడానికి పరుగెత్తుతూ దాని ఆకటిచిచ్చుకు ఆహుతిఔతాయి.

'ఫలానా' ఆయనకు ఇంకో ఆయన అంటే 'సింహస్వప్నం.' అంటే కల్లోకూడా కనబడ్తుంటాడన్నమాట. కేవలం నడగొండల మోస్తరుండే మదపు టేనుగులకుకూడా కలలో సింహం కనబడిందంటే అవి తత్క్షణం ప్రాణం విడుస్తాయి.

ఈ 'సింహపరాక్రమాని'కి ముగ్ధులై కవిరాజులు తమ కావ్యంలో అమితమైన గౌరవం ఇచ్చారు. కీచకుణ్ణి సింహబలుడన్నాడు. 'రాక్షసుల నే గజయూథానికి సింహమువంటివాడా' అని ఒక కవి వర్ణిస్తే, ఇంకో కవి 'పరరాజు లనే మదపుటేనుగుల పాలిటి సింహమైనవాడా' అని పొగడ్తాడు. భాగవతంలో కవి కృష్ణుణ్ణి వర్ణిస్తూ రుక్మిణీదేవినోటితో 'పురుషసింహము' అని పల్కిస్తాడు. ఇంక కవులకు 'సింహమధ్య'లతోనే పని. వాళ్లు లేనిదే ప్రబంధాలు ఒక్కడుగు కూడా ముందంజ వేయలేవు.

అందరూ 'సింహేంద్రమధ్యమా'రాగం వినే వుంటారు. ఆ రాగంలో వుండే ఒడుపూ, ఔద్ధత్యమూ, ఠీవీ, ఆక్రోశమూ, ఉక్రోషమూ అంతా గంభీరమైన సింహగమనాన్నే పోలివుంటుంది.

ఇంతకూ మాది అసలు 'సింహపురి.' నరసింహస్వామి ఇష్టదైవతం. 'సింహాచల' క్షేత్రమాహాత్మ్యం వర్ణనాతీతం.

జి. సి. వి. రమణారావు.

—



శ్రీ పి. యస్. జి. భావనారావుగారు,
బి. ఇ., ఎ. యం. ఐ. ఇ.

కాకినాడ ఇంజనీరింగు కాలేజీలో అధ్యాపకులు. "పవర్ ప్లాంట్ ఇంజనీరింగ్"లో రెండేండ్లు ఉన్నతవిద్యాభ్యాస మొనర్చుటకు అమెరికాకు వెడుతున్నారు.



# విమర్శనము



## ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము

రచయిత: మల్లంపల్లి సోమశేఖర శర్మగారు. ప్రకాశకులు: ఆధునిక వాఙ్మయకుటీరము, ౨౨, దివాన్ రామయ్యంగారురోడ్డు, పురశైవాకము, మద్రాసు. వెల రూ. ౧-౮-౦.

భారతదేశచరిత్రలో ఆంధ్రదేశచరిత్ర ఒక మహోజ్జ్వలాధ్యాయము. రాజ్యపాలనలోను, వాణిజ్యములోను, వ్యవహారములలోను, సంస్కృతిలోను అన్నిట ఆంధ్రులు అనాదిగా ఖండఖండాంతరఖ్యాతి నార్జించినవారు. కాని ఆ వైన మెట్లో, అనుస్యూతముగా, ఆదినుండి ఇంతవరకు నడచినది నడచినట్లుగా తెలుపగల సిసలైన సమగ్రఆంధ్రదేశచరిత్ర మాత్రము ఇంతవరకును లేకనే పోయినది. ఎన్నాళ్ళనుండియో కించపడుచుండిన ఈ కొరతను రేడియోవారి పుణ్యమా అని శర్మగారు ఈ పుస్తకమూలమున తీర్చినందుకు ఆ ఉభయులను అభినందించుచున్నాము. విద్యార్థుల కని ఉద్దేశించి చేసిన ౧౨ ప్రసంగముల సంపుట మిది. క్రీస్తుపూర్వము మూడు శతాబ్దుల క్రిందటి సాతవాహన రాజులు మొదలుకొని ౧౮౫౮ నాటి కుంఫిణీపరిపాలన చివరివరకు నడచిన ఆంధ్రదేశచరిత్ర అంతయు ఇందులో పూసగ్రుచ్చినట్లు అనితరసాధారణమైన నేర్పుతో, మిక్కిలి అందముగా, కథలు చెప్పుకొని పోయినట్లు, సులభమైన పద్ధతిని, తేలికభాషలో వివరించినారు శర్మగారు. పట్టి రాచరికాల చరిత్రమాత్రమే కాక ఆనాటి ప్రజల సాంఘిక, సారస్వత, మత, రాజకీయ, సంస్కృతి జీవితవిశేషములనుకూడ తెలిపినారు. సంగ్రహరూపములోనే అయినను అనుక్రమమైన సమగ్రఆంధ్రదేశచరిత్ర ఇందులో అవగత మగుచున్నది. స్థూలదృష్టికి నీరస మనిపించు దేశచరిత్రనుకూడ శర్మగా రెంతో రసవంతముగా, పాఠకుల కొంతమాత్రమును విసుగు జనింపని విధమున, పై పెచ్చు చదువచదువ నువ్విళ్లూరునట్లు తీర్చి కూర్చినారు. ఇది ఉద్దిష్టమైనది విద్యార్థులకే అయినను ఆంధ్రులందరుకూడ అవశ్యము చదివి తీరవలసిన గ్రంథము. లేక లేక వెలసిన ఇటువంటి గ్రంథమును ఆంధ్రులు తప్పక ఆదరింతు రని నమ్ముచున్నాము.

---

## మన వారసత్వము

హుమయూన్ కబీరు ఆంగ్లరచనకు అనువాదము. అనువాదకులు: కొటూరి వెంకటేశ్వరరావుగారు. ప్రకాశకులు: కల్చరల్ బుక్స్ లిమిటెడ్, పెరంబూరు, మద్రాసు ౮. వెల రూ. ౧-౮-౦.

భారతదేశచరిత్రలో మన వారసత్వ మెటువంటిదో, మన తాతలనాటి సంస్కృతి యెంతపాటిదో తెలుపుటకై ప్రాచీన, అర్వాచీన చరిత్రలలోని కొన్ని మెరుగులను గ్రహించి ఒక క్రొత్త విజ్ఞానములో కూర్చిన గ్రంథ మిది. దీనికి వెంకటేశ్వరరావుగారి రసవంతమైన అనువాదము మరింత వన్నెలు దిద్దినది.

---

## శృంగార సంకీర్తనములు

రచయిత: శ్రీ తాళ్లపాక అన్నమయ్య. ప్రకాశకులు: శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్, తిరుపతి. వెల రూ. ౨.

తాళ్ళపాకవారు తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రాపకములో నుండిన ప్రాచీనగేయకవులు. వీరు ఆ ఏడుకొండలవానిమీదను, అలమేలుమంగాదేవిమీదను అనేకవేల కీర్తనలు ఆధ్యాత్మికముగాను, శృంగారపరముగాను వ్రాసి వాసికెక్కినవారు. వారి ఆ కీర్తన లన్నిటిని ఆ దేవస్థాననిర్వాహకులు రాగిరేకులలో వ్రాయించి భద్రపరచి పదిలముగా కాపాడిపెట్టి వాఙ్మయమున కమూల్యమైన సేవ చేసినవారైనారు. ఈ పదములలో ఎన్నో అపూర్వశబ్దార్థసంపదలును, ఆ ప్రాంతీయుల వైలక్షణ్యమునకు నిదర్శనమైన సంప్రదాయములును నిక్షిప్తములై యున్నవి. కాగా, ఇవి వాఙ్మయమున కెంత అమూల్యములో వేరే చెప్పనక్కరలేదు. ఈ కీర్తనములే బహుశా తెలుగు

భాషలోకెల్ల మిక్కిలి ప్రాచీనమైన దనియూ ఒక ప్రసిద్ధి యున్నది. ఇటువంటి అమూల్యకీర్తనలను కాల గర్భములో కలిసిపోకుండ ఇంతకాలము పదిలపరచి నందుకు ఆ దేవస్థాననిర్వాహకులును, వీనిని ఉన్న వున్నట్లుగా ప్రకటించి అందలి విశేషములను చాట బూనిన తిరుపతిప్రాచ్యవిద్యాపరిషత్తువారును మిక్కిలి అభినందనార్హులై యున్నారు.

ఇదివరకే ఆ దేవస్థానమువారు తాళ్ళపాకవారి గేయరచనలను కొన్నిటిని మూడు సంపుటములుగా ప్రకటించినారు. ఇది ఆ దృష్టిని నాల్గవ దన్నమాట. ఇందులో తాళ్ళపాకవారిలోనే ఒకరైన అన్నమా చార్యులు రచించిన ౧౭౯ శృంగారసంకీర్తనము లున్నవి. వీని నాయికానాయకులు పద్మావతీ శ్రీని వాసులు. భావములలోను, భాషలోను వీనియందు చాల క్రొత్తందనములు గోచరించుచున్నవి. ఆనాటి సంప్ర దాయములు కూడ ఎన్నో ఇందులో పొడగట్టుచున్నవి.

ఈ సంపుటిపరిశోధనభారమును వహించిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆనాటి భాష యొక్క తీరుతీయములను బాగుగా ఎరిగినవారు కావు నను, ఇందలి వైలక్షణ్యముల విలువను గ్రహించినవారు కావునను, వెనుకటి సంపుటుల పరిష్కర్తలవలె కాక, బహుజాగ్రత్తగా, మూలమైన రాగిరేకులను మరిమరి పరిశీలించి, వీనిని ఒక క్రమవిధానము ననుసరించి పరిష్కరించి చక్కగా కూర్చినారు. మిగిలిన వానిని కూడ ఇట్లే జాగ్రత్తగా పరిష్కరించి, అందలి విశేష ములను కూడ క్రమశః ఆంధ్రులకు అందీయగలరని నమ్ముచున్నాము.

---

### ఇండియా

మార్క్సు, ఏంజెల్సు భారతదేశంవిషయమై వ్రాసిన లేఖలు. అనువాదం : జగన్మోహన్. వెల ఒక రూపాయి. దొరికే చోటు : విశ్వసాహిత్యమాల, రాజమహేంద్రవరం.

భారతదేశంలో పూర్వం సమాజవ్యవస్థ ఎల్లా ఉండేది? దాని బాగోగు లేమి? అది క్రమేణా ఎల్లా శిథిల మైంది? బ్రిటిష్‌వారు అందుకు ఎల్లా దోహదమై తమ స్వార్థదోపిడి కొనసాగించారు? ముందు ముందు భారతసమాజవ్యవస్థ ఏ రూపు దాల్చవచ్చు?—ఈ అంశాలన్నీ మేధావులూ, ఆర్థికశాస్త్రవేత్తలూ అయిన మార్క్సు, ఏంజెల్సు ఈ లేఖలలో ప్రస్తావించారు.

జగన్మోహన్ గారి అనువాదం మూలానికి 'మక్కీకి మక్కీ' అనువాదం గాకుండా, భావాను వాదంగా ఉన్నట్లయితేనూ, మార్క్సు, ఏంజెల్సులను గురించీ, వారి ఉత్తరాలు వ్రాయవలసి వచ్చిన కారణాలూ, పరిస్థితుల గురించీ సామాన్యపాఠకునికి తెలిసేందుకు వీరు పూర్వాపరాలు వివరించి ఉంటేనూ పుస్తకం బాగా సుబోధకంగా ఉండేది.

మ. స. శ.

---

## గ్రంథ స్వీకారము

### ఆంధ్ర కువలయానందము

రచయిత : కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. ప్రకాశకులు : శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటు, తిరుపతి. వెల రూ. ౩-౧౨-౦.

### పేదరాలు

పిరాండిల్లో, మాక్సింగోర్కీ మొదలైన కొందరు విదేశీకథకుల కథల సంపుటి. వెల అ. ౧౨.

### విలాసిని

చకోవ్ కథల సంపుటి. వెల ౧౨ అ.

పై రెంటికిని అనువాదకుడు : విద్వాన్ విశ్వం గారు. ప్రకాశకులు : నవ్యసాహిత్యమాల, అనంత పురము.

### మణిమేఖల

పద్యకావ్యము. కవి : చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, తెలుగు పండితులు, బోర్డు హైస్కూలు, పొన్నేరి, చెంగల్పట్టు జిల్లా. వెల అ. ౧౨.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press.
No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.




# లిప్టన్స

అంటే అర్థం
మంచి టీ

TX 152 TG



# మీ జుట్టు ఈ విధంగా అదుపులేకుండా ఉంటే



# స్వస్తిక్ పరిమళ ఆముదం వల్ల దాన్ని అదుపు చెయ్యండి

మీ జుట్టు ఉంగరాలు తిరిగి ఒత్తుడు పడక ఎదురు తిరిగేదయితే, ఏదో ఒక తల నూనె ఏదైనా సరే అనుకుంటే కాదు. ఇల్లాంటి జుట్టులో ఉండే శోభ నంతనూ స్వస్తిక్ వారి పరిమళ ఆముదం వెలికి తెస్తుంది. ఈ జుట్టును మీరు సరిగా ముస్తాబు చెయ్య గలిగేట్టు చేస్తుంది. మనోహర సుగంధ పరిమళ మిళితమైన స్వస్తిక్ పరిమళ ఆముదం అభిరుచు లెరిగిన స్త్రీ పురుషులకు ప్రియమైనదిగ గణుతి కెక్కింది.

స్వస్తిక్ వారి నాణ్యమైన ఇతర వస్తువులలో కొన్ని: కాంతి సబ్బు.
స్వస్తిక్ షేవింగ్ స్టిక్. బట్టల సబ్బులు.
గోవాలిన్ బ్రాండు వనస్పతి మొదలైనవి.



## స్వస్తిక్ పరిమళ ఆముదం

భారతీయులై ఉండండి.



స్వస్తిక్ ఆయిల్ మిల్సు లిమిటెడ్

బొంబాయి

SHILPI    Sem 21 Telugu

సేల్సు డిపో, మద్రాసు: నెం. 14, స్ట్రింగర్ వీధి, బ్లాక్ టౌన్, మద్రాసు.
సేల్సుడిపో, బెంగుళూరు: ఆర్కాట్ శ్రీనివాసాచారి వీధి, బెంగుళూరు సిటీ.
సేల్సు డిపో, కొచ్చిన్ కల్వెట్టు రోడ్డు, కొచ్చిన్.




# మంచి రుచి అయినది — చాలా బాగుండును

బోర్న్-విటాలో ఎముకలను నిర్మాణంచేసే ద్రవ్యాలు, బలమిచ్చే ద్రవ్యాలు 95%కు ఎక్కువగా ఉన్నవి. ఇందుకు తోడు, ఇది చాలా రుచిగా ఉంటుంది. జీర్ణశక్తిని వృద్ధి చేస్తుంది, తేలికగా విపాకమౌతుంది. ముఖ్యంగా స్త్రీలు గర్భవతులుగా ఉన్న సమయంలోను, వ్యాధి నుంచి తేరుకొనేటప్పుడు ఇది బాగా ఉపయోగపడుతుంది.

కాడ్బరీస్

# బోర్న్-విటా

కాల్సియం (సున్నము), విటమినులు ఎక్కువగా ఉన్నవి.



# విషయానుక్రమణిక

## సెప్టెంబరు, 1948



[illegible] చిత్రము : [illegible]



శ్రమపరిహారము

(శ్రీమతి సుశీలాయావల్కార్ త్రివర్ణ చిత్రమునకు నకలు.)